ఓమ్

# శ్రీ పాతంజల యోగసూత్రములు



1974 సం॥రం ఏలూరు శ్రీ చాతుర్మాస్య మహావ్రతమునందు

**శ్రీ వ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు**

**పూజ్యపాద శ్రీశ్రీశ్రీ విద్యానందగిరి స్వాములవారి**

## ప్రబోధసారము




శ్లో॥ వ్యాసాశ్రమే తు పుణ్యేస్మిన్ గుర్వధిష్ఠాన మందిరే।
పవిత్రం శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే ॥


సంకలనకర్త :

మాతృశ్రీ చోడే వెంకటరమణమ్మ గారు
గౌరీమందిరము, శ్రీవ్యాసాశ్రమము.



1998.

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1998



ప్రతులకు :—

మాతృశ్రీ చోడే వెంకటరమణమ్మ గారు
గౌరీమందిరము, శ్రీ వ్యాసాశ్రమము-పోస్టు, 517 621.
(వయా) ఏర్పేడు మండలం,
చిత్తూరు జిల్లా. (ఆం.ప్ర.)

---

ధార్మిక గ్రంథ ప్రచురణకు రచయితలకు ఆర్థిక సహాయం అనే పథకము క్రింద తిరుమల తిరుపతి దేవస్థానము వారిచ్చిన ఆర్థిక సహాయంతో ఈ గ్రంథం ప్రచురింపబడినది.

---

ముద్రణ :—

శ్రీ విజయ సాయి ప్రింటర్స్,
ఏర్పేడు - 517 619, చిత్తూరు జిల్లా.
ఆంధ్ర ప్రదేశ్.



శ్రీ శ్రీ శ్రీ మహర్షి

సద్గురు మలయాళ స్వాములవారు

శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులు

ఓమ్



శ్రీశ్రీశ్రీ విమలానందగిరి స్వాములవారు

శ్రీ వ్యాసాశ్రమ ప్రథమ పీఠాధిపతులు



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# ప్రకాశకుల మనవి

శ్లో॥ అసంగానంద గుర్వాద్యాం విమలానంద మధ్యమామ్।
విద్యానందాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్॥

దైవాత్మ స్వరూపులగు పాఠక మహాశయులకు మనవి!

1974 సం॥రం ఏలూరులో మాగంటి వీరయ్యగారు పుష్పావతమ్మగార్ల ఆధ్వర్యమున పూజ్యపాదులు శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ విద్యానందగిరి స్వాములవారు చాతుర్మాస్యవ్రత సందర్భమున పతంజలి యోగసూత్రములను ప్రబోధించిరి. శ్రీ గురుదేవుల వారు; నేను ఆశ్రమమునకు వచ్చినప్పుడే ఉదయం సాయంత్రం ఉపన్యాసమునకు వచ్చునప్పుడు నోటుబుక్కు పెన్నులు తెచ్చుకొని మీరు బాగున్నవని తోచిన వాక్యములను వ్రాసిపెట్టుకొనవచ్చునని చెప్పిరి. అది మొదలు బుక్కు పెన్ పట్టుకొనుట వ్రాసికొనుట అలవాటయిపోయినది. ఆ యలవాటు ప్రకారమే పతంజలి యోగ సూత్రములు కూడ వ్రాసికొంటిని అప్పుడప్పుడు కొన్ని పనులుండుటవలన కొన్ని సూత్రములు వ్రాయుటకు వీలుపడలేదు.

4 సం॥రంల క్రితం కొన్ని గ్రంథములు వ్రాయుట ప్రింటు చేయించుట ఖర్చుపెట్టుటజరిగినది. కాని దీనిని ప్రింటుకు ఇవ్వలేదు. 4 సం॥రంల క్రితం తిరుపతి దేవస్థానం తరుపున ఇతరులు వ్రాసిన గ్రంథములకు డబ్బులిచ్చే యేర్పాటువున్న ఆఫీసర్లు ఇద్దరు ఆశ్రమం వచ్చిన సందర్భమున నేను వ్రాసిన గ్రంథములు కొన్ని వారికి ఇచ్చితిని. అవిచూచి మీ వద్ద ప్రింటు వేయవలసిన గ్రంథములున్నవో మేము వేసెదము లేదా మీరు వేయించుకొన్నచో కొంత డబ్బు సహాయము చేయుదుమని చెప్పిరి. దానితో ఈ గ్రంథము జ్ఞాపకమువచ్చి శ్రీ పాతంజల యోగసూత్రములకు పూజ్యశ్రీ

శ్రీ విద్యానంద స్వాములవారి ప్రవచనం వ్రాతప్రతి వున్నదనగా సరే యివ్వండని చెప్పిరి. అప్పుడు దానిని సాఫు వ్రాసితిని. అప్పటి వరకు చిత్తుప్రతిగానే యున్నది. నాకు జ్ఞాపకంకూడా లేదు. వారు ఆ మాటలనడంతో జ్ఞాపకం వచ్చినది.

ఈ పాతంజల యోగ సూత్రములకు మూలపురుషులు ముగ్గురు వారు

శ్లో॥ వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిమ్।
పాణినిం సూత్రకారంచ ప్రణతోస్మి మునిత్రయమ్॥

ఈశ్వరుని 14 డమరుక శబ్దములను 14 సూత్రములుగా గ్రహించి పాణిని వ్యాకరణ గ్రంథమును అష్టాధ్యాయిగా రచించెను. వరరుచి వాక్యములను వ్రాసి దానిని కొంత పెంచెను. దానికి పతంజలి మహర్షి భాష్యమును వ్రాసెను.

శ్లో॥ యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోస్మి॥

తా॥ యోగము చేత చిత్తమలమును, వ్యాకరణము చేత వాగ్దోషములను, వైద్యము చేత శరీరమునందలి మలమును తొలగించిన మునిశ్రేష్ఠుడైన పతంజలికి నా మనసా వచసా సాష్టాంగ వందనములు.

కలియుగ ప్రత్యక్ష దైవము శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి నా హృదయపూర్వక సాష్టాంగ వందనములు.

తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథ ప్రచురణ కమిటీ వారు ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించినందుకు వారికి నా కృతజ్ఞతావందనములు.

ఇట్లు
శ్రీ సద్గురు పాదధూళి
చోడే వెంకటరమణమ్మ

ఓమ్

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీ పాతంజల యోగసూత్రములు

## 1వ పాదం సమాధి పాదః

సాంఖ్యములు రెండు రకములు ఒకటి నిరీశ్వర సాంఖ్యము రెండు సేశ్వర సాంఖ్యము. కపిలునిది నిరీశ్వర సాంఖ్యము పతంజలిది సేశ్వర సాంఖ్యము నిరీశ్వర సాంఖ్యమనగా ఏ సాంఖ్యమందు ఈశ్వరుడు లేడో అది. కపిల మహర్షి పురుషునికంటే ఈశ్వరుడున్నాడని అంగీకరించలేదు. ప్రకృతి పురుష వివేకమే మోక్షము అనెను.

సేశ్వర సాంఖ్యము ఈశ్వరునితో కూడిన సాంఖ్యము. పతంజల మహర్షి ఈశ్వరుడున్నాడని అంగీకరించెను. కపిల మహర్షి చెప్పిన పదార్థములన్నియు, అంగీకరించి ఈశ్వరునికూడా అంగీకరించెను.

భక్తుడు ఈశ్వరుని భక్తితో సేవించినచో నిరంతరాయముగా యోగము సిద్ధించును అందుచేత ఆ రీతిగా అంగీకరించెను.

ఈశ్వర ప్రణిధానాద్వా

అంటే యోగమునకు విఘ్నములు 'రాకుండా, ఉండుట. ఈశ్వరుని ప్రణిధానంవలన విఘ్నములు నశించును. ప్రణిధానం అనగా శరణాగతి. అంటే శరణాగతిలో నిరహంకారము కలుగును. ఈశ్వరుడు మనసులో నిలుచును. అందువలన సమస్త దోషములు. పోయి నిర్విఘ్నముగా యోగముసిద్ధించునని పతంజలి అంగీకరించెను.

## యోగపాదము

1. సూ॥ అథ యోగాను శాసనమ్

గ్రంథారంభమున అథ శబ్దము నుచ్చరించుట మంగళము ను సూచించుచున్నది. మనము ఎచ్చటికైనా ప్రయాణమగునప్పుడు

మంగళ వాద్యము వినిపించినచో ఆ కార్యము మంగళకరమగును. అదే విధముగా అథ శబ్దము కూడా శ్రవణమాత్రమున మంగళప్రదముగాన ఇచట అథ శబ్దమునకే యర్థము చెప్పినను మంగళకరమేనని సూచించుచున్నది.

యోగమనగా సమాధియని భాష్యకారులు చెప్పిరి. యోగము సైతము చిత్తభూమికలైదింటి యందు నను వర్తించియుండు చిత్త ధర్మము.

యోగము అనగా సమాధి. చిత్త వృత్తులను నిరోధించుట యోగము.

సామాన్యము, విశేషము అని రెండు విధములు సామాన్యమనగా మట్టి విశేషమనగా కుండలు. ఈకుండలలో మట్టి యున్నది కదా! విశేషమునందు సామాన్యము లీనమై యుండును.

సంప్రజ్ఞాత. అసంప్రజ్ఞాత అని సమాధులు రెండు విధములు. క్షిప్తము, మూఢము, విక్షిప్తావస్థలో యోగము లేదు. ఏకాగ్రత నిరుద్ధములలో యోగమున్నది సంప్రజ్ఞాతసమాధి కలుగుతుంది మూడు దోషాలు లేనిదే లక్షణం. ఆ మూడు దోషాలు 1. అతివ్యాప్తి 2. అవ్యాప్తి 3. అసంభవము అనేవి. అతివ్యాప్తి అనగా స్వలక్ష్యమునందు ఉంటూ అలక్ష్యమునందు కూడ లక్షణము ఉండుటను అతివ్యాప్తి అందురు. ఉదాహరణ శృంగిత్వం గోత్వం — కొమ్ములు గలది ఆవు అన్నచో బఱ్ఱె, మేక మొదలగు వానికి కూడా కొమ్ములుండును. అందువలన గోవుకు చెప్పిన శృంగిత్వం అను లక్షణము అతివ్యాప్తిదోషగ్రస్తమైనది,

అవ్యాప్తి అనగా లక్ష్యైకదేశా వృత్తిత్వమ్. అవ్యాప్తి అనగా సంపూర్ణలక్ష్యమునందుగాక లక్ష్యముయొక్క ఏక దేశము నందుండుటను అవ్యాప్తియందురు. ఉదాహరణ :- నీలవర్ణత్వం

గోత్వం = అంటే నల్లగాయున్నది గోవు అని. కానీ ఈలక్షణ మునకు ఆవు మాత్రము లక్ష్యము కావున ఎర్రనివి తెల్లనివికూడా ఆవులుండును. అప్పుడు ఈ లక్ష్యము వాటియందు పట్టదు. సంపూర్ణ లక్ష్యమునందు లేక కేవలం నలుపురంగు ఆవులయందే లక్షణ ముండుట వలన ఈ లక్షణము అవ్యాప్తి దోషగ్రస్తమైనది.

అసంభవం: లక్ష్యమాత్రావృత్తిత్వం

అనగా లక్ష్యమునందు లేకుండుటను అసంభవదోషమందురు. ఉదా॥ ఏకశఫత్వం గోత్వం = ఒక గిట్టకలది ఆవు అను లక్షణము. లక్ష్యమైనటువంటి ఏ గోవునందును లేకుండుటచే ఈ లక్షణము అసంభవ దోష గ్రస్తమైనది.

సాస్నాదిమత్త్వం గోత్వం=అనగా గంగడోలు గలదిగోవు అని. అనగా గంగడోలు కొమ్ములు కలది గోవు అగును. తోండముకూడా గంగడోలు కలదు కానీ కొమ్ములు లేవు కనుక సాస్నాదిమత్వం గోత్వం. యోగము అనగా సంప్రజ్ఞాత ఏకాగ్రావస్థ, అసంప్రజ్ఞాత యనగా నిరుద్ధావస్థ ఇవి యోగముచేత గ్రహింపదగినవి. రజోగుణ తమోగుణ వృత్తుల నిరోధమే యోగము. దీనివలన అతివ్యాప్తి లేదు. అంతేగాని సత్వగుణ నిరోధముకూడా యోగము అని కాదు. సత్వగుణ వృత్తి ఉండవచ్చును. అతివ్యాప్తిలేదు. రజోగుణ, తమోగుణ వృత్తుల నిరోధమే యోగము ఇది సామాన్యము.

1. క్షిప్తము 2. మూఢము 3. విక్షిప్తము 4. ఏకాగ్రము 5. నిరుద్ధమని ఇవి చిత్తభూమికలు

క్షిప్తము, మూఢము, విక్షిప్తములలో యోగము వర్తించదు. అతివ్యాప్తిలేదు ఏకాగ్రము నిరుద్ధములతో యోగము వర్తించును.

యోగమునకు అవాంతర ఫలములు అంటే విభూతి అనగా మహిమలు, జ్ఞానమునకు అవాంతర ఫలములు జ్ఞాన మోక్షము. యోగము అనగా చిత్తైకాగ్రత సమాధియొక్క ధ సంప్రజ్ఞత, అసంప్రజ్ఞాత సమాధులు. క్షిప్తము = అనగా రజో ప్రధానంవలన విషయముల యందు మనస్సు విక్షిప్తపడుచుండు మనస్సు ధర్మి, విషయములు ధర్మములు

మూఢం అనగా నిద్ర, ఆలస్యము మొదలైన వృత్తులు కలి మనస్సు ఇది తమోగుణ ప్రధానమైనది.

విక్షిప్తం : అనగా కొంత తమస్సు కొంత రజస్సు కలసిరజస్సు ఎక్క వగా యున్నప్పుడు మనస్సు చంచలంగాను తమస్సు ఎక్కువ యున్నప్పుడు నిద్ర ఆలస్యము, కునుకుపాట్లు కలిగియుండును.

సత్వగుణం ఎక్కువగా యున్నచో ధ్యానం చక్కగా కు దును. ఇట్టి రోజు ఆనందంగా యుండును ఇది అప్పుడప్పుడు కలు చుండును.

ఏకాగ్రతలో- రజోగుణ, తమోగుణములు అణగిపోయి సత్వ శాగా యుంకును. దీనివల్ల ఏకాగ్రత బాగా యుండును ఎప్పు మనస్సు ప్రశాంతముగా యుండును. లక్ష్యములో మనస్సు బా ఏకాగ్రతగా యుండును. ఇది సంప్రజ్ఞాత సమాధి. విషయాకారవ పొందినచో అది వృత్తియగును.

నిరుద్ధం- అనగా అసంప్రజ్ఞాత సమాధి ఇదే నిర్వికల్ప సమాధి. ఈ స్థితిలో స్వరూప సంధానమేయుండును. చిత్తవృత్తులు నశించినప్పుడ ఏకాగ్రత కలుగును. ఇదే సమాధి. చిత్తములో సత్వరజస్తమో గుణములుండును. చిత్తవృత్తులంటే రజోగుణ, తమోగుణ వృత్తుల నిరోధించడమును సంప్రజ్ఞాత సమాధి అందురు. నిరుద్ధములోఅసంప్ర జ్ఞాత సమాధి కలుగును. సంప్రజ్ఞాతసమాధి అభ్యసించుచు రాగా

కాగా చిత్తము యొక్క రజోగుణ తమోగుణములు అణగిపోయి నశించిపోయి ఏకాగ్రత కలుగును.

గోవుకు లక్షణం అవ్యాప్తి అంటే "నీలవర్ణత్వం గోత్వం" అంటే నల్లని గోవులయందే పట్టును. "శృంగిత్వం గోత్వం" అంటే గోవుయందును ఇతరమైన బఱ్ఱె మేక మొదలగు వాటియందు ఆలక్షణమున్నందున ఇది అతివ్యాప్తి ఐనదందురు. ఒక్కగిట్టగలది గోవు అంటే ఒక్క గిట్ట గోవుకు ఉండదు గోవు గిట్ట చీలి యుండును. ఇది దీనికి పట్టదు. ఇది అసంభవము "సాస్నాదిమత్వం గోత్వం" అంటే సరిపోయినది. "సాస్నా" అంటే గంగడోలు "ఆదివల్" అంటే కొమ్ములు అని తీసికొనవలెను. ఇవి గోవుకు తప్ప ఏటికీ లేవు

యోగము అనగా సమాధి యోగశాస్త్రమును నేను ప్రారంభించుచున్నాను. ఇది మొదటి సూత్రమునకు అర్థము.

2. సూ॥ యోగశ్చిత్త వృత్తినిరోధః

చిత్తవృత్తులు నిరోధించుట యోగము అయితేగాఢనిద్రలో చిత్తవృత్తులు లేవుకదా అంటే గాఢ నిద్రలో చిత్తమే లేదు, ఇక వృత్తులు ఎక్కడ వుండును. సమాధి అంటే రజోగుణ, తమోగుణ సత్వగుణ వృత్తుల నిరోధమే ఇదియే యోగము ప్రమాణ సంశయము గురువుల ద్వారా శాస్త్ర శ్రవణము చేయుట వలన తొలగును. ప్రమేయ సంశయం మననం వలన పోవును. అనగా శాస్త్రములో చెప్పిన దానిని బ్రహ్మముగా మననం చేయవలయును విపరీతభావన:- అనగా ఆ బ్రహ్మ ఒక్కటియా? లేక రెండా? అనేది ఇది నిదిధ్యాస వలన తొలగును. అజ్ఞానము జ్ఞానము వలన తొలగును. శాస్త్రము అంతా బ్రహ్మమని చెప్పును. మనకు అంతా ప్రకృతివలె తోచును. అవి తొలగినచో "అహం

బ్రహ్మాస్మి" అనేది బోధపడును. సంప్రజ్ఞాత సమాధిలో రజస్తమో వృత్తులు పూర్తిగా నశించును. సాత్త్విక వృత్తియుండును. అసంప్రజ్ఞాత సమాధిలో సాత్త్వికవృత్తి కూడా లేదు శుద్ధమయిన అద్దములో ముఖము ప్రత్యక్షముగా కనుపించునట్లు స్వస్వరూపము అంతఃకరణలో ప్రకాశించును. అపంచీకృత పంచభూతముల వలన పురుషుని ప్రతిబింబము అంతఃకరణలో ప్రతిబింబించును. బుద్ధి వృత్తి ఏ విషయాకారముగా ఉంటే ఆఆకారముగా పురుషుడు ఉండును. పురుషుడంటే ప్రతిబింబము పురుషుడంటే అంతఃకరణలో ప్రతిబింబించినవాడు బింబము, ప్రతిబింబముని రెండు కలవు, ఇది బాగా గ్రహించవలెను.

## బింబము ప్రతిబింబము ఉపాధి

బింబము అనగా ముఖము. ఉపాధి అనగా అద్దము ప్రతిబింబమనగా అద్దములో కనుపించే ముఖము. అలాగే ఆత్మకు కూడా మూడున్నవి. బింబమనగా ఆత్మ ఉపాధి అనగా అంతఃకరణము ప్రతిబింబమనగా అంతఃకరణములో ప్రతిబింబించేవాడు. అని గ్రహించవలెను. ప్రకృతి పురుషునకు విషయ సమర్పణచేస్తూ వుండును. ప్రకృతి పురుష వివేకమే జ్ఞానము. బుద్ధి వృత్తిలో రకరకముల విషయాకారములు కలిగినప్పుడు అది ప్రతిబింబమగును. బింబరూపుడైనది పురుషుడు. అంతఃకరణ విషయాకార పరిణామము పొందడమే వృత్తియుండును. ఈవృత్తులు సత్వరజస్తమో గుణములతో యుండును. కేవలము చిత్తము యొక్క రాజస, తామస వృత్తుల నిరోధమునే చెప్పిరి. సంప్రజ్ఞాత సమాధిలో సాత్త్విక వృత్తులు ఉండును ధ్యానము నందు మనస్సు ఇతర విషయములయందు పోకపోయినచో రజోగుణము పోయినది. నిద్ర లేదు కనుక తమోగుణము పోయినది. లక్ష్యమునందు ఏకాగ్రముగాయున్నందున సత్వగుణమున్నది. ఇది సంప్రజ్ఞాత సమాధి.

ఇది సామాన్య లక్షణము చదువునప్పుడు కూడా చదువునందే ఏకాగ్రత కలిగియున్నచో అది సాత్విక వృత్తి వలన కలుగును. కనుక అది సంప్రజ్ఞాత సమాధియగును. అలాగాక చదువుచుండగా ఇతర విషయముల మీద మనస్సు పోయినచో రజోవృత్తియున్నట్లు అలాగాక నిద్రకునికిపాట్లు వచ్చినచో తమోవృత్తియున్నట్లు గ్రహించవలెను. వృత్తియున్నచో అసంప్రజ్ఞాతసమాధి కాజాలదు. సంస్కారము మాత్రమున్నచో అది అసంప్రజ్ఞాత సమాధి యగును.

అసంప్రజ్ఞాత సమాధిలో సాత్వికవృత్తికూడా నిరోధమగును. సంస్కారము మాత్రముండును. చిచ్ఛక్తి అంటే చైతన్యము. బుద్ధి వృత్తిలో ప్రతిబింబించినచో వృత్తియగును. బుద్ధి వృత్తి నశించినచో స్వస్వరూపములోనే వుండును. ఎట్లంటే జపా కుసుమవలె (దాసాని పూవువలె)

బుద్ధి విషయాకారముగా పరిణమించినప్పుడు చైతన్యము ప్రతిబింబించును బుద్ధివృత్తి లేకపోయినచో స్వస్వరూపమాత్రమై యుండును. ఎట్లంటే స్ఫటికము తెల్లగానుండును ఎర్రని పుష్పము సమీపమున పెట్టినచో ఎర్రగా కనిపించును. పుష్పమును తీసినచో తెల్లగానుండును.

అలాగే బుద్ధివృత్తి లేకపోతే చైతన్యము స్వస్వరూపములోనుండును.

బుద్ధివృత్తి పుట్టినప్పుడు చైతన్యమెట్లుండునని శంక రాగా: స్ఫటికము వద్ద పుష్పమున్నచో ఎర్రగా కనిపించినా స్ఫటికము మాత్రము తన స్వస్వరూపం వదలనట్లు చిచ్ఛక్తి అనగా చైతన్యము బుద్ధి వృత్తి కలిగినా తన స్వస్వరూపమును వదలదు నిరోధమనగా నాశము వృత్తులు లేకపోయినచో స్వస్వరూపములో

నుండును. కానీ వృత్తి వచ్చినచో ఆ వృత్తి మాదిరిగా కనుపించును. కాని చైతన్యము తన స్వస్వరూపములోనుండియే బుద్ధి వృత్తి పుట్టినప్పుడు యే వృత్తి పుట్టిన ఆ యా కారముగా చిచ్ఛక్తి ప్రకాశించును. అంతేగానీ చిచ్ఛక్తి తన స్వస్వరూపమును విడవదు, స్వరూపములోయుండియే చైతన్యము కూడా ఏ ఏ వృత్తి పుట్టిన ఆయా వృత్తిగా కనుపించుచుండును.

స్ఫటికము స్వచ్ఛమైనదైనను పుష్పసాన్నిధ్యమువలన ఎర్రగా కనిపించినా తన స్వరూపమును వదలదు. అది పరిశుద్ధమైనది, కనుక స్ఫటికము స్వస్వరూపమునుండి జారలేదు. అట్లే చిచ్ఛక్తి లేనిచో చైతన్యము స్వస్వరూపములోనుండును బుద్ధివృత్తి పుట్టినచో చైతన్యము తన స్వస్వరూపమును వదలకనే ఆ వృత్తి రూపముగా గోచరమగును. అంతేగానీ స్వస్వరూపమునుండి చైతన్యము జారదు.

2 సూ॥ యోగశ్చిత్త వృత్తి నిరోధః [ఇది చైతన్యము]

స్వరూపములోనున్నది. వృత్తిసారూప్యమనగా చైతన్యములో బుద్ధి వృత్తి గల్గినప్పుడు ఎట్లుండుననిన వృత్తి బహిర్ముఖమైనను చైతన్యము అనగా చిచ్ఛక్తి తన స్వస్వరూపమును విడువకనే వృత్తుల రూపముగా గోచరించును.

అంతా బ్రహ్మమే అయినా మనకు ప్రపంచము గోచరించు చున్నదంటే మన సంస్కారము వలన ప్రపంచముగా వృత్తి పుట్టి-ప్రపంచముగా అనగా ఎనుబది నాలుగు లక్షల రకాలుగా వృత్తులు పుట్టి-అయా ఆకారములుగా కనుపించుచున్నవి. కాని వాస్తవముగా, వున్నది బ్రహ్మము ఒక్కటే "నేహనానాస్తి కించన" బ్రహ్మము కంటే ఇతరము కించిత్తు కూడా లేదు. వృత్తులన్నియు పోయినచో అదే అసంప్రజ్ఞాత సమాధి.

యోగమునకు లక్షణము చిత్తవృత్తి నిరోధము. చిత్తమున్నది. ఆ చిత్తమునకు వృత్తులు లేకపోయినచో స్వస్వరూపములోనే ఈశ్వరుడుండును.

నేత్ర వృత్తి ప్రమాణం వృత్తిలో ప్రతిబింబించిన చిచ్ఛక్తి ప్రమ చైతన్యము జ్ఞాత. ఇదే ప్రమాత వృత్తి అనగా విషయాకారముగా పరిణమించిన అంతఃకరణమే నేత్ర శ్రోత్రాదుల ద్వారా చూచి గ్రహించిన ప్రకారము అంతఃకరణ ప్రమాణము.

15 సూ॥ దృష్ట అనుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్

అని చెప్పబడిన వశీకార వైరాగ్యము సంపాదించిన వానికి సంప్రజ్ఞాత సమాధి లభించును. దీనికి పురుషఖ్యాతి అనగా ప్రకృతి పురుష వివేకము కలుగును. పురుషఖ్యాతి అనగా 16 సూ॥ తత్పరం పురుషఖ్యాతేః గుణవైతృష్ణ్యమ్॥ అను సూత్రముచే పరవైరాగ్యము ప్రకృతి పురుష వివేకమునందు సహిత మాశలేకుండుట ధ్యానములో ఈలోక సంబంధం కలవి. పరలోక సంబంధమైనవి వచ్చుచున్నవా లేదా అని, దోషాలు వున్నవి లేనివి బాగా చూచుకోవలెను. ధ్యానములో లక్ష్యము నందు నిలిచినచో పరమపురుష సాక్షాత్కారము కలుగును. కనుక చేష్టలలో మాటలలో సంకల్పములలో ప్రయత్నపూర్వకముగా మార్పు తెచ్చుకోవలెను. మార్చుకున్నచో తప్పకుండా ఒకరోజు ఆత్మ సాక్షాత్కారము లేక లక్ష్యసిద్ధి కలుగును.

సంకల్పములు పురుషసాక్షాత్కారమునకు ప్రతిబంధకములు అగును. వశీకార వైరాగ్యము బాగా సంపాదించుకొన్నచో పరమ పురుష సాక్షాత్కారము కలుగును. అప్పుడు ఈలోకములోగల త్రిగుణములయందు విరక్తి కలుగును. అప్పుడు పరమ

వైరాగ్యము కలుగును. పరమ వైరాగ్యము అసంప్రజ్ఞాత సమాధికి సాధనమగును.

3 సూ॥ తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్॥

బుద్ధి వృత్తియే స్వభావముగా గలది, చిత్త శక్తి. గోడ వున్నది, ఆ గోడలో ముఖము కనుపించదు. ఎందువల్ల అనగా శుద్ధము చేయలేదు కనుక. అద్దము శుద్ధము చేయబడినందున ముఖము స్వచ్ఛముగా కనిపించును. అయితే ఈ రెండూ పృథ్వీతత్వములే. అంతఃకరణము శుద్ధముయినది. ఆత్మ సిద్ధము ఘటపటాదులు సాధ్యములు. బ్రహ్మాకార వృత్తియే బ్రహ్మజ్ఞానము. స్వరూపము తెలియక పోవడమే అజ్ఞానము చిత్తములో దోషములున్నందువలనే స్వరూపజ్ఞానము లేక పోవును.

"తదా" అనగా చిత్తవృత్తి నిరోధము కలిగిన తరువాత ద్రష్టుః అనగా పురుషునకు "స్వరూపే = నిజరూపమునందు" అవస్థానం = ఉనికి కలుగుచున్నది.

నిరోధ వృత్తులు నశించిన దశ వ్యుత్థానదశ, చిత్త వృత్తులు కలిగిన దశ. చిత్తమునకు ఏవృత్తి కలిగిన ఆ ఆకారమును పొందును, యోగమున్నచో వృత్తి నిరోధమగును. వృత్తులున్నచో ఆస్వరూపముతో పురుషుడు ఉంటాడు. అనగా ప్రతిబింబము పురుషునకు ప్రతిబింబమునకు భేదమును గ్రహించలేరు. అంటే ఆత్మానాత్మ వివేకము లేనందున ఇద్దరు ఒక్కటే అనుకొందురు, దీనినే తాదాత్మ్యమంటారు. చిత్తమునందుగల విషయములే పురుషునియందు ప్రతిఫలించును. అంతేగానీ పురుషుని యందు లేవు ఆత్మానాత్మ వివేకము లేకపోవుట వల్లనే పురుషుని చిత్తవృత్తులను ఏకముగా భావించెదరు. దీనినే వేదాంతులు అధ్యాస అంటారు. అంటే అది కాని దానియందు అదే అనుబుద్ధి వుండుటయే. అంటే రజ్జువునందు సర్ప

బుద్ధివలె, అంతేగాదు ఎప్పుడయిన సర్పమగునా! లేదుగా ఇది అధ్యాస ఇది మందాంధకారములో సంధ్యాకాలములో కలుగును.

అదే రీతిగా శాస్త్రము 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని చెప్పినా మనకు ఆ ఉన్న పరబ్రహ్మమునందు ప్రపంచ బుద్ధి ప్రపంచానుభవము కలుగుచున్నదంటే మనుష్యులు పశువులు పక్షులుగా చూచెదముగానీ బ్రహ్మముగా చూడము. భ్రాంతి వల్లనే అలాగున కనిపించును. ఎవరైతే ఇదియంతయు బ్రహ్మమని తెలిసికొందురో వారు మాత్రము జ్ఞానులు. మిగిలిన వారందరు అజ్ఞానులే ఇది అధ్యాస.

4 సూ॥ వృత్తిసారూప్యమితరత్ర

చిత్తముతో పురుషుడు తాదాత్మ్యము పొంది ఉండుటయే అజ్ఞానము చిత్తములో వృత్తులు లేకుండుటయే జ్ఞానము. అంతఃకరణవృత్తి ఏవిషయములను గ్రహించునో పురుషుడు ఆ విషయమును గ్రహించినవాని వలె యుండును. ఎట్లనగా పొలము గుండ్రముగా ముక్కోణముగా నలుచదరముగా యున్నచో ఆ చేనులో నీరు పెట్టినచో ఆనీరుకూడా ఆ చేను వలెనే యుండును. అట్లే స్ఫటిక మణి తెలుపు అయినను దాని సమీపములో ఏరంగు పుష్పము పెట్టిన ఆ రంగుగా ఆ స్ఫటికము ప్రకాశించును. అంతేగాని స్ఫటికము ఎప్పటికీ శుద్ధమయినదే.

అలాగే పురుషుడు పరిశుద్ధమయినవాడే. అయినా చిత్తము వృత్తిరూపములుగా నున్నచో భేద జ్ఞానము వలన పురుషుడు కూడా అప్పుడు కలిగిన వృత్తిరూపముగా నున్నట్లు గోచరించును. పురుషుడు నిర్వికార స్థితిలో నున్నప్పుడు వృత్తులు లేవు. వృత్తులు లేనప్పుడు, స్వస్వరూపములోనుండును. వృత్తులు కలిగినచో ఆ వృత్తిరూపమును పొందును.

5 సూ॥ వృత్తయః పంచతయ్యః క్లిష్టాఽక్లిష్టాః

చిత్తమునకు సంబంధించిన వృత్తులు అనేకములున్నను శాస్త్రకారులు అయిదు వృత్తులనుగానంగీకరించిరి. అవి క్లిష్టములు అక్లిష్టములు అని రెండు రకములు. పంచక్లేశములను గురించి ముందుసూత్రములో వచ్చును.

అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశముల అను ఐదుతో కూడిన చిత్తము క్లిష్టమనబడును, వైరాగ్యాది గుణములతో కూడిన చిత్తము అక్లిష్టము. ఇది కలిగినప్పుడు పురుషుడు స్వస్వరూపములో నుండును.

6. సూ॥ ప్రమాణ విపర్యయ వికల్పనిద్రాస్మృతయః

1. ప్రమాణము 2. విపర్యయము 3. వికల్పము 4. నిద్ర 5. స్మృతి అని నిరోధింపవలసిన చిత్త వృత్తులకు పేరులు వరుసగా ఈ పంచ వృత్తులకును లక్షణమును చెప్పదలంచి వానిలో మొదటిదిగా ప్రమాణమను చిత్తవృత్తిని గురించి తెలుపబడును.

7 సూ॥ ప్రత్యక్షాను మానాఽగమాః ప్రమాణాని ఇచ్చట ప్రమాణ వృత్తిని గురించి చెప్పుచున్నారు. వేదశాస్త్రములలో మూడు ప్రమాణములే 1. ప్రత్యక్షమును నాస్తికులు సామాన్యులు అంగీకరించెదరు. 2 అనుమానము బౌద్ధులు అంగీకరించెదరు. 1) ప్రత్యక్షము 2) అనుమానము, 3) అగమము 4) ఉపమానము 5) అర్థాపత్తి 6 అనుపలబ్ధి ఇవి ప్రభాకర మతము వారు అంగీకరించెదరు. వేదాంతులుఅంగీకరించే 1 ప్రత్యక్షము 2 అనుమానము 3అగమము అను ప్రమాణములను పతంజలి మహర్షి అంగీకరించెను.

స్థూల శరీర రోగము పోవుటకు ఆయుర్వేదమును, సూక్ష్మ శరీర రోగములు అంటే మల, విక్షేప ఆవరణలు పోవుటకు యోగమును అంగీకరించెను. స్థూల శరీర ధర్మములు జాతులు, ఆశ్రమ

ములు, స్త్రీపురుషాదులు ఇవి ఆత్మ ధర్మములుకావు. సూక్ష్మ శరీరరోగములైన మలవిక్షేప ఆవరణలు పోయినచో స్వస్వరూపము గోచరించును.

భగవద్గీత 'తత్త్వమసి'ని బోధించుచున్నది. భగవద్గీత ప్రవృత్తి ధర్మమును నివృత్తి ధర్మమును బోధించుచున్నది. నివృత్తిధర్మము జ్ఞానవైరాగ్య సంబంధమైనది. ప్రమఅంటే యథార్థజ్ఞానము భ్రమ అన్నను అప్రమ యున్నను ఒక్కటే. దూరము నుండి చూచినచో ఘటము అదే దగ్గరగా వచ్చి చూచినా ఘటమే. ఇది ప్రమ అలాకాక దూరము నుండి చూచి సర్పము అనుకొని దగ్గరికి వెళ్ళి చూచినచో త్రాడు కనుక దీనిని భ్రమ అని అప్రమ అని అంటారు.

1 చెరువు 2 తూము 3 కాలువ 4 పొలము చెరువులోనుండి నీరు తూము గుండా కాలవ ద్వారా పొలములో ప్రవేశించును. ఆనీరు, చేను ఆకారమును పొందును. అనగా అంతఃకరణ (చెఱువు) నుండి ఒక వృత్తి (తూము) బయలుదేరి నేత్రం (కాలువ) ద్వారా బయటకు వెళ్ళి దేనిని చూచునో (ఇది పొలము) ఆ ఆకారముగా పరిణమించును. దీనినే అంతఃకరణవృత్తి అంటారు. వస్తువును చూడకపోవడము ఆవరణ. ఆ వస్తువును తెలిసికొనడమే జ్ఞానము. నేను తెలిసికొన్నాను అనేది ప్రమ విషయాకార అంతఃకరణ ప్రమాణము.

దూరమునుండి చూచినసూదగ్గర కెళ్ళిచూచినా ఒకేలాగున ఉన్నది ప్రమ. ఇది యథార్థజ్ఞానము దూరము నుండి ఒకలాగున దగ్గరకు వెళ్ళి చూచిన ఇంకొకటిగా వున్నచో అది భ్రమ అదే అప్రమ అనుమాన ప్రమాణము 1. పక్షము 2. సాధ్యము 3. హేతువు 4 దృష్టాంతము. దేనియందు సందిగ్ధముండునో అది పక్షము పొగయున్నచోట అగ్ని యున్నది.

ఒక పర్వతము మీద పొగ కనుపించుచున్నచో అక్క-
అగ్నియున్నదన్నమాట

పర్వతము పక్షము వహ్ని సాధ్యము. పొగ హేతువు. అం
కారణము. ఇదివరకో వంట ఇంటిలో పొగనుచూచి లోప
చూడగా అగ్నియున్నది. అని తెలియుటవలన పర్వతము మీ
పొగనుచూచి అగ్ని ఉన్నట్లు నిశ్చయించుకొనడము, దృష్టాంతవ
ఇది అన్వయ (వ్యాప్తి)

(నిప్పులేనిచోట పొగయుండదు పొగలేనిచోట కాల్చి
యినుములో వహ్ని (నిప్పు) ఉన్నదిగదా! లేదని మీరెట్లంటారు
కనుక యిల్లు వ్రాయవలె నిప్పులేనిచోట పొగయు ఉండదు-అ
చెప్పుట వ్యతిరేక వ్యాప్తి ఇది వ్యతిరేక వ్యాప్తి ఆగమ ప్రమ
ణము — "యజేత స్వర్గ కామః" స్వర్గము కావలెనన్న ఇచ
ఎవనికియున్నదో వాడు యజ్ఞము చేయవలెనని వేదము చెప్పినది
వేదము చెప్పకముందు స్వర్గమున్నదని తెలియదుగదా! కను
వేదము ప్రమాణము. స్వర్గము ప్రత్యక్షముగా తెలిసికొనజాలనిది
అనుమానము చేతకూడా స్వర్గమున్నది తెలిసికొనజాలరు. కొన్ని
పదార్థములు మనకంటితో చూడకపోయినా అనుమానమువల
నిశ్చయ జ్ఞానము కలుగును. అంటే పొగవలన అగ్నియున్న
నిజము గదా. కనుక అనుమాన ప్రమాణము కూడా అంగీకరించ
వలెనని బౌద్ధమతము.

అనుమానము వలన ఒక వస్తువుని ఊహించి తెలిసికొ
వచ్చును. కానీ స్వర్గమును ఊహింపజాలము. పొగఉన్నచో పొ
ప్రత్యక్షమయినచో అగ్నిని ఊహించవచ్చును. కొంత ప్రత్యక
మయినచో ఊహించవచ్చును, గానీ ఏమీ ప్రత్యక్షము కాదు
కపిలుడు మొదలగు వారు ఆగమమును కూడా అంగీకరించిరి

ప్రత్యక్షప్రమాణంవలన తెలియదగినవి. ఘటపటాదులు(అనుమాన ప్రమాణముపోగ అగ్ని) ఆగమ ప్రమాణం వేదము.

ఉపమానం అనగా గవయ మృగమును చూచిగోవు అను కొనుట. పూర్వమీమాంసకులు ప్రభాకరులు. ప్రభాకరమతస్థులు భాట్టులు.

అర్థాపత్తి అనగా పీనో దేవదత్తో దివాన భుంక్తే దేవదత్తుడు. పగటి పూట భోజనము చేయుడు కాని బలసియున్నాడు. అంటే రాత్రిపూట బాగా భుజించుచున్నమాట అనుపలబ్ధి ప్రమాణం = ఇక్కడ ఘటమున్నచో ప్రాప్తించియుండేది. ఇక్కడ ఘటము లేదు కనుక ప్రాప్తించదు. ఇది అభావము అనగా ఇక్కడ ఘటము లేదు కనుక

8 సూ॥ "విపర్యయోమిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్" విపర్యయం అంటే మిథ్యాజ్ఞానము అనగా అతద్రూప ప్రతిష్ఠము. ఇది విపరీత వృత్తి సంధ్యా సమయములో త్రాడును పాము అను కొని దగ్గరకు వెళ్ళి చూస్తే రజ్జువు. ఇదే అతద్రూప ప్రతిష్ఠం ఇదే విపర్యయము దీనినే మిథ్యా జ్ఞానము అని అంటారు.

9 సూ॥ శబ్దజ్ఞానాను పాతీ వస్తుశూన్యః వికల్పః॥ పురుషుడు వేరు చైతన్యము వేరు అని అనుకొనడమే వికల్పము. నిజముగా చైతన్యమే పురుషుడు. పురుషుడే చైతన్యము, రాహువు వేరు. శిరస్సు వేరుగా లేదు. రాహువుఅంటే శిరస్సే. శిరస్సుకంటే వేరుగా రాహువు లేదు.

10 సూ॥ అభావ ప్రత్యయా లంబనా వృత్తిర్నిద్రా॥

భా॥ అభావమునకు కారణమైన తమస్సును, ఆశ్రయముగా కలిగిన వృత్తినే నిద్ర అంటారు. అభావమనగా ఉన్నది తెలియక పోవడమే, ఇది తమస్సు వలన కలుగును. చిత్తమున్నంతసేపు

జాగ్రదవస్థగాని స్వప్నావస్థగాని యుండును. స్మరణము అంటే స్మృతి. ఇది పూర్వము ఎప్పుడో అనుభవించియున్నందునసే స్మరణకు వచ్చును. అనగా తిరుపతి వెంకటేశ్వరులను దర్శించి వచ్చిన తరువాతఇక్కడకూడామనస్సులో ఆ వెంకటేశ్వరులు కనుపించును. సంస్కారమువల్లనే అట్లు కనుపించును. స్మృతికి బీజము అనుభవమే.

చిత్తముంటేనే వృత్తియుండును. కానీ గాఢ నిద్రలో చిత్తము వుండదు. గాఢ నిద్రపోయి లేచిన తరువాత హాయిగా నుండును. నిద్రలో నాకు ఏమియు తెలియలేదు, సుఖముగా నిద్ర పోయినానని తెలియునుగదా! ఇది ఒక అనుభవము. కలిగింది నిద్రావస్థలో అనుభవించిన విషయము. జాగ్రదవస్థకు వచ్చిన తరువాత స్మరణకు వచ్చును.

నిద్రలో అనుభవము కలిగినదిగదా! అక్కడ అప్పుడు చిత్తము లేదు గదా! అన్నచో చిత్తము అసలే లేదు అని అర్థము గాదు. నిద్రావస్థలోనున్న చిత్తము జాగ్రత్ స్వప్నావస్థలలో చేసిన పనిని నిద్రావస్థలో ఆయా కార్యము చేయుటకు యోగ్యత లేనిదిగానున్నది. నిద్రలేచిన తరువాత స్మరణ చేయును. దీనికి దృష్టాంతము బావిలో ఒక వస్తువు పడిపోయి నందున ఒక వ్యక్తి బావిలో దిగి ఆవస్తువు వాని చేతికి దొరికినను వెంటనే లోపల నుండి చెప్పజాలక పోవుచున్నాడు. కానీ బయటను వచ్చిన తరువాత దొరికినట్లు చెప్పుచున్నాడు గదా. అనగా వాగింద్రియము నకు అధిదేవత అగ్ని. అగ్నికి నీటికివిరోధము ఆవ్యక్తి నీటిలోదిగిన వెంటనే అధిదేవత అయిన అగ్ని వదలిపోయిన కారణమున నీటిలో మునిగి యుండగా చెప్పజాలక బైటికి వచ్చిన తరువాత మరల వాగింద్రియ అధిదేవత అయిన అగ్ని చేరుట చేత అప్పుడు దొరికిన దని చెప్పగలిగాను.

11వ సూ॥ "అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః॥"

అనుభవించిన విషయములు చిత్తములో స్ఫురింపకపోయినచో అసంప్రమోష యగును.

సంప్రమోషమంటే అనుభవము. అంటే సంస్కారము దానిని మరల మరల స్మరించడమే స్మృతి అగును. అంటే అనుభవ జన్యజ్ఞానము స్మృతి. ఇప్పుడే తెలిసినచో అది జ్ఞానం. దానిని మరల మరల స్మరించడమే స్మృతి. అది లేకపోతే విస్మృతి అంటారు. ఇక్కడ ఆరవ సూత్రములో చెప్పిన వృత్తులను వివరించడమైనది.

12వ సూ॥ అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః॥

అభ్యాస వైరాగ్యములు లేక పోయినచో పైన చెప్పిన అయిదు వృత్తులు నశించవు. వృత్తులు నశించకపోతే స్వరూప సుఖం లభించదు. కనుక ఆ వృత్తులను నాశనం చేయవలెను. అప్పుడు స్వస్వరూప ఆనంద సుఖము, మోక్షము పొందగలము. ఇప్పుడు మనము అనుభవించేది స్వరూప సుఖముగాదు. స్వరూప సుఖమును అనుభవించవలెను. అభ్యాస వైరాగ్యముల చేతనే మనస్సును జయించ వచ్చునని భగవంతుడు కూడా చెప్పెను.

13 సూ॥ తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః॥

ఆ చిత్తవృత్తులను నిరోధించుటలో చిత్తము స్థిరముగా నుండు విషయమున దాని కంగములగు యమ నియమాదుల యందు తత్పరుడగుట యభ్యాసమనబడును. ఈ అభ్యాసమును ముముక్షువు అభ్యసించుచున్నచో చిత్తము వశమగును.

అయితే ఈ అభ్యాసము ఎంత కాలము చేయాలని అంటే ఎప్పుడో ఒకసారి చేస్తే సరిపోవును గదా అంటే అది కుదరదని చెప్పిరి. అదే "సతు"

14 సూ॥ సతు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః

స॥ — ఆది

అభ్యాసం వల్ల వైరాగ్యంవల్ల సంభవించును. అభ్యా మనగా నిశ్చల స్థితిని పొందుటకు యత్నము. మాటిమాటికి ఉత్సాహముతో యోగి యమనియమాదులను చేయడమే దీనితో కూడ విషయములయందు దోషదృష్టితో వైరాగ్యము కలిగియుండవలెను. ఇది ఒక్కసారిగాదు. కొంత కాలముగాదు "సతుదీర్ఘకాలం" అ చెప్పెను. భగవంతుడు గీతయందు కూడా "అనేక జన్మ సంసిద్ధి తతోయాతి పరాంగతిమ్" అని చెప్పెను. అనేక జన్మలే గడ పోవును.

చేయవద్దన్నది చేస్తారు. మరలా మనస్సు ఏకాగ్రతగా యుండవలెనంటే అటు ఇటు పోవునని యందురు. 1. శాస్త్రము 2. గురువాక్యము 3. యుక్తి 4. అనుభవము. ఈ నాలుగు కలి నట్టి విచార పరుడు మాత్రమే ఉన్నతోన్నత స్థితిని పొందును "దీర్ఘకాలం" అంటే చాలా కాలము. అంటే పన్నెండేండ్లు అయి సరిపోవునా అంటే కాదు. అది నైరంతర్యం అనగా వ్యవధానము లేకుండా చేయాలి. దర్భాసనం తప్పక యుండవలెను. సిద్ధాసనం వైరాగ్యాలతో శీలించాలి అంతరం వస్తే అనగా వేరే విషయములు వస్తే మనస్సు పోతుంది. అంతరంలేకుండా తైలధారవ యుండవలెను. కేవలం ధారా ప్రవాహంగా యుండిననేచాలదు అందుకే "సత్కారాసేవిత" అన్నారు. అనగా శ్రీ స్వాములవారి చెప్పిరే గానీ నాకు ఏమి కలుగలేదని అనుకుంటారు. అలాగా గురువుగారు మహాత్ముడు అనియు వారు చెప్పిన ప్రకారం చే ఆ సాధనవల్ల నేను సంసార సాగరమును తరించిపోతాననే విశ్వా ముండాలి. అలాగాక సత్కారము లేకపోతే జనికిపాట్లు శరీర

బరువు విక్షేపాలు కలుగుట యుండును. అంటే అనుష్ఠానమందు ఆదర భావము లేక నిరాదరణగా యుండుటయే కారణము. ఆదరణ భావములో చేస్తే కునికిపాట్లు అవలింతలు మొదలైన విఘ్నములు రావు. కనుకనే దీర్ఘకాలము, నిరంతరము, సత్కారమని, మూడు విధములు తెలిపిరి. తన సాధన ఎంతవరకు వచ్చినదో చూచుకోవాలి. ఎట్లన దృఢభూమి కంగిన వారికి భ్రమర కీటక న్యాయముగా "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" ఆ పురుగు భయమువలన భ్రమరమును భావించి కడకు భ్రమరమే యగును.

అలాగే బ్రహ్మభావన కలిగినవారు కడకు బ్రహ్మమైపోతారు. వారే బ్రహ్మైవభవతి. శ్రీ సద్గురు స్వాములవారు, రమణ మహర్షి మొదలైనవారు ఆ స్థితిలో యున్నారు కనుకనే మనము పూజించుచున్నాము. మనుష్యజన్మ సిద్ధించినది కనుక ఈ రీతిగా జీవితాన్ని సార్థకము చేసికొనవలెను.

15వ సూ॥ దృష్టాను శ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యం

వైరాగ్యము రెండురకములు అది అపర వైరాగ్యం పర వైరాగ్యం, అని అంటారు, అపరవైరాగ్యం నాలుగు రకములు అవి 1 యతమాన వైరాగ్యం, 2. వ్యతిరేక వైరాగ్యం, 3. ఏకేంద్రియ వైరాగ్యం, 4. వశీకారవైరాగ్యం. ఈ నాలుగింటిలో మొదటి మూడింటిని సామాన్యముగా అందరు తెలిసికొనవచ్చునని వదిలేసి నాలుగవ దానిని చెప్పుచున్నారు. దృష్ట విషయములంటే లోకములో కనుపించే పుష్పచందనాది లౌకిక విషయములు. అను శ్రవికాలంటే వేదము నందు చెప్పబడిన స్వర్గ రంభాదులనేవి. ఇవి అలౌకికములు. ఈ రెండింటియందు ఆసక్తియున్నను అందులోని వివేక వైరాగ్యములను బట్టి మూడురకములున్నవి.

1 యతమానం = అనగా ఈ లోకమునందు సారమైన దేది యో అసారమైన దేది యో నేను తెలిసికొందును అనేది. ఇది గురువువలన శాస్త్రములవల్ల తెలిసికొనవలెననునది ఇదే యతమాన వైరాగ్యము
2 వ్యతిరేకం = అనగా చిత్తములో నున్న దోషములన్నిటిలో వివేకము యొక్క అభ్యాసమువల్ల ఎన్ని చిత్తవృత్తి దోషములున్నవో ఎన్ని పోయినవో తెలిసికొనడము వ్యతిరేక వైరాగ్యము.
3. ఏకేంద్రియ వైరాగ్యం = అనగా దృష్టము, అనుశ్రవికము, అంటే ఈ లోక పరలోక విషయములయందు వైరాగ్యము అనగా అవి అన్నియు దుఃఖరూపమని తెలిసి ఆ ప్రవృత్తిని వదలివేయుట అయినను మనస్సులో ఔత్సుక్యము మాత్రముంటుంది. దీనినే ఏకేంద్రియ వైరాగ్యమంటారు.
4 వశీకారం = అనగా ఔత్సుక్యము కూడా లేనిది నాలుగవ వైరాగ్యము దీనిని గురించియే చెప్పుచున్నారు.

అపర వైరాగ్యము కలిగినచో అప్పుడు అష్టాంగ యోగములను శీలించగలరు. ఇవే సంప్రజ్ఞాత సమాధికి అంతరంగ సాధనములు. అసంప్రజ్ఞాత సమాధి అయినచో అప్పుడు అపర వైరాగ్యము బహిరంగమగును. అప్పుడు పరవైరాగ్యము అంతరంగమగును.

16 సూ॥ తత్పరం పురుషఖ్యాతేర్గుణ వైతృష్ణ్యమ్॥

పరవైరాగ్యము సమస్తగుణములయందు వైరాగ్యము ఏదికలదో అది అసంప్రజ్ఞాత సమాధియగును. అనగా సంప్రజ్ఞాత సమాధి బాగుగా అనుష్ఠించినచో మంచి విరక్తి కలుగుతుంది. అప్పుడు పురుషుని సాక్షాత్కారము కలుగుతుంది. అంటే ఇహపరములయందు దృఢవైరాగ్యము గలగడమే పరవైరాగ్యము.

అభ్యాసము బాగుగా కుదరవలెనంటే ముందు మంచి వైరాగ్యము కావలెను. చిత్తవృత్తులను నిరోధించు అభ్యాసమును వైరాగ్యమును అవలంబించవలెను.

17వ సూ॥ వితర్క విచారానందాఽస్మితా స్వరూపాఽను
గమాత్ సంప్రజ్ఞాతః॥

1. వితర్కము 2. విచారము 3. ఆనందము 4. అస్మితల స్వరూపము యొక్క సంబంధము వలన సంప్రజ్ఞాత సమాధి కలుగును, ధ్యానింపదగిన వస్తువు దేనిచేత బాగుగా తెలియబడునో అది సంప్రజ్ఞాత సమాధి. ఇందులో ధ్యేయ స్వరూపము చక్కగా బోధపడును సమాధి అంటే భావనయే. ఆ భావమే మనగా ధ్యేయాకారమునకు సంబంధించినది. ఈ భావనే సంప్రజ్ఞాత సమాధి. ఆ సమాధిలో ధ్యానింపదగిన వస్తువు నాలుగు రకములుగా యుండును. ఈ నాలుగు రకములు సవితర్కములో ఎట్లుండుననగా ధ్యానింపదగిన పంచభూతములు ఇంద్రియములు ధ్యేయముగా యుండేది, సవితర్కమనబడును. ఇది స్థూలము ఇదియే వితర్కానుగత సమాధి

2 సూక్ష్మ పంచతన్మాత్రల యందు భావము నుంచుటయే విచారానుగత సంప్రజ్ఞాత సమాధి.

3. సానందమనగా రజస్తమో గుణములు కొద్దిగా నుండి సత్త్వ గుణము ప్రధానముగా నున్న బుద్ధికి గోచరమైన సాత్వికాకారము సానందమగును.

4. సాస్మిత అనగా రజస్తమో గుణముల యొక్క లేశమాత్రము కూడా లేక పూర్తి సత్త్వగుణము కలిగినచో అదే అస్మితయగును 1. గ్రాహ్యము 2. గ్రహణము 3 గ్రహీతమని సమాధియుండును. అస్మిత సమాధిలో పురుషుడు ఇట్లాయుండునని గ్రహించును. ఒకే సంప్రజ్ఞాతసమాధి నాలుగు రకములుగా అయినది.

భావప్రత్యయమైనది. అసంప్రజ్ఞాత సమాధి. ఉపాయప్రత్యయమైనది. సంప్రజ్ఞాతసమాధి. ప్రకృతి లీనమగు మనస్సుగలవారిని భవప్రత్యయులన్నారు. వీరే విదేహులు, ప్రకృతిలయులు.

ముముక్షువులు సాస్మిత సమాధిగలవారు ప్రకృతి లయము గుదురు. ఇదే సంప్రజ్ఞాత సమాధి.

భవ ప్రత్యయమంటే భవ అంటే సంసారము ప్రత్యయమంటే కారణము.

18వ సూ॥ విరామ ప్రత్యయాభ్యాస పూర్వః సంస్కార శేషోఽన్యః

ఉపాయ ప్రత్యయసమాధి యోగులకు మాత్రము కలుగును. ఉపాయ ప్రత్యయ సమాధి ఎవరికి కలుగునని వివేక ప్రకృతులకన్న భిన్నులు. వీరికి, 1 శ్రద్ధ. 2 వీర్యము, 3 స్మృతి, 4 సమాధి, 5 ప్రజ్ఞ ఇవి ఉపాయములు. శ్రద్ధయనగా ఈ యోగ విషయము వలననే నాకు చిత్తము నిర్మలముగా నుండెను ఇదే పురుషార్థసాధకము.

"సర్పోజీర్ణమివత్వచమ్" శ్రద్ధగలవారి అజ్ఞానము సర్పము కుబుసమును విడిచినట్లు వదలి పోవును.

శ్లో॥ అశ్రద్ధాపరమం పాపం శ్రద్ధా పాప ప్రమోచనీ।
జహాతి పాపం శ్రద్ధావాన్ సర్పో జీర్ణమివత్వచమ్।

అశ్రద్ధ పరమపాపము, శ్రద్ధ పాపములన్నిటిని విమోచనము చేయును. ఇట్టి శ్రద్ధ శాస్త్రపఠనము ఆచార్య ఉపదేశము వలననే లభించును. ఇట్టి శ్రద్ధయే తల్లివలె శుభమై యోగిని కాపాడును. శ్రద్ధ అనేది పెరుగుకుండవంటిది. ఫలము వెన్నవంటిది. కుండ పగిలి పోకుండా ఉన్ననే మజ్జిగగాని వెన్నగాని లభించును. అదేరీతిగా శ్రద్ధ అనే పాత్ర బాగాయున్నచో సాధన అనే ఫలము లభించును. ఈ శ్రద్ధ ఎట్లుత్పన్నమగు ననిన ఎంతకెంతకు శ్రవణము చేస్తూయుంటే అంతకంతకు శ్రద్ధ కలుగును. 'భగవద్గీత' తపస్విభ్యో అని యున్నది. కృఛమనగా మిక్కిలి కష్టమైనది. ఒక్క కృచ్ఛము అనగా మూడురోజులు మధ్యాహ్నం ఒక్కపూట మాత్రము భోజనము చేయవచ్చును, తరువాత మూడురోజులు

సాయంత్రము భోజనము చేయవచ్చును. ఆ తరువాత మూడు రోజులు తాను వంట చేసికొన గూడదు. ఇతరులు పెట్టినచో భుజించేది. ఎవ్వరూ పెట్టకపోయినచో అలా ఉండవలసినదే. ఆ తరువాత మూడురోజులు ఎవ్వరైనా పెట్టినా భుజించకూడదు. ఇది కృచ్ఛ్రము (కష్టప్రదము.) చాంద్రాయణ మనగా పూర్ణిమ అయిన మూర్నాడు నుంచి చంద్రుని కళ ఒక్కొకటి తగ్గును. కనుక తాను పూర్ణిమరోజు పూర్తిగా భుజించి ఆ మరుసటిరోజు నుంచి తాను భుజించే ఆహారమును 15 కబళములుగా నెంచుకొని పాడ్యమి మొదలు అమావాస్యరోజు వరకు ఒక్కొక్క కబళమును తగ్గించుచు వచ్చి అమావాస్యరోజున ఉపవాసముండుట మరల పాడ్యమి రోజుకు ఒక్కొక్క కబళమును హెచ్చించుకొంటూ వచ్చిన 15 రోజులకు పూర్తి భోజనమగును. ఇది ఒక్క నెల దీనినే చాంద్రాయణ వ్రతమందురు. ఇట్టి వ్రతములవలన శరీరము తపించును. ఆ తపము వలన అనేక జన్మల పాపము నశించును. కామ్యకర్మకు తానుకోరుకున్నది మాత్రమే సిద్ధించును. నిష్కామ కర్మ అయినచో చిత్తశుద్ధిని గలిగించును. నిష్కామ కర్మ అంటే తాను నిద్ర లేచింది మొదలు రాత్రి పరుండే వరకు చేసే మంచి పనులన్నియు భగవదర్పితం చేయడమే. పాపకర్మలు అనగా చేయరాని కర్మలు చేసి భగవదర్పితమనరాదు. శాస్త్రము మంచి పనులు చేయుమనియు చెడ్డ పనులు అసలు మానవులు చేయరాదనియు ముందుగానే చెప్పెను. కనుక విహిత కర్మలు చేయుడము నిషిద్ధకర్మలు చేయకపోవడము గీత- "త్రివిధం నరక స్యేదం" శ్లోకములో చెప్పిన కామక్రోధలోభములు పోయినచో అసుర గుణములు పోయినట్లే. కర్తవ్య కర్మ నిష్ఠ చేయవలెను. సోమరితనముండకూడదు. శాస్త్రముగాని, పెద్దలుగాని సాధ్యమైన పనినే చెప్పుదరు. కానీ సాధ్యముగాని పనిని చెప్పరు. అయితే ఆపని చేయుటకుకొంత కష్టము కలుగవచ్చును. ఈశ్వరార్పణ

పని చేయుటవలన వ్యవసాయదారుడే అనుకోండి, ఈశ్వరార్పణ చేసి నంతమాత్రాన ఆ ధాన్యమును ఈశ్వరుడు పట్టుకెళ్ళిపోడు. వారికే ఉండును. పైగా ఈశ్వరకరుణ కలుగును చిత్తశుద్ధికలుగును. ఆ చిత్తశుద్ధిలో ఇది ఆత్మ ఇది అనాత్మ అని బాగా తెలియును. అంటే ఆత్మ సుఖరూపమైనది. అనాత్మ దుఃఖరూపమైనది. అని తెలిసినందున దుఃఖరూపమును వదలి సుఖరూపమును కోరుకున్న వారికి ఆత్మానాత్మ వివేకము కలుగును. ఇట్టి ఉపాయము తెలియక అపాయములో పడిపోవుచున్నారు. సేద్యము చేయుటకు ఎంతో శ్రమపడవలెను. ఎండనక వాననక శ్రమపడుచుందురుగదా? ఇక ఆత్మజ్ఞానము కావలెనంటే జపధ్యానాదులు ఏకాగ్రతతో చేయవలెను. గదా! కనుక కష్టమనుకొనక తప్పక చేయవలసినదే. అలా చేసినసే ఆ సుఖము ఆ ఆనందము గోచరమగును. ఇదే పరమ పురుషార్థము ధర్మార్థకామములు పరమ పురుషార్థముకొరకే నాలుగాశ్రమాలు బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసం అని. ఇది క్రమముక్తి. బ్రాహ్మణులకే సన్యాసార్హత అని శంకరులు తెలిపిరి. సురేశ్వరాచార్యులవారు అన్నది. ఎవరికి యజ్ఞోపవీత ధారణమున్నదో వారందరు సన్యాసమునకు అర్హులన్నారు. దీనితో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సన్యాసార్హతవచ్చినది. అంటే జందెము గలవారందరకు అర్హత గలిగినది.

అదిసరే సన్యాసం అనే దానికిముఖ్యార్థము "యదహరేవవిరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అన్నారు. అంటే ఏరోజు విరాగము విరక్తి గలిగినదో ఆరోజే సన్యసించుమని. ఈ వాక్యములో జాతిగాని, లింగముగాని వయస్సుగానీ లేదు. కనుక ఈ వాక్యమును గురించి శ్రీగురుదేవులు (శ్రీసద్గురు స్వాములవారు) లోకములో గల పెద్దలు ఈ వాక్యమును అంగీకరించెదరా అని సందేహము కలిగి కృష్ణాతీరముగా నుండే విమలానంద స్వాములవారికి ఈ వాక్యమును వ్రాసి

కాశీలో పండితులను తెలిసికొనవలెనని వ్రాసిరి ఒక పెద్ద పండితుడని ఎట్లు తెలియుననిన కాశీలోనున్న పెద్ద పండితులనందరను ఒక ద్వైత పండితుడు వచ్చి పాండిత్యములో ఓడించుచుండెను.

పూర్వము నుండియు కాశీలోగల పండితులతో వాగ్వివాదము చేసి అక్కడ పండితుడని అనిపించుకొనవలెను.

అద్వైత పండితుని ఓడించి కాశీయొక్క గొప్పతనమును ఎవరు నిలుపగలరని పండితులందరు ఆలోచించి ఒక మేడ మీదగల గురువుగారిని సలహా అడుగగా అద్వైత పండితుని తనవద్దకు తీసికొని రమ్మని చెప్పి వారు వచ్చినతరువాత ద్వైతఖండన మీద పదహారు వాక్యములను ఒకేసారి ప్రయోగించి ఆ పదహారు ప్రశ్నలకు సమాధానము చెప్పుమనగా ద్వైతపండితుడు చెప్పలేనందున ఓడిపోయెను. శ్రీ గురుదేవులు వ్రాసి పంపిన "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అను వాక్యముగల జాబును శ్రీకృష్ణచరణముగారు ఆ మేడ మీదయుండే పండితుని వద్దకు వెళ్ళి అడుగగా ఆపండితుడు వయస్సు లింగము జాతి తెలుపలేదు గనుక వైరాగ్యము ముఖ్యమని చెప్పిరి.

ఈ వాక్యమును చెప్పినది కాశీ గొప్పతనమును నిలిపిన వారు వారే స్త్రీలకు కూడా సన్యాసార్హత కూడా యున్నదని చెప్పిరి. ఏ నాడు పూర్ణ వైరాగ్యము గలుగునో ఆనాడు సన్యసించవలెను. శ్రద్ధను గురించి చెప్పుచూ ఇంతవచ్చినది.

**19వ సూ॥ భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం॥**

భవప్రత్యయములు అనగా ప్రకృతి ప్రత్యయములకన్నా భిన్నమైన వారికి శ్రద్ధావీర్య స్మృతి సమాధి ప్రజ్ఞలను ఉపాయ ప్రత్యయ రూప సమాధి సిద్ధించును. శ్రద్ధ అనగా ఈ యోగమే మోక్షరూపమైన పురుషార్థమునకు సాధనమైనది, అంటే యోగ

విషయమై ఉత్కర్ష అంటే యోగవిషయము తెలిసికొనవలయు నను అభిలాష. గీత "తపస్విభ్యో" యోగి తపస్సు చేయువాని కంటే జ్ఞానికంటే అనగా పరోక్ష జ్ఞానము కంటే యోగము గొప్పదని, కర్మ యోగులకంటే యోగి గొప్పవాడు అని తాత్పర్యము.

20వ సూ॥ శ్రద్ధా వీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషాం॥

21వ సూ॥ తీవ్ర సంవేగా నామాసన్న!

శ్రద్ధబాగా పట్టుబడిన తరువాత వీర్యము కలుగును వీర్యం అంటే ఉత్సాహము, ఈ యోగము తప్పక సంపాదించవలెనను ఉత్సాహమే శ్రద్ధ ఎంత బాగా కలిగితే అంత ఉత్సాహము కలుగుతుంది. యోగము అనుష్ఠించుచుండగా యోగము బాగా పట్టుబడినచో బాగా ధ్యానము చేయుగలడు, స్మృతి అంటే ధ్యానం బాగా చేయునప్పుడు అప్పుడప్పుడు మనస్సుపోవుచుండును మరలా వచ్చుచుండును. మరలా పోవుచుండును. అలా పోవుచుండుటకు కారణము జన్మ జన్మాంతరాలలోగల విషయ సంస్కారమే. కనుక ధ్యానము చేయువారు బాగా గ్రహించవలెను. మనస్సుపోవుచున్నా నేను మాత్రము ఇచ్చటనుండి లేవను అనుపట్టుదల గట్టిగా యున్నచో అప్పుడు క్రమముగా ధ్యానము కుదురును. ఆ ధ్యానమే స్మృతి యనబడును. బుద్ధుడు ఇట్టి ధ్యానమును సంపాదించుటకొరకే,

శ్లో॥ ఇహాసనే శుష్యతుమే శరీరం

త్వగస్థి మాంసం ప్రళయంచయాతు

అప్రాప్య బోధం బహుకల్ప దుర్లభాం

నైవాసనాత్కాయ మతశ్చలిష్యతే॥

శ్రీ బుద్ధదేవుడు నిర్వాణసిద్ధికొరకు ఆసనమును వేసి కూర్చుండుటకు నిశ్చయించినప్పుడు సంకల్పించిన శ్లోకము. అనగా ఈ

ఆసనమునందు నా శరీరము యెండి భస్మమై పోవుగాక, త్వక్, అస్థి, మాంసము మొదలగునవన్నియు శిథిలములై పోవుగాక. అనేక కల్పములకైనను పొందుటకు శక్యముగాని బోధితత్వమును అనగా నిర్వాణమును పొందక ఈ ఆసనమునుండి ఈ దేహమును కదలింపను, అనగా లేవను అని ప్రతిజ్ఞచేసి కూర్చుండెను. అప్పుడు నలబది రోజులకు సాక్షాత్కారమైనది.

రామతీర్థస్వామి కూడా ధ్యాన సమయములో ఏ ఇంద్రియము చలించునో ఆ ఇంద్రియమును కోసి పారవేయవలెనను అభిప్రాయముతో బాగానూరిన కత్తిని ఎదురుగా పెట్టుకొని ధ్యానమునకు కూర్చుండును. అప్పుడు ఇంద్రియములన్నియు గజగజలాడిపోవును. ఏది చలించిన దానిని నరికి వేయునను భయమువలన అప్పుడప్పుడు మనస్సు నిశ్చలముగానుండేది, ధ్యానము బాగా చేసినచో సమాధి కలుగును, అప్పుడు సాక్షాత్కారము కలుగును అప్పుడు తాను ఈలోకమునకు ఎందుకు వచ్చెనో ఆపని పూర్తిచేసినట్లు. సమాధి అంటే ధ్యానము బాగా కుదరడమే, ప్రజ్ఞ అంటే ప్రకృతి పురుష వివేకము, ఇప్పుడో వివేకములేక ప్రకృతినే తాను అనుకొనును. అందువలన జనన మరణములను పొందుచున్నాడు, అలాగాక ఉపాయ ప్రత్యయ సమాధి లభించినచో ఈశరీరేంద్రియాదులు ఏమియు తాను కాదనే దృఢవైరాగ్యము కలుగును. సంప్రజ్ఞాత సమాధి బాగాశీలించినచో అసంప్రజ్ఞాతసమాధి లభించును. ఈ అసంప్రజ్ఞాత సమాధి రెండు రకములు. ఒకటి భవప్రత్యయము, రెండు ఉపాయ ప్రత్యయ యోగులు ఇట్టి ఉపాయప్రత్యయ జ్ఞానమే అవలంబించవలసినది. వేదాంతులకు ఈ ప్రకృతి అంతా కల్పితము, రజ్జుసర్ప భ్రాంతివలె "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అనగా త్రాడును చూచి పాము అనుకొని దగ్గరకు వెళ్ళిచూచినచో త్రాడు అని తెలియును. భ్రాంతి

పోయి నిజరూపము తెలియును. అలాగే జ్ఞానము కలిగినచో ప్రకృతి అంతా కల్పితం అంతా పరమాత్మ స్వరూపమే అని గ్రహించును.

21వ సూ॥ మృదుమధ్యాధిమాత్రత్వాత్ తతోఽపి విశేషః॥

వైరాగ్యము మూడురకములు, మృదుసంవేగం, మధ్య సంవేగం, అధికసంవేగమని, మృదు సంవేగమయినచో సమాధి స్థితికి చాలా కాలము పట్టును. మధ్యసంవేగమయినచో కొంత కాలమునకు సమాధికలుగును తీవ్ర వైరాగ్యము గలవానిలో నే మూడు భేదములున్నవి. మృదు, మధ్య అధిమాత్ర అని అంటే మృదు తీవ్రము మధ్య తీవ్రము అధిమాత్ర తీవ్రము అని అధి మాత్ర తీవ్ర వైరాగ్యముగలవ్యక్తికి ఉపాయప్రత్యయము శీలించగా బాగా దృఢ పడి అసంప్రజ్ఞాతసమాధి లభించును. అప్పుడు మనస్సే నశించిపోవును. అందువలన తాను లేవవలెనను స్ఫురణయే యుండదు. ఇక లేచి రావడమనేది లేదు. మనస్సు ఉంటేకదా ప్రకృతి కలుగుటకు స్వరూపావస్థ సమాధిని పొందును. ఇది వేదాంత పద్ధతిని అను సరించినది. "అజ్ఞాన కలుషం జీవం" చిల్లగింజగంధమువలన నీటిలో బురద అడుగుకు పోవును. ఆ బురదలో చిల్లగింజ గంధముకూడా క్రిందికి పోవును.

23వ సూ॥ ఈశ్వర ప్రణిధానాద్వా॥

ఈశ్వర ప్రణిధానమువలన ఉపాయ ప్రత్యయము అనగా అసంప్రజ్ఞాత సమాధి లభించును. కపిల మహర్షి ఈశ్వరుని అంగీ కరించలేదు. కనుక నిరీశ్వర సాంఖ్యమన్నారు వీరు ప్రకృతి పురు షులు ఇద్దరినే అంగీకరించెను.

పతంజలి మహర్షి కపిల మహర్షిని అనుసరించినదంతయు అనుసరించి ఈశ్వరునికూడా అంగీకరించెను కనుక పతంజలి మతము సేశ్వరసాంఖ్యమన్నారు.

ఈశ్వరుని అంగీకరించెనవల ఈశ్వరుని అంగీకరించుటవలన బాగా ధ్యానము చేయుటచే అసంప్రజ్ఞాత సమాధి లభించును. ఈశ్వర ప్రణిధానమంటే ఈశ్వరుని శరణు పొందడము. ఈశ్వర శరణాగతి స్థితికి చాలా (దగ్గర) మంచిది. తన ధ్యాన, సాధనములు బాగా నిర్విఘ్నముగా సాగవలెనంటే సాధకులందరు ఈశ్వరుని నిర్మలమైన భక్తితో తనను కూడా ఈశ్వరునికి సమర్పించుకొనవలెను. పరమేశ్వరుడు యెంతో గురువుకూడా అంతే. అంటే పరమేశ్వరానుగ్రహము గురువనుగ్రహము సంపాదించుకొనవలెను. గురువు సాక్షాత్తు పరబ్రహ్మము. దేవుని గురువును ఇద్దరిని భేదముగా చూచువారికి జ్ఞానము కలుగదు. పరమేశ్వరానుగ్రహము కలుగవలెనంటే భక్తితో పరమేశ్వరుని భజించవలెను. అలాగే గురువుగారి అనుగ్రహముకూడా సంపాదించుకొనవలెను. ఈశ్వరానుగ్రహమువల్లనే జ్ఞానమునకు కావలసినవన్నియు లభించును. గురువుకూడా లభించును. కానీ గురువు అనుగ్రహమును సంపాదించినచో గురువు అనేక రహస్యములను విప్పి చెప్పును. బాగా దృఢజ్ఞానము కలుగవలెనంటే ఈశ్వరానుగ్రహము గుర్వనుగ్రహము వేదానుగ్రహము అంతఃకరణ అనుగ్రహము ఉండవలెను.

శ్రీరాముడు శ్రీకృష్ణుడు కూడా గురువుల ద్వారానే జ్ఞానము సంపాదించుకొనిరి.

"యస్యదేవే పరాభక్తిర్యథాదేవే తథాగురౌ।

ఆ ప్రకారము ఈశ్వరుడు గురువు ఒకే పరబ్రహ్మస్వరూపులను దృఢమైన భక్తిగలవారు త్వరలో తరించిపోగలరు.

18-7-74 గురువారం

సాధకుడు సంసారాగ్నిచేత తపింపబడుచుండగా ఆ భక్తునకు ఈశ్వర శరణాగతి చాలా ముఖ్యసాధనము. ఈశ్వర ప్రాణి

భావము వలన ఈశ్వరుడు నా భక్తునకు శీఘ్రముగా సమాధి సిద్ధించుగాక అని అనుగ్రహించును.

24 సూ॥ క్లేశకర్మ విపాకాశయైర పరామృష్టః పురుష విశేష ఈశ్వరః॥

అవిద్యాది పంచక్లేశములు కర్మలు అనగా శుభకర్మలు అశుభ కర్మలు విపాక=కర్మఫలములు అంటే జాత్యాయుర్భోగములుగా కలుగును, అంటే జాతి ఆయువు భోగములు ఎంత కాలము అనుభవించవలెనో ఆశయై అంటే సంస్కారములు ఇవన్నియు జీవులను అంటుకొనును కానీ పరమాత్మను అంటుకొనవు ఆశయ = అంటే అంతఃకరణములో వుండేవి. అవే సంస్కారములు స్థూల శరీరము కర్మానుసారముగా వస్తూ పోతూవుంటుంది. పాతవస్త్రము వదలి క్రొత్తవస్త్రము ధరించువట్లుగా అంటే వ్యక్తి విలక్షణముగా యుండునో ఆరీతిగా నేకర్మకు సంబంధించిన స్థూలశరీరమును ధరించుచుండును సూక్ష్మశరీరము స్థూలశరీరముతో చేసిన కర్మలన్నియు అంతఃకరణలో సంస్కారరూపమున యుండును. స్థూలశరీరము పోయినా మరల జన్మించినా తరువాత అంతఃకరణలోని సంస్కారములను అనుభవించుచుండును, వస్త్రములకన్నా వ్యక్తి వేరుగా యున్నట్లు పుట్టే శరీరమునకు చచ్చే శరీరమునకు విలక్షణముగా సూక్ష్మశరీరముండును. జ్ఞానేంద్రియములు ౫ కర్మేంద్రియములు ౫, పంచభూతములు ౫, అంతఃకరణ 2 ఇవి సూక్ష్మ శరీరము. ఈ ఇంద్రియములన్నియు జ్ఞానము కలిగిననే లయించి పోవును.

అంతఃకరణ అంటే ఒక మైనపు వుండవంటిది కమసాలి బంగారమును అకురాతితో కాసినచో అతి సూక్ష్మమైన రేణువులు రాలును. అవి చేతికి దొరకవు. అందువల్ల వాటిని మైనపు వుండతో వత్తినచో ఆ రేణువులు ఆ వుండకు అతుకుకొనును.

అలాగే అంతఃకరణలో అనేక జన్మల సంస్కారము మైనపు వుండలో యున్న బంగారపు అణువులవలె ఉండును. సంచిత కర్మల వల్ల గల కర్మలు ఫలోన్ముఖమైనప్పుడు ఆ ఫలము ఏ జన్మకు అర్హమైనదో అట్టి జన్మ కలుగుచుండును. ప్రారబ్ధము అనుభవముతో పోతుంది. ప్రారబ్ధమును అనుభవించుచు మరల క్రొత్త కర్మలు చేయుచుండును. ఈ ఫలము మరల సంచితములో పోయి చేరుచుండును. అయితే ఆగామి మాత్రము మన చేతిలో యున్నది. మనము చేయరాని పని చేస్తే దుఃఖము నరకము కలుగును. అలాగాక చేయదగిన పనులు చేసి పరమేశ్వరార్పణ బుద్ధితో చేస్తే అప్పుడు అంతఃకరణ శుద్ధి కల్గి క్రమముగా మోక్షము లభించును.

ఈశ్వరునకు క్లేశాదులు లేవు కనుక ఫలము లేదు. సంస్కారము లేదు కనుక జన్మకూడా లేదు. ఈ నాలుగింటిలో స్పృశింపబడే వాడు జీవుడు, వాటి స్పర్శలేనివాడు ఈశ్వరుడు. ఏదైనా సరే చెడు పని చేసినచో చెడు కలుగును. మంచి పని చేస్తే మంచే కలుగును. అంతేగాని మంచికి చెడు, చెడుకి మంచి ఎప్పుడూ కలగదు. సాధకునకు విఘ్నములు వచ్చుచున్నవంటే పూర్వజన్మకర్మల యొక్క సంస్కారము వల్లనే

25వ సూ॥ తత్రనిరతిశయం సర్వజ్ఞ బీజం॥

ఈశ్వరునియందు సర్వజ్ఞత్వమునకు కారణమగు నిరతిశయమైనది. అంటే ఇంత తెలియును ఇంకపైది తెలియదనేది ఈశ్వరునకు లేదు. మనకు మాత్రము కొంతవరకే తెలియును కానీ అంతా తెలియదు. అంటే సాతిశయ జ్ఞానము నిరతిశయ జ్ఞానములో ఇమిడిపోవును ఎట్లంటే ఘటాకాశ మఠాకాశాదులన్నియు మహాకాశములో లీనమైనట్లని గ్రహించవలెను.

నిరతిశయుడైన ఈశ్వరుడు ఒక్కడా లేక బ్రహ్మాదీశా దులు కూడా ఈశ్వరులేనా! అని అడుగగా కాల పరిమితిచేత పరి మితికాని వాడు పరమేశ్వరుడు. ఈ పరమేశ్వరుడు ఒక్కడే

26 వ సూ॥ పూర్వేషామపిగురుః కాలేనానవచ్ఛేదాత్ ।

చతుర్యుగ సహస్రములు కలసి అనగా నాలుగు యుగములు కలసి ఒకటి, అట్టివి వెయ్యి కలసినచో బ్రహ్మకు ఒక పగలు. మరల వెయ్యి కలసినచో ఒక రాత్రి ఇట్టి రోజులుగా, వారములుగా, పక్ష ములుగా, నెలలుగా, సంవత్సరములుగా నూరి అట్టి నూరుసంవత్సర ములు బ్రహ్మ ఆయువు అందువలన బ్రహ్మకూడా కాలపరిచ్ఛే దమున్నది గరుత్మంతుడు పాములను హరింపజేయునట్లు. ఈ బ్రహ్మా దులంతా కాలములో హరించిపోవలసినవారనియు ఈశ్వరుడు ఒక్కడు మాత్రము కాల గర్భములో కలియుడని శృతిప్రమాణము న్నది. కాల కాల అంటే కాలుడు అంటే యముడు కూడా కాల మునకు వశపడిపోవువాడే. ఈశ్వర ప్రణిధానము కూడా సమాధికి ఒక అంగము.

27వ సూ॥ తస్యవాచకః ప్రణవః॥

ఆ ఈశ్వరునకు వాచకమైనది ఓంకారము. ఆ ఈశ్వరుని ప్రణిధానము చేసినచో అనగా ఆయనకు సంబంధించిననామ ములో జపించినచో ధ్యానించినచో పిలిచినచో పలుకుతాడు. వాడు పిలిచేది ప్రణవము అనగా ఈ సాధకులైనవారు పర మాత్మను ఓంకార ధ్యానములో స్తోత్రముచేయుదురు. పరమే శ్వరుడు స్తోత్రము చేయబడతాడు. వ్యక్తిని ఒకే పేరు పెట్టి పిలి చెదరో అలాగే ఓంకారము ఈశ్వరునకు వాచకము. ఈ ఓంకా రము స్త్రీలు ఉచ్చరించకూడదని అంటారు. ఎందుకంటే స్త్రీలు గర్భవతులుగా యున్నప్పుడు ఓంకారమును దీర్ఘముగా ఉచ్చరించి

నచో ప్రాణాయామము ఏర్పడి గర్భమునకు కొన్ని కష్టములు వచ్చును. కనుక అటువంటి స్త్రీలను గురించి చెప్పబడిన దానిని మొత్తము స్త్రీలంతా ఉచ్చరించకూడదని అన్నారు. బాహ్యశుచి చాలా అవసరము "శుచౌ దేశే" పరిశుద్ధ ప్రదేశములో కూర్చుని ఆధ్యాత్మిక సాధనలు చేయవలెను. "శౌచాత్ స్వాఙ్గజుగుప్సాపరైరసంసర్గః" రెండవ పాదం 40వ సూత్రములో చెప్పినట్లు తన అవయవములయందే తనకు జుగుప్స కలుగుతుంది. అంటే శరీరమంతయు మలముతో కూడినదే కన్నుపుసి, నోరు ఎంగిలి. చెవిగుబిలి ఇంకా మలమూత్రాదులు ఇవి అన్నియు కలిగిన శరీరము మీద ఏవగింపు కలుగుతుంది. తన అవయవములయందే ఏవగింపు కలిగినపుడు ఇతరుల సంసర్గము కోరజాలరు. అందువల్ల బ్రహ్మచర్యము అలవడును. పరమాత్మను దృఢచింతన చేయవలెనంటే బ్రహ్మచర్యముండవలెను. శరీరము కూడా దృఢముగా యున్ననే దృఢచింతన చేయగలరు. గృహస్థులుకూడా బ్రహ్మచర్యముతో మితముగా యుండవలెను. గీత 17 అ॥ దేవద్విజగురుప్రాజ్ఞ" అన్నారు. ఇది అంతయు శరీరము చేత నిర్వర్తింపవలసిన తపస్సు ఈ తపస్సు వలన మనస్సుకు స్థైర్యము దృఢము ఏర్పడుతుంది అప్పుడు ధ్యానము దృఢముగా చేయగలరు.

శరీరబలము లేకపోయినచో మనస్సుకు బలముండదు, మనస్సుకు బలము లేకపోయినచో ధ్యానము దృఢముగా చేయజాలరు. ఇది బాగా గ్రహించండి. అభ్యాసవైరాగ్యములు బాగా శీలించినచో వృత్తులు నశించి సమాధి సిద్ధించును. ఈశ్వర ప్రణిధానము చేసినను సమాధి సిద్ధిస్తుంది. ఆ ఈశ్వరుని పేరు ఓంకారము.

28వ సూ॥ తజ్జపస్త దర్థభావనమ్।

ఓంకారమంటే మంత్రము. ఆ మంత్రమును జపము చేయవలెను. పరబ్రహ్మకు మూడు పేరులు నిర్దేశించి యున్నవి. అవి "ఓం, తత్, సత్" ఆ జపము అనగా తాముతాము అనేది మాటిమాటికి అనుకుంటూవుంటే అది జపము. వాచకమైన ఓంకారాన్ని జపిస్తూ వాచ్యమైన ఆ ఓంకారము యొక్క అర్థము అనగా ఈశ్వరుడు.

భావన అంటే ధ్యానము. వేదాంతులు దీనినే నిది ధ్యాస అంటారు. యోగ పరిభాషలో ధ్యానమని అంటారు. ధ్యేయము అనగా ధ్యానింపదగిన వస్తువు. ఒకటవుతుంది. ధ్యానించేవాడు ఒకడు అంటే ధ్యాతకు ధ్యేయమునకు గల సంబంధమే ధ్యానము. ధ్యానమనగా మనస్సు ఇతర విషయముల మీదకు పోకుండా ధ్యేయము మీదనే నిలుపుకోనేదానినే ధ్యానమందురు. ధ్యాత, ధ్యానం, ధ్యేయం, అని వర్ణించును. ఓంకారమును బాగా జపించి ధ్యానము బాగా చేయండి. "ధ్యానం నిర్విషయం మనః" ఓంకారార్థము ఈశ్వరుడు. ఈశ్వరునకు పేరు ఓంకారము. ఆ పేరును మాటిమాటికి జపించవలెను.

ఓంకార ధ్యానమనగా నిర్విషయ ధ్యానమనగా దేనినుండి విషయములు నిగ్రహించునో అది ధ్యానము. విషయములు అంటే శబ్ద స్పర్శ రూపరసగంధములు. ఇట్టి వాటి మీదకు మనస్సు పోకుండా కేవలము ఈశ్వరునియందే మనస్సు నిలుపుట ధ్యానము. భగవత్సాక్షాత్కారమునకు. ఇది ముఖ్యమైన సాధన. కనుకనే పతంజలిమహర్షి ఈశ్వరానుగ్రహము పొందగలుగుటకై చెప్పెను. భావన లేకుండా ఎవరికి సాక్షాత్కారం కలుగలేదు. ధ్రువుడు, మార్కండేయాదులకు సాక్షాత్కారము కలిగినదంటే వారు భావించిరి. మనము భావించడములేదు. అందుకే మనకు సాక్షాత్కా

రము కలుగజేయు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు సర్వేశ్వరుడు, అట్టివానిని భావన చెదరకుండా ధ్యానము చేయవలెను.

ప్రాథమిక దశలో కొంతసేపు కుదిరి మరల సంకల్పములు వచ్చుచుండును. ఇది వారికి తెలియును. మరల ఇతరమైనవి స్ఫురించును. ఒక గొప్ప మహానీయుని దగ్గరలో యున్న ఒక ఆశ్రమమునకు వెళ్ళెను. ఆ ఆశ్రమాధిపతికూడా చాలా గొప్పవారే. వీరు వెళ్ళేసరికి ఆ గురువుగారు ధ్యానమునకు వెళ్ళిరి. ఆ ధ్యానములో శిష్యుని ఉత్తరమునకు జవాబులు ఆలోచించుచున్న సంగతి వచ్చిన మహాత్మునకు తెలిసిపోయినది. జప సమయములో ఆత్మ భావన యుండదు. ధ్యానములో ఈశ్వర భావన యుంటుంది. నామమును అనుకొనేటప్పుడు ఈశ్వరుని మీద భావము నిలిపి చేయవలెను. ఆ తరువాత జపము వదిలేసి కేవలం ఆ భావనతో నిలిచిపోయినచో కేవలము ద్వైతాకారముగా అయిపోవును.

20-7-1974 శనివారము

ఈశ్వరుని వాచకము ప్రణవము ఈ ప్రణవజపము చేస్తూ ఈ ప్రణవార్థమును భావించడమే "తజ్జపస్తదర్థ భావనమ్" ఆ ప్రణవము యొక్క జపము ధ్యానము చేయుటవలన సాధకులకు ప్రత్యేక చైతన్యం అనగా ప్రత్యగాత్మ అనగా తన స్వరూపము పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. విఘ్నములుకూడా ఉండవు. అభ్యాసవైరాగ్యముల వలన సమాధి ప్రాప్తిస్తుందని చెప్పిరి. ఇప్పుడు ఈశ్వర ప్రణిధానమువలన విఘ్నములుకూడా తొలగిపోవునని విశేషముకూడా చెప్పిరి. జపధ్యానాదులు ఎంత కాలము చేయవలెనంటే "సతుదీర్ఘ కాల నైరంతర్య" అను సూత్రమును అనగా దీర్ఘ కాలము నిరంతరము సత్కారముతో చేయవలెనని చెప్పెను. ఈశ్వర ప్రణిధానమనని భక్తికూడా "సతుదీర్ఘ కాలం" సూత్రములో చెప్పిన ప్రకారము చేయవలెను. అభ్యాసవైరాగ్యాదులు కూడా "సతు

దీర్ఘకాల'' సూత్రము ప్రకారము చేయవలెనని చెప్పెను. ఇది విశేషము. భగవద్భక్తిగల వారికి అన్ని సాధనలు సులభముగా సిద్ధించును. ద్వేషముతో భగవచ్చింతన చేసినవారికికూడా మేలు కలుగుతుంది. శిశుపాలాదులు అహర్నిశలు కృష్ణుని ఎట్లు నశింప చేయవలెననెడి అభిప్రాయముతో ఆదేచింతన చేసిరి. అందు వలన శిశుపాదులు భగవంతునిలో లీనమయ్యెను.

ఇక భక్తితో చేసినవారికి భగవంతునిలో లీనమగుటయందు సందేహము లేదు. శిశుపాలుని శిరచ్ఛేదన అయిన తరువాతఆయన శరీరములోనుండి ఒక దివ్యతేజస్సు వచ్చి శ్రీకృష్ణునిలో లీనమైనది. భగవద్భావము అగ్ని వంటిది. అగ్ని తాకితే కాల్చును. అట్లే భగవద్భావము అనే అగ్నిలో వాని పాపములన్నియు భస్మమై పోవును.

29వ సూ॥ తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ॥

చైతన్యమునందు ఏకాగ్రత కుదిరినప్పుడే సిద్ధి కలుగుతుంది. అట్టి ఏకాగ్రత రావలెను. సమాధి సిద్ధి కలిగేలోపల కొన్ని విఘ్నములు వచ్చును. ఒక మంచి పని జరగవలనంటే ఎంతో ప్రయాస. ''శ్రేయాంసి బహు విఘ్నాని'' అన్నట్లు 30వ సూ॥ వ్యాధిస్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి భ్రాంతి దర్శనాలబ్ధ భూమికత్వా నవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః॥

చిత్తమును యోగమునుండి తప్పించి విషయముల మీదికి తీసికొను పోవునో అవి తొమ్మిది రకములు 1. వ్యాధి, ఇది మూడు దోషములవలన కలుగును. అంటే వాత పిత్తశ్లేష్మములను ధాతువుల వ్యత్యస్తంవలన రోగము వచ్చును. 2. స్త్యానం అంటే ఆలోచన చేయు సామర్థ్యము చిత్తమున కుండదు. మొద్దుగా వుంటుంది. యోగము చేయవలెనను బుద్ధియుండదు. కనుక యోగమును శీలించదు. 3. సంశయము. ఇదికూడా యోగమునకు విఘ్నమే

అంటే సంధ్యాకాలములో త్రాడును చూచి పాము అని అనుకొన్నట్లు. అంటే త్రాడా పామా అనేది, ఇటువంటిదే సంశయము అవునా కాదా అనేదే సంశయము, వున్నది వున్నట్లు తెలిసికొనుట యథార్థజ్ఞానము. అంటే త్రాడును త్రాడుగా గ్రహించేది. అలాగాక త్రాడును పాముగా చూచేది విపరీతజ్ఞానము అనగా అయథార్థజ్ఞానమగును. అనగా యోగమును ఇట్లా అనుష్ఠించవలెనా అట్లా అనుష్ఠించవలెనా అనే దానినే సంశయమంటారు. సంశయము కలవాడు, యోగమును అనుష్టించడు 4 ప్రమాదము, యోగమును చక్కగా శీలించవలెనంటే అహింసాదులను చక్కగా శీలించువానికి సమాధి సిద్ధించును. అవి లేని వారికి యోగసిద్ధి కలుగదు. అనగా అహింస, సత్యము మొదలగు లక్షణములు యమము శమదమాదులుగల వారికి ఫలము కలుగును. 5. ఆలస్యం, ఇది ఒక విఘ్నము, శరీరము లావు ఎక్కినచో యోగము చేయలేరు మాట్లాడే మాటలు జాగ్రత్తగా యుండినచో చిత్తములో మంచి సంకల్పములు లేనిచో వాక్కును, చిత్తమును కాయమును సంస్కరించవలెను. ఇట్టి వాడు రేపు చేయతలసిన పనిని పదిరోజులకైనను పూర్తి చేయుదురో లేదు. అలాగే యోగవిషయమైన అనుష్టానమును రేపు రేపుఅనుచు ఆలస్యము చేయును. 6 అవిరతి, విరతి అంటే వదలవలసినది. అవిరతి, అంటే విషయముల యందు వైరాగ్యము లేకపోవడమే, విరక్తి లేకపోతే అనురక్తి యుండును. విషయాభిలాషగల వారికి యోగము సాగనివ్వదు. 7. భ్రాంతి దర్శనం, అధ్యాస అంటే భ్రాంతి అంటే రజ్జు సర్పభ్రాంతి త్రాడును చూచి పాము అనుకొనేబుద్ధి సర్పము కాని త్రాడును చూచి పాము అనుకొనేది. ఇది వున్న వస్తువును వదలి ఇంకొకటిగా చూచినది. ఇట్టివాడు యోగము కాని దానిని శీలించి దాని వల్ల నానా కష్టాలు దుఃఖాలు పడి విడిచి పెట్టును. అందుకే సద్గురువుల వల్ల శిక్షణ పొంది అనుష్ఠానమును శీలించవలె

నని చెప్పెను. 8. అలబ్ధ భూమి కత్వా. ఏదో ఒక నిమిత్తము వలన సమాధి సిద్ధించకపోవడమే. చిత్తము స్థిరముగా నిలువదు ఏకాగ్రత పొందదు. 9 సంప్రజ్ఞాత సమాధి, అసంప్రజ్ఞాత సమాధి అని రెండు రకములు చిత్త ఏకాగ్రత కలిగినది. అసంప్రజ్ఞాత సమాధి. చిత్త విక్షేపము కలుగుట అంటే ఏకాగ్రత లేకపోవడమే. యోగవిఘ్నము ఇవి లేకుండా వుండవలెనంటే పరమాత్మయందు చిత్తమును ఏకాగ్రము చేసి ఈశ్వర భక్తి పూర్వకముగా చేసినచో నిర్విఘ్నముగా యోగము సిద్ధించును. నిరంతరాయముగా యోగము సాగును,

**21-7-74 ఆదివారము**

చిత్తవృత్తులు వశించవలెనంటే అభ్యాస వైరాగ్యములు, ఈశ్వర భక్తి ముఖ్యమని తెలిపిరి. భక్తి వలన విఘ్నములుకూడా తొలగించబడుననేది పై చెప్పిన వ్యాధిస్త్యాన మొదలగునది నశించునని, ఈ తొమ్మిది విక్షేపములు యోగమును నాశనము చేయుడమే కాక విఘ్నములు కూడా కలుగును అవి ఏమనగా

31 సూ॥ దుఃఖ దౌర్మనస్యాంగమే జయత్వ శ్వాసః ప్రశ్వాసా
విక్షేప సహా భువః॥

దుఃఖము మొదలగు ఐదు విధములు కలుగును. అవి ఏవంటే 1 దుఃఖము అనగా వ్యాధి వలన కలిగే దుఃఖము. జ్వరము వచ్చి పోదు, జ్వరము వచ్చి దుఃఖముకూడా కలిగించును. ఈ దుఃఖములు మూడు విధములు, 1 ఆధ్యాత్మికము, 2 అది భౌతికము 3 అదిదైవికములని ఆధ్యాత్మిక దుఃఖమనగా శారీరిక రోగములు మానసిక వ్యథలు, అనగా కామక్రోధాదులున్నూ ఈ రెండు రకముల దుఃఖములు ఆధ్యాత్మికములు. అది భౌతికమనగా తన కంటే అన్య ప్రాణులు వలన కలిగే దుఃఖము, శత్రువుల వల్ల కలిగే దుఃఖము అది దైవిక దుఃఖమనగా ఒక్కొక్కప్పుడు మనకు తెలియకనే అతివృష్టి, అనావృష్టి దయ్యములు, భూతములు వలన ప్రజలు

దుఃఖపడెదరు. దయ్యములు కూడా వుంటాయా అనెదరు. కొం
దరు. ఆ విషయమై భగవద్గీత అ.17. శ్లో॥ 4 లో చెప్పబడియున్నది.
తామసగుణవంతులు ప్రేతాత్మలు అనగా దయ్యములను భూతము
లను పూజించెదరని. బ్రాహ్మణ. క్షత్రియ వైశ్య, శూద్రాదు
లలో చేయరాని పనిచేసినచో వారు దయ్యములగుదురు. మన
కున్న శరీరము పంచభూతాత్మకమైనది. మరి దయ్యములకు వాయు
మాత్ర శరీరముండును. మనము కూడా గాలి సోకినది, గాలి పట్టి
నది అంటాముగా, దయ్యాలకు పాదములు వెనుక పక్కకు వుంటా
యని యందురు. వాళ్ళు గాలిని శరీరముగా ధరించియుందురు.
చూచిన వాళ్ళు కూడా కొంత మందియున్నారు. శాస్త్రము కూడా
వున్నవని చెప్పుచున్నది. 2. దౌర్మనస్యం అనగా ఏదైనా తనకు
కావలెనని కోరుకొన్న వస్తువు లభించకపోయినచో మనస్సులో
క్షోభకలుగును, ఆ క్షోభనే దౌర్మనస్యం అంటారు. 3 అంగమే
జయత్వం, యోగము చేయువారికి శరీరములో కదలిక వచ్చును,
శరీరము ఎప్పుడు వణుకుచుండును. ఇట్టివారు ఒకప్పుడు ఒకరు
శ్రీ వ్యాసాశ్రమము వచ్చిరి. వారిని మీకు అలా వణుకు వచ్చిన
కారణమేమని శ్రీ గురుదేవులు అడుగగా గడిగోట సచ్చిదానంద
యోగి వ్రాసిన రాజయోగసారామృతము గ్రంధము చదివి ప్రాణా
యామము చేయుటవల్ల ఇలా వచ్చినదని చెప్పి శ్రీ గురుదేవులను
వణుకు పోయే విధానమును అడిగిరట. 4. రేచకము, అంటే శ్వాసను
బైటకు వదలడము మరల లోపలకు పీల్చుకోవడము శ్వాసమం
టారు ఇది రేచక ప్రాణాయామమునకు విరోధి 5 ప్రశ్వాసలోనికి
గాలి పీల్చడం ఇది పూరక ప్రాణాయామమునకు విరోధి యోగ
విఘ్నమంటే శ్వాసప్రశ్వాసలు ఎక్కువగా జరుగుచుండును.

ఈ తొమ్మిది యోగ విఘ్నములు చిత్తవిక్షేపమును కలి
గించును. ఎవరు యోగమును శీలించెదరో వారు అనుభవముగల

గురువులవద్దయుండి అనుష్ఠించుటకు ప్రారంభించవలెను. యోగము కుదిరితే యోగమే. కుదరకపోతే రోగమగును. వేదాంతములో ఫలము వస్తే వచ్చును లేకపోతే లేదు. అంతేకాని రోగము రాదు. గురువు అనుగ్రహము దైవానుగ్రహము యున్నచో యోగము త్వరగా పట్టుపడును. యోగము అనుష్ఠించునప్పుడు కొన్ని విఘ్నములు వచ్చును దుఃఖములు కూడా వచ్చునని చెప్పిరి.

32వ సూ॥ తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః

దుఃఖాలు విఘ్నాలు నిరోధించుటకు ఒక్కటైన తత్త్వము యొక్క అభ్యాసము చేయవలెను. ఆ ఒక్కటియేదంటే ఈశ్వర స్వరూపమును భక్తితో అనుష్ఠించవలెను. అభ్యాస మనగా మనో వృత్తి ప్రవాహము. అనగా ధ్యానము చేయునపుడు కొద్దిసేపు ఈశ్వర ధ్యానములోనేయుండి మరల మధ్యలో ఎక్కడికో పోవును. ఇది విక్షేపము అలా పోకుండా ఈశ్వరుని యందు నిలుపుటయే అభ్యాసము, అట్టి అభ్యాసము వలననే మనస్సు నిలుచునని చెప్పిరి. అట్టి అభ్యాసము ఎంతకాలము చేయవలెనంటే "సతుదీర్ఘ కాలం" మనస్సు ఏకధారగా దైవభావములో నిలవడమే ఏకతత్త్వాభ్యాస మన్నారు. మధ్యమధ్య చలనము కలుగకుండా ఏకధారగా పరమేశ్వరుని భక్తితో భజించినచో మనకష్టాలు దుఃఖాలు అన్నియు పోవును. అయితే అట్టి కోరికలు లేకుండా భజించవలెను. పైవారు చెప్పేది ఒకటియున్నది. అదేమంటే నేను మనుష్యునిగా పుట్టితిని కనుక నిన్ను ధ్యానించడమే కర్తవ్యము. అపైన నీవు ఏమి చేసి కొనెదవో చేసుకోవో నాకు ఏమీ సంబంధము లేదని అందురు.

చిత్తవృత్తులు నశించవలెనంటే యోగమును శీలించవలెను. తద్వారా జ్ఞానము సంపాదించుకొనెదననే బుద్ధియుండవలెను. ఇది జ్ఞాన యోగ బుద్ధియగును. క్షుద్రదేవతారాధన వలన తాము కోరిన కోరిక సిద్ధించును. భగవంతుడు కూడా అట్టి కోరికలను

తీర్చును. అలాకాక భక్తితో భగవంతుని భజించినచో ఆ కోరి కలున్నా తీరును, పైగా దైవానుగ్రహము కూడా కలుగును. కనుక ప్రతివారూ నిర్మలమైన భక్తితో భగవంతుని భజించెదరో సత్యధర్మాదులను అనుష్ఠించెదరో వారు తప్పక పైకి పోగలరు. భగవంతుని కృశింప చేయడమనగా భగవంతుని శాసనములను అతిక్రమించడమే భగవంతుని కృశింపచేయడమగును.

23-7-74 మంగళవారము

33వ సూ॥ మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యా
పుణ్య విషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనం॥

సమాధి శీలించునప్పుడు విక్షేపము కలుగుచున్నదని అంటూరే వారు ఈ చెప్పేది బాగా గ్రహించవలెను. చిత్తము రాగద్వేషాదులచే కలుషితమైయుండును. అట్టి చిత్తము ప్రసన్నముగాక పోయినచో చిత్తనిర్మలము కలుగదు. లోకములో సుఖవంతులతో మైత్రి కలిగియుండవలెను, మిక్కిలి దుఃఖితుల యెడల కరుణను పాటించవలెను. ఒకని బాగుని చూడలేని వానికి యోగము కుదరదు. ఎప్పుడు అబద్ధాలు తప్పులు చేయుచుందురు. అట్టి వారితో ఉదాసీనత వహించినచో అప్పుడు మన మనస్సు నిర్మలముగా యుంటుంది.

మనస్సు ప్రసన్నముగా యున్నచో ఏకాగ్రతను పొందును. స్థూలశరీరము అంతఃకరణకు స్వాధీనమైయుండవలెను. ఇంద్రియములు తన వశమై యుండవలెను. భగవద్గీత అ.2 శ్లో. 64-65-66 ల తాత్పర్యము చదువుకోవలెను. స్థూలశరీరము అంతఃకరణ ఇంద్రియములు తన స్వాధీనములో యున్నచో మనస్సు ప్రసన్నముగా యుండును.

ఈ రీతిగా ప్రసన్నతను ఎప్పుడు సంపాదించుకొనునో వానికి సమస్త దుఃఖములు నశించిపోవును. ఆ దుఃఖములు అధ్యాత్మిక

ఆదిభౌతిక ఆదిదైవిక దుఃఖములు. మొదటి పాదములో 31 సూత్రములలో ఈ విషయమున్నది. సమస్తదుఃఖములు నశించినవాని మనస్సు నిశ్చలముగా ఏకాగ్రతను పొంది పరమాత్మయందు నిలచును.

శ్రవణమననాదులు లేని వానికి ఇంద్రియ నిగ్రహము లేదు. మనోనిగ్రహము లేదు. అట్టివానికి గురుబోధ ప్రకారము శ్రవణ మననాదులు లేవు. వానికి ధ్యానము లేదు. దాని పరిపక్వావస్థ యగు సమాధియు లేదు. అట్టి వానికి శాంతి లేదు. సుఖము లేదు. శ్రవణ మననాదులున్నచో రాగద్వేషాదులు నశించి ఇంద్రియ మనోనిగ్రహమున్నచో శాంతి సుఖము కలుగును.

34 వ సూ॥ ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య ॥

విచారణ వల్ల మనస్సును పట్టుకొన్నవానికి చెప్పిన విషయము "ప్రచ్ఛర్ధనం" అంటే రేచకము, "విధారణం" అనగా కుంభకము. రేచకము 32మాత్రముల సమయము అనగా లోపలయున్న గాలిని బైటకు వదలవలెను. ఇది కంఠము మొదలు గుదస్థానము వరకు గాలి నిండియుండును. అది అంతయు 32 మాత్రల కాలములో బైటకు వదలవలెను. మరలా గాలి పీల్చకుండా 64 మాత్రల కాలము కుంభకములో నిల్పవలెను. ఇది బాహ్యకుంభకము మొట్ట మొదట 8 మాత్రల కాలము రేచకము 16 మాత్రల కాలము కుంభకముతో ప్రారంభించి క్రమముగా పెంచుకొనవలెను ప్రారంభదశలో కొద్దిమాత్రలతో ప్రారంభించవలెను. పూరించిన తరువాత గాలి లోపలయున్నది. దానిని మరలా బైటకి పోకుండ 64 మాత్రల కాలము నిలుపవలెను. ఇది అంతర కుంభకము మనస్సుకు ప్రాణమునకు సంబంధమున్నందువ 32 మాత్రల కాలము మరలా రేచించ వలెను. ప్రాణాయామమువలన, ప్రాణమునుపట్టు కుంటే మనస్సుకూడా ఆగిపోయి యోగము కుదురుతుంది. యో

మంటే సంప్రజ్ఞాత సమాధి లభించి క్రమముగా అసంప్రజ్ఞాతసమాధి సిద్ధిస్తుంది, ఇది యోగపద్ధతి విచారణవల్ల మనస్సుకు పట్టుట వేదాంత పద్ధతి.

35 వ సూ॥ విషయ వతీవా ప్రవృత్తిరుత్పన్నా మనసః స్థితి నిబంధినీ।

మనస్సును నాసాగ్రమందు ఏకాగ్రము చేసినచో దివ్య గంధ జ్ఞానము కలుగుతుంది. ఇలాగే ఐదుస్థానములలో నిలిపితే శబ్ద స్పర్శ రూప రస గంధాదులు లభించును. ఇది దివ్యమైనది.

పైన చెప్పిన స్థానములలో మనస్సు లగ్నపరచుటచే క్రమ ముగా మనస్సుకు ఏకాగ్రత చేకూరును.

36 వ సూ॥ విశోకా వా జ్యోతిష్మతీ।

హృదయములలో అష్టదళ పద్మమును భావన చేసెదరు దానిని రేచకముచే ఊర్ధ్వముఖముగా చేసికొని అంటే రేచకము చేస్తే ఊర్ధ్వముగా తిరుగును. అప్పుడు జ్యోతియందు ఏకాగ్రము కలిగినచో మనస్సులోయున్న దుఃఖములన్నియు పోవును. మధ్యలో కాంతిని బాగా భావన చేసినచో ఏకాగ్రత కలుగును. బాగా ఏకాగ్రత కలిగితే శోకము పోవును.

37 వ సూ॥ వీతరాగ విషయం వా చిత్తమ్।

వీతరాగులను చిత్తములో నిలుపుకొన్నచో అనగా వీత రాగుల చిత్తమును గురించి ఆలోచించినచో అనగా శాస్త్రములో చెప్పిన వర్ణనను మనస్సులో భావన చేసినచో ఏకాగ్రతను పొందును.

38 వ సూ॥ స్వప్న నిద్రాజ్ఞానాలంబనం వా।

ఇవి అన్నియు మనస్సును ఏకాగ్రము చేసికొనుటకే. వీరిలో యెవరికి దేనియందు అభిలాష కలిగిన అది పట్టుకొని ఏకాగ్రతను పొందవచ్చునని ఇన్ని రకములుగా చెప్పుచుండెను. బాగా భగవం

తుని భజించుచున్నను ఏకాగ్రత కలుగనిచో అతనికి ఒక స్వప్న ములో ఇష్టదేవత దర్శనము కలుగును. మెలుకువ వచ్చిన తరు వాత ఆ ఇష్టదేవతయందు నిల్పి ఏకాగ్రతను సంపాదించుకొన వలెను. సుషుప్తిలో అంతఃకరణము తాను ఏమీ చేయజాలని స్థితిలో వుంటుందిగానీ అసలే లేకుండాపోదు. జాగ్రత స్వప్నము లలో అంతఃకరణ యుండును. సుషుప్తి అవస్థలో మనస్సునందు ఏ సంకల్ప వికల్పాది వృత్తులు లేకుండా వుండునో దానిని భావన చేసినా ఏకాగ్రత కలుగుతుంది. సుషుప్తిలో ఆత్మ బాగా ప్రకా శించుచుండును. ఆత్మ మూడవస్థలలోను ప్రకాశించినను సుషుప్తిలో అంతఃకరణ పనిలేదుకనుక ఒక విధమైన ఆనందము పొందును. అంటే శ్రమపడిన వాడు గాఢనిద్రపోయి లేచిన తరువాత గాఢ నిద్ర పోతినని నాకు ఏమియు తెలియలేదని అనుకొనును. ఇది సుషుప్త్యవస్థ. సుషుప్తిలో అనుభవము కలిగింది. నిద్రలేచిన తరువాత స్మృతి కలిగినది. సుషుప్తిలో అంతఃకరణలో ఏ వృత్తులు లేక సుఖముగా యున్నట్లు తెలిసికొన్నందున దానిని ధ్యానించి ఏకాగ్రత పొందవచ్చును.

39 వ సూ॥ యథాభిమత ధ్యానాద్వా।

పైని అనేకరకములు సాధనలు ఏకాగ్ర సంపాదనకు తెలుప బడినవి. అవి అన్నియు సరి - మీకు ఇష్టమైన దైవమును భావించ వలెను. దైవమును గురించి శాస్త్రములో చెప్పిన స్వరూపమును ధ్యానించి అయినా ఏకాగ్రతను సంపాదించుకోవచ్చు. ఏకాగ్రత లభించును.

24-7-74 బుధవారము

40 వ సూ॥ పరమాణు పరమమహత్వాంతోఽస్య వశీకారః।

పరమాణువు అంటే అతిసూక్ష్మము, పరమమహత్తు అంటే ఆకాశము, స్థూలములో అతిస్థూల పదార్థము వరకూ చిత్తమును

అణువు మొదలు ఆకాశము వరకు ఎక్కడ బట్టిన అక్కడ ఏకాగ్రము చేయగలుగును. కనుక అట్టివానికి చిత్తము వశీకారమైనట్లు మనసు ఏకాగ్రత పొందుటకు అనేక ఉపాయములను చెప్పెను. దానివల్ల కలిగిన ఏకాగ్రత అభివృద్ధి పొందుటకు అనుకూలమైనది సబీజ సమాధి. అనగా సంప్రజ్ఞాత సమాధి. ఏకాగ్రత అభివృద్ధి పొందిన యోగికి సంప్రజ్ఞాత సమాధి సిద్ధిస్తుంది.

41. సూ॥ క్షీణవృత్తే రభిజాత స్యేవమణేర్గ్రహీతృగ్రహణ
గ్రాహ్యేషు తత్స్థ తదంజనతా సమాపత్తిః।

మిక్కిలిపరిశుద్ధమైనమణివలె గ్రహీత గ్రహణము గ్రాహ్యము. స్ఫటిక మణియందు దాసానిపువ్వు పెట్టినచో ఆ స్ఫటిక మణి దాసాని పువ్వు రంగుగా కన్పించును స్ఫటికమణి మలినముగా యున్నచో దాసానిపువ్వు రంగుగా కనిపించదు. శుద్ధముగాయుండి దగ్గరగా దాసానిపువ్వు ఉన్ననే ఎర్రగా కనిపించును. క్షీణవృత్తి అంటే వృత్తులు నశించిపోయిన చిత్తము. గ్రహీత అంటే జ్ఞాత. గ్రహణం అంటే ఇంద్రియములు. గ్రాహ్యేషు అనగా సూక్ష్మభూతములు, స్థూలాది వస్తువులయందు కేరి తదాకారమునొందుటయే సంప్రజ్ఞాత సమాధి. ఎలాగనగా శ్రీమహావిష్ణువును శాస్త్రములలో చెప్పిన విధముగా అంటే నీలమేఘశ్యాముడు, నాలుగు భుజములు, శంఖ చక్రగదాఖడ్గములు ఉన్నట్లు భావించెదరు. ఏకాగ్రత సంపాదించిన వారి చిత్తము మహావిష్ణువు నందుండును.

తదంజనతా ఆ వస్తువు ఆకారమును చిత్తము పొందును. సాధన చేయువారు బాగాగ్రహించవలెను. ఏకాగ్రతను పొంద బట్టే తదాకారము పొందినదని తెలుసుకోవచ్చును. ధ్యేయాకారము పొందనిచో ఏకాగ్రత లభించలేదని గ్రహించేది. సబీజ సమాధిలో నాలుగు రకముల విషయముండును.

అవి 1. వితర్కము, 2. విచారము, 3. ఆనందము, 4. అస్మిత. ఇవి నాలుగు సంప్రజ్ఞాత సమాధికి ఉండునని చెప్పెను.

42. సూ॥ తత్రశబ్దార్థ జ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కాసమాపత్తిః॥

సమాపత్తి అంటే సమాధి. సవితర్కసమాధి అంటే శబ్దము, అర్థము, జ్ఞానముయొక్క వికల్పము. గోవును గురించి సంస్కృతములో గౌః అనగా శబ్దము, గౌః అనగా అర్థము, గౌః అనగా జ్ఞానము

అనాహత ధ్వని నిశ్చలముగా ధ్యానము చేయు వారికి వినిపించును. బాగా ధ్యానము చేయువారికి బాగా వినిపించును. గౌః గౌఃగౌః అని మూడుసార్లు చెప్పుటచే గోశబ్దము, గోరూప అర్థము గోవు అను జ్ఞానము అని మూడుపదములుగా యున్నను ఏకత్వము బోధింపబడుచున్నది. నేత్రేంద్రియము రూపము దగ్గరకు వెళ్ళును. శబ్దేంద్రియము దగ్గరకు శబ్దము వచ్చును. కాని శబ్దము వద్దకు శబ్దేంద్రియము వెళ్ళదు. అలాగే స్పర్శము, రసము, గంధము అంటే పుష్పముల గంధమును గాలి ముక్కువద్దకు తీసుకొనివచ్చిన తర్వాత మనము ఫలానా పుష్పము వాసన అని గ్రహించగలము. అంటే గంధ పరమాణువులు గాలిలో కొట్టుకొని వచ్చినందున మన ముక్కు దగ్గరకు వచ్చేసరికి ఫలానా గంధము అని గ్రహించగలము నాలుక రుచిని గ్రహించును. రుచిలోగల భేదములను గ్రహించును ఏరుచి లేని స్థితిని గ్రహిస్తుంది. లక్ష్యమునకు శబ్దము అర్థముతో తెలిసికొనేది జ్ఞానము. లక్ష్యములో కృష్ణస్వరూపమును శబ్దము కృష్ణుడు అనే అర్థము, కృష్ణుడు అనే జ్ఞానము.

సమాధికి సామాన్యార్థము చిత్త ఏకాగ్రత. సవితర్కరూపముగా ఉన్నదంటే శబ్ద, అర్థ, రూపములతో ఏది ఉంటున్నదో అది సవితర్కసమాధి అగును. అదే సంప్రజ్ఞాత సమాధి. సవితర్కమునకు సంబంధించిన గ్రాహ్యసమాధి.

25-7-74 గురువారము

43. సూ॥ స్మృతి పరిశుద్ధౌ స్వరూప శూన్యేవార్థ మాత్ర నిర్భాసా నిర్వితర్కా॥

లక్ష్యము శూన్యముగా మాత్రముండును. వికల్పములుంటే సవితర్కము. వికల్పములు లేవు కనుక స్వరూపముతో శూన్యము వలె ఉండును. ఇది నిర్వితర్కము. ఇవి రెండు సంప్రజ్ఞాత సమాధియే. వికల్పము అనగా గోవు అను శబ్దము, గోవు అను అర్థము గోవు అను జ్ఞానము, ఆదే వికల్పము.

44. సూ॥ ఏతయైవ సవిచారా నిర్విచారా చ
సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా।

సూక్ష్మ విషయమైనట్టి సవిచార నిర్విచార సమాధి దీనిలో చెప్పబడినది. సూక్ష్మభూతములంటే దశేంద్రియముల మీాద ఏకాగ్రము చేయవలెను. పంచతన్మాత్రలు అంటే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి ఇవి తన్మాత్రలు. అంటే దేని కదే ఉన్నవి. ఒకదానిలో ఒకటి కలియనందున తన్మాత్రలని, సూక్ష్మభూతములు అందురు. ఒక్కొక్క దానిలో అన్నియు చేరడము స్థూలభూతములు పంచీకరణమంటే ఆకాశము రెండు భాగములలో ప్రథమ భాగము అలా ఉంచి మిగిలిన సగమును నాలుగు భాగములు చేసి అలాగే నాలుగు భూతములు సగముగాను, మిగత సగము నాలుగు భాగములు చేస్తే ఇదే పంచీకరణము.

పంచీకృతమయినవి. ఇవిస్థూలభూతములు వీటిలో ఏర్పడినవి సవితర్కము. ఇది వికల్పముతో కూడినది. నిర్వితర్క వికల్పము లేనిది. సవిచార నిర్విచార అంటే సూక్ష్మభూతములనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పరమాణువులయందు ఇవి అతి సూక్ష్మమైనవి. వీటియందు మనస్సుకు యోగ్యత వచ్చినది కనుక వీటిపైన ఏకాగ్రత చేయుచూపోతారు. స్థూలభూతములలో వికల్ప సహితముగా అంటే సవికల్ప వికల్ప రహితముగాను అంటే నిర్వికల్పముగాను చేసిరి. సూక్ష్మభూతములందు వికల్ప సహితముగా ఏకాగ్రము చేస్తే సవిచారము. వికల్ప రహితముగా ఏకాగ్రము

చేస్తే నిర్విచార సమాధియగును. ఇది అంతా సంప్రజ్ఞాత సమాధిలో గల నాలుగు రకములు.

45 సూ॥ సూక్ష్మ విషయ త్వం చాలింగ పర్యవసానః॥

సూక్ష్మవిషయము అలింగము అనగా ప్రకృతి పర్యవసానముగా ఉంటుంది. తన్మాత్రలకు కారణము అహంకారము, కార్యము తన్మాత్రలు కార్యముకంటె కారణము పదిరెట్లు పెద్దదిగాను, పదిరెట్లు సూక్ష్మముగాను ఉండును. అహంకారము కంటె సూక్ష్మమైనది. మహత్తు, అప్పుడు మహత్తు కారణము. అహంకారము కార్యము మహత్తుకంటె ప్రకృతి సూక్ష్మమైనది. అప్పుడు మహత్తు కార్యము ప్రకృతి కారణము, కనుక మహత్తు కంటె ప్రకృతి పదిరెట్లు పెద్దది పదిరెట్లు సూక్ష్మమైనది. ఇది ప్రకృతి దీనియందు విభాగము చేసి చూచినచో ప్రకృతికి కారణము లేదు. కనుక "అలింగం" అంటారు. సూక్ష్మ విషయములలో ప్రకృతియే పర్యవసానముగలది. జడవర్గములో ప్రకృతియే సూక్ష్మపదార్థము. చైతన్యములో పురుషుడున్నాడు.

కారణమనగా ఉపాదాన కారణము. పంచతన్మాత్రలకు అహంకారము, అహంకారమునకు, మహత్తు, మహత్తునకు ప్రకృతి ఇవి ఒక దానికొకటి ఉపాదాన కారణములగును. పురుషుడు చైతన్య రూపుడు గనుక ప్రకృతికి ఉపాదాన కారణము పురుషుడని అనుటకు వీలులేదు.

ప్రకృతి వేరు జడమైనది. పురుషుడు చైతన్యస్వరూపుడు. అందుచేత ప్రకృతికి ఉపాదాన కారణముగా చెప్పకూడదు. నిమిత్త కారణము కుమ్మరి ఉపాదానమంటే కార్యమైన కుండకు మట్టి ఉపాదాన కారణము. ఆభరణములకు బంగారము ఉపాదాన కారణము. ఉపాదాన కారణమైన బంగారము కంటె కార్యమైన ఆభరణము వేరు గాదు. ఆభరణము చేయవలెననేదే ఇచ్ఛ. కార్యము

యొక్క జ్ఞానము ఇచ్ఛ కృతి అంటే ప్రయత్నము. బంగారము తెచ్చి దానిని ఏమి చేయాలో ఆలోచిస్తాడు కంసాలి. అప్పుడు కంసాలి నిమిత్త కారణమగును, ఆభరణమునకు బంగారము ఉపాదాన కారణమగును.

పురుషుడు చైతన్యస్వరూపుడు. అట్టి చైతన్యమునుండి ప్రకృతి పుట్టినచో ప్రకృతి కూడ చైతన్య వంతముగా యుండును. అలాలేదు. కాని చైతన్యమైన పురుషుని సన్నిధి వలనఅహంకారాములు కలుగుచుండును. గనుక పురుషుడు నిమిత్తకారణమగును.

46 సూ॥ తా ఏవ సబీజ స్సమాధిః॥

ఇంతవరకు స్థూలభూత సంబంధమైన సవితర్క నిర్వితర్కములున్నూ సూక్ష్మభూత సంబంధమైన సవిచార నిర్విచార అని నాలుగు సమాధులు చెప్పిరి. ఈ నాలుగు సబీజ సమాధియందురు. ఈసమాధులు శీలించుచున్నను ప్రకృతి పురుష వివేకము లేదు, కనుక జ్ఞానము లేదు.

ఇతర విషయములందు మనస్సు చలించకుండా ఏకాగ్రత చేసుకుంటూ పోతున్నాడేగాని ప్రకృతి పురుష వివేక జ్ఞానము లేదు. కనుక జనన మరణ సంసార బంధము పోలేదు. ఆ బంధమే బీజము. అందుకే ఈ నాలుగు సబీజ సమాధులు అందురు. వీరికి జ్ఞానములేదు. జనన మరణ సంసార బంధము వదలలేదు.

26-7-1974 శుక్రవారము

48 సూ॥ ఋతంభరా తత్ర ప్రజ్ఞా

ఋతం అంటే సత్యము. అంటే పరమాత్మా సాక్షాత్కారము ఋతంభరాప్రజ్ఞ అంటే సమస్త ధర్మములు చక్కగా అనుష్ఠించుటవలన ఆత్మసాక్షాత్కారము సమాధి కలుగును.

ఋతంభర అంటే విశేషార్థములు కలిగియుండును. వేద శాస్త్రముల శ్రవణము వలన ఏ ప్రజ్ఞ కలుగుతుందో అనుమాన

ప్రమాణప్రజ్ఞ అంటే అన్య విషయములందు గల ప్రజ్ఞ నేమనగా ఆ ప్రజ్ఞ అందుకు, వేదశాస్త్రముల యొక్క అర్థములు శ్రవణమువలన సాధారణమైన అర్థమే తెలియును. గాని విశేషముగా తెలియదు.

## సాధన పాదః

27-7-74 శనివారం

2 వ పాదము

ఉత్తమ సాధకులకు అసంప్రజ్ఞాతసమాధిని, మధ్యమ సాధకులకు సంప్రజ్ఞాత సమాధిని మొదటి పాదము బోధించినది. కానీ మంద బుద్ధిగలవారిని గురించి ఈ రెండవ పాదములో క్రియాయోగమును చెప్పుచున్నారు. క్రియాయోగమనగా 1 తపస్సు 2 స్వాధ్యాయము 3 ఈశ్వర ప్రణిధానము. ఈ మూడూ క్రియా యోగమన బడును.

1 సూ॥ తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః॥

1 తపస్సు అంటే ఇంద్రియములను, మనస్సును, శరీరమును తపింపచేయునది గనుక దీనిని తపస్సు అన్నారు. తపస్సు అనగా హిత, మిత, మేధ్య భోజనము, శీతోష్ణాది సహనము, ఇంద్రియ నిగ్రహము-ఇది తపస్సు. తపస్సనగా యుక్తాహార విహారములే.

హితభోజనమనగా పులుపు, కారము, ఉప్పు, వేడి, రూక్షణము, తీక్ష్ణములగునవి ఎక్కువగా వాడరాదు. నువ్వులు, ఆవాలు, పెరుగు, మాంసము మొదలగు పదార్థములను విడచి బియ్యము, గోధుమలు అవునాలు, కలకండ, నేయి, పెసలు, మొదలగు సాత్త్విక పదార్థములను భుజించుట.

మితభోజనమనగా ఉదరమున రెండు భాగములు అన్నముచే నిండించి, మరియొక భాగమును జలముతో నింపి, నాల్గవ భాగమును వాయు సంచారార్థము ఊరక వదలిపెట్టుట.

మేధ్య భోజనమనగా మత్స్య మాంస మద్యములను వదలి కందచేమ మొదలగు గడ్డలను, అవిసె మొదలగు కూరలను, బెండ, కాకర మొదలగు కాయలను భుజించుట.

2. స్వాధ్యాయమనగా ప్రణవ ధ్యానము, వేదాధ్యయనము. ఒక వేళ వేదాధ్యయనము చేయ లేకపోయినచో అప్పుడు శ్రీ భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు మొదలగునవి అధ్యయనము చేయవలెను. ఇది కూడ చేయ లేనివారు ప్రణవాదిమంత్ర జపము చేయవలెను. ఏ మంత్రమైనను ప్రణవముతో కలిపి జపించవలెను. ప్రణవము లేని మంత్రము ప్రాణము లేనిదే అగును, అనగా పంచాక్షరి, అష్టాక్షరి మొదలైన మంత్రములు ఏవైనా సరే ప్రణవముతో కలిపి జపించవలెను.

3 ఈశ్వర ప్రణిధానమనగా ప్రప్రథమ దశలోయున్న మందాధికారులకు చెప్పిన విషయము. ఈశ్వర ప్రణిధానమనగా ఈశ్వరుడు అనగా మాయోపాధిక చైతన్యము గల సగుణోపాసకుడు బ్రహ్మసృష్టి, విష్ణువు పోషణ, శివుడు లయము చేయుట. ఈ ముగ్గురికి కారకుడు పరమేశ్వరుడు ఆ పరమేశ్వరుని ధ్యానము చేయవలెను. అనగా స్వస్వరూప ధ్యానము చేయవలెను.

మంచి పనులు, సత్కార్యములు, దైవకార్యములు చేయునపుడు సిగ్గుపడకూడదు. అట్టి సమయములో సిగ్గుపడినవారు దైవమునకు దూరమైపోయెదరు. దేవీభాగవతములో చెప్పిన విషయము- ఒక అడవిలో ఒకముని ఆశ్రమము ముందునుంచి బాణము తగిలిన పంది పారిపోయెను. కొంతసేపటికి వేటగాడు వచ్చి పంది ఇటు వచ్చినదా, మీరు చూచినారా అని అడుగగా అప్పుడా ముని ఆ పందిని చూచినాడు కనుక సత్యమే అని చూచి నానని చెప్పినచో దానికి ప్రాణాంతకము కనుక అది దోషము, చూడలేదంటే అబద్ధము అనుకొని వాడు పదే పదే అడుగుచున్నందున చూచేది

కన్ను చెప్పేదినోటు కనుక చూచినది చెప్పలేదు చెప్పినోటు చూడలేదు. కనుక ఎట్లు చెప్పేది అని అడిగెను. దానితో ఆ బోయవాడు వెళ్ళిపోయెను కనుక సత్యము అంటే చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లు ఉన్నది ఉన్నట్లు చెప్పవలెను. సత్యము అంటే భూతములకు హితమైనదే సత్యము. అలాకాక ప్రాణులకు బాధకలిగే సత్యము చెప్పకూడదని చెప్పెను. శారీరకముగా, మానసికముగా వాక్కుతో సత్యముగా ప్రవర్తించవలెను. త్రికరణములను భగవంతునకు సమర్పించుకొనడమే ఈశ్వర ప్రణిధానము. ఈ మూడుం కలిసినదే క్రియాయోగమగును. ఈ క్రియా యోగము వల్లనే సాధన చేసినచో తప్పక జ్ఞానము సంపాదించి మోక్షమును పొందెదరు.

28-7-74 ఆదివారము

2వ సూ॥ సమాధి భావనార్థః క్లేశతనూ కరణార్థశ్చ॥

ఉత్తమాధికారులకు అసంప్రజ్ఞాత సమాధి, మధ్యమాధికారులకుసంప్రజ్ఞాతసమాధి, మందాధికారులకు ఈ క్రియాయోగము అభ్యసించవలెనని చెప్పెను.

క్రియాయోగమున రెండురకముల ప్రయోజనములు కలుగును. దీనిని బాగా అభ్యసించినచో ముందు సంప్రజ్ఞాత సమాధి సిద్ధించును. ఇది ఒక ప్రయోజనము. రెండవ ప్రయోజనము— అవిద్యాక్లేశములు ఐదు చెప్పబడును. ఆ అయిదింటిని క్షీణింపచేయును. ఈ క్లేశములు సాధకుని చాలా కష్టపెట్టును. అట్టి కష్టములు తొలగుట రెండవ ప్రయోజనము.

3సూ॥ అవిద్యాఽస్మితా రాగద్వేషాభి నివేశాః పంచక్లేశాః॥

క్లేశములు ఐదు ఉన్నవి. అవి 1 అవిద్య 2 అస్మిత 3 రాగము 4 ద్వేషము 5 అభినివేశము ఈ క్లేశములు సాధకుని

దుఃఖపెట్టును. ఈ అయిదింటికి అవిద్యయే కారణము. ఇదే ముఖ్యము.

4సూ॥ అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్త తను విచ్ఛిన్నో దారాణామ్॥

అవిద్య తర్వాత యున్న అస్మితాదులు పుట్టుటకు అవిద్యయే ముఖ్యకారణము. ఇదే అజ్ఞానము. అనగా జ్ఞానాభావమే అజ్ఞానము విద్యాఽభావమే అవిద్య అంటారు నాస్తికులు. అంటే అవిద్య, అజ్ఞానము భావరూపమైనది. అనాది విపర్యయం అంటే జ్ఞానముకంటే భిన్నముగా యున్నది. కనుక విపర్యయం అంటారు. విద్యకంటే భిన్నమైనది. అవిద్య. ఈ అవిద్య మిగతా నాలుగుకు కారణభూతమగుచుండును. అంటే అవిద్యే పంచక్లేశములు.

5 సూ॥ అనిత్యాఽశుచి దుఃఖాఽనాత్మసు నిత్యశుచి సుఖాఽత్మ ఖ్యాతిరవిద్యా॥

అవిద్యా స్వరూపము ఏమనగా 1 అనిత్యమైనదానియందు 2 అశుచికల దానియందు 3 దుఃఖమునందు 4 అనాత్మయందు నిత్యమనియు, సుఖమనెడి బుద్ధి కలుగుటయే అవిద్య. ఇదే అజ్ఞానము. స్వర్గము అనిత్యము మోక్షము నిత్యము.

యజ్ఞాదులవలన స్వర్గము కలుగును. అంటే దేవతలకు సంబంధించిన సుఖము, ఈ భూలోకములో చేసుకున్న పుణ్యము ఉన్నంత వరకు ఆస్వర్గములో ఉండి అది అయిపోయిన వెంటనే తిరిగి ఈ భూలోకమునకు రావలసినదే. ఇది కర్మభూమి మంచిగాని చెడ్డగాని చేసేది ఈభూలోకములోనే మంచి కర్మకు స్వర్గము. చెడ్డకర్మకు నరకము తప్పదు. మోక్షమునకు నాకు సాధన జ్ఞానము. ఆపరా లోకములు ఎటువంటివంటే వ్యవసాయము చేస్తే ధాన్యమనే లోకము కలుగును. అంటే పండిన ధాన్యము జీవితాంతయు ఒక్క పంటతో సరిపోవునా? లేదుగా. అలాగే పుణ్యము

చేత సంపాదించిన పరలోకము అంటే స్వర్గలోకములో అనుభవించి మరలా భూలోకమునకు రావలెను. అందరు సుఖమును కోరెదరు గాని ప్రయత్నపూర్వకముగా పాపమును చేయుదురు. అంటే అబద్ధమాడుట, లంచము పట్టుట మొదలగు పనులు పాపములు. కనుక న్యాయ సంపాదనము, మిత భోజనము, సంపాదించిన దానిని సద్వినియోగము చేయుట ఇలాచేస్తే తప్పక జ్ఞానము కలుగును.

శ్లో॥ పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః।
న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః॥

అంటే పుణ్యఫలమైన సుఖమును కోరెదరుగాని పుణ్యకార్యము చేయరు. పుణ్యకార్యములైన సత్యము, ధర్మము, నీతి, న్యాయము మొదలగునవి కలిగియున్నచో సుఖము కలుగును. కాని ప్రయత్నపూర్వకముగా పాపము చేయుదురు. దాని ఫలము దుఃఖము, అయినా పాప కార్యములు చేయుచు పుణ్యఫలమును కోరెదరు. అట్టివారికి పుణ్యము వచ్చునా? తాను చేసిన పుణ్యముగాని పాపముగాని తప్పక అనుభవించవలసినదే. అది మాత్రము తప్పేదికాదు. ప్రతివాడూ ప్రారబ్ధకర్మ అనుభవిస్తూ ఆగామి తన చేతిలో యున్నది గనుక పాపముగాని పుణ్యముగాని చేస్తాడు. అంటే పాపపు పనులు చేస్తూ ఉంటే వచ్చే జన్మనుకూడా పాడు చేసుకుంటున్నాడన్నమాట. చెట్టు ఎక్కు వానిని కాళ్ళు పట్టిలాగినచో పైకి ఎక్కజాలనట్లు ప్రకృతి పైకిపోనీయదు. కనుక ఏకాంతములో ఏకాగ్రతతో ఏవరు మొరపెట్టు కొందురో వారి మొర భగవంతుడు తప్పక వింటాడు. భగవంతుని ప్రార్థించినచో వచ్చిన కష్టముల నుంచి బైటపడే ఉపాయము తోపించును.

ముంగిస త్రాచుపాము పోట్లాడుకొనునప్పుడు పాము ముంగిసను కంచినచో వెంటనే నకులవల్లిని తాకును. వెంటనే ఆ

విషము హరించిపోయి మరల వచ్చి పాముతో పోట్లాడి కడకు పామును చంపును. అలాగే భగవంతునితో మనస్సును భగవన్మయముగా చేసి ప్రార్థించినచో తప్పక వాళ్ళ మొరవింటాడు.

ప్రహ్లాదుడు, ధ్రువుడు, సక్కుబాయి, మీరాబాయి మొదలైనవారు ఈ ప్రకారముగా మొర పెట్టుకొన్నారు. అలా మొర పెట్టుకొన్నచో భగవదనుగ్రహము కలుగును. భావి కాలము తన చేతిలో యున్నది. కనుక మంచి పనులు చేసి రాబోవు జన్మను ధన్యవంతమైన దానినిగా చేసుకొనవచ్చును. దైవానుగ్రహము కలుగునట్లు ప్రవర్తించినచో ప్రారబ్ధకర్మకూడ కొంత సడలి పోవును. మానవుడు అధర్మము వలన ముందుగా వృద్ధి పొందును. ధనము కలుగును. శత్రువులను జయించును. కాని చివరకు సమూలముగా నశించి పోవును. కొందరు బీదవారైనను కొద్ది కొద్దిగా దైవ విశ్వాసము భజనాదులు చేయుచున్నందున కొద్దిగా బలముండును. అట్టి ధర్మమును దైవ భక్తిని వదలకుండా యున్నచో ధర్మమునకు బలము చేకూరి ధర్మము వృద్ధిపొంది అధర్మమును అణచి వేయును. అందుకే "ధర్మో రక్షతి రక్షితః" అన్నారు. అంటే ధర్మాన్ని నీవు రక్షించినచో ధర్మము నిన్ను రక్షించును అని. ధర్మమును రక్షించక పోయినచో ధర్మము నిన్ను రక్షించదు.

23-7-74 మంగళవారం

అవిద్య అని యోగులు, అధ్యాస అని వేదాంతులు అందురు. పాము కాని త్రాడు యందు పాము అను భ్రాంతి అధ్యాస. ముత్యపు చిప్పను చూచి వెండి మొదలగునవిగా గాంచుట అధ్యాస.

మూలా జ్ఞానమనగా బ్రహ్మము అంటే నాకు తెలియదు అనేది తూలాజ్ఞానమనగా ప్రపంచ సంబంధమైనవి తెలియదు అనేది. మూలాజ్ఞానమంటే మూలమైన బ్రహ్మమును ఆవరించినది. తూలా

జ్ఞానమనగా ప్రపంచములో అనగా ఒక మనిషిగాని, ఒక వస్తువును గాని నాకు తెలియదనేది. ప్రతి వ్యక్తి అజ్ఞానము పోవుటకు ప్రయత్నించవలెను. అజ్ఞానము ఎంతెంతకున్న అంతకంతకు దుఃఖము తప్పదు. కనుక జ్ఞాన సంపాదనను పొంది సుఖ శాంతులను పొందవలెను.

6 సూ॥ దృగ్దర్శన శక్త్యో రేకాత్మతే వాఽస్మితా॥

అజ్ఞానము యొక్క ప్రథమ పుత్రిక అస్మిత, దృక్ శక్తి దర్శన శక్తి, దృక్ శక్తి అంటే పురుషుడు దర్శన శక్తి అంటే బుద్ధి పురుషుడు బుద్ధి వేరు వేరు వస్తువులైనా అవిద్యా బలముచే పురుష బుద్ధులకు తాదాత్మ్యమున్నట్లు తోచుటనే అస్మిత అనబడును. అంటే పురుషుడు, బుద్ధి ఒకటే అనేది అస్మిత. ఒక్కటివలెయుండే దానిని అస్మిత అనియు అవివేకమనియు అందురు. ఈ రెండూ ఒకటే.

పురుషుడు చైతన్యము. బుద్ధిజడము. జడమునకు చైతన్యము ఎట్లు ఎట్లు కలుగునంటే నేనే అని అనుకునేది అధ్యాస అనగా త్రాడును చూచి పాము అనుకొన్నట్లు చైతన్యమైనది పురుషుడు. జడమైనది బుద్ధి. ఇనుపగుండును అగ్నిలో కాల్చుటచే అగ్నిధర్మము ఇనుప గుండులో చేరి కాలుడు వచ్చును. అగ్ని ధర్మము వలన ఇనుప గుండు ఎర్రగా గుండ్రముగా అగ్నిలా ఉన్నట్లు కనుపించును ఇనుప గుండుకు కాల్చుశక్తి వచ్చినది.

దృగ్ అయిన పురుషునకు దర్శనమైన బుద్ధి ధర్మము తనదనుకొని ప్రకృతి పురుష వివేకము లేక పోయింది. అంటే ఆ రెండింటిని విడదీసుకొనేది లేక ఆ ఇద్దరు ఒకటే అన్నట్లు తోస్తున్నది, అంటే అస్మిత వల్ల రెండూ ఒకటిగా తోచును.

7 సూ॥ సుఖానుశయీ రాగః॥

ఎవరు పూర్వము బాగా సుఖము అనుభవించి యున్నచో మరల ఇప్పుడా సుఖములన్నిటిని స్మరించును. దానివల్ల మరల ఆ సుఖములు కావలెనని కోరుకొనును. ఇదే రాగము.

8 సూ॥ దుఃఖానుశయీ ద్వేషః॥

రాగము కడకు దుఃఖదాయకము. కనుక దుఃఖమని అన్నారు. పూర్వము కొన్ని కష్టములు అనుభవించి దుఃఖమును పొంది యున్నందున ఇప్పుడు ఏదైనా అట్టి దుఃఖదాయకమైనది. కను పించినచో అది నాకు వద్దు అని అనుకొనును. అంటే అదిదుఃఖ దాయకమైనదనే జ్ఞానము ఇదివరకే కలిగినది. అంటే ఒక పామును చూచినచో దానిని పట్టుకొనుటకు ఏవరైనా ప్రయత్నించెదరా! లేదుగా. పట్టుకుంటే కరచును అను భావమే దానికి కారణము కనుక దానిని పట్టుకొనుటకు ఎవ్వరూ ప్రయత్నించరు.

31-7-74 బుధవారం

9 సూ॥ స్వరసవాహీ విదుషోఽపి తథాఽఽరూఢోఽభినివేశః॥

పండితునకు కూడా మూఢునకు వలె మరణభయము స్వాభా వికముగా కలుగును. ఇక్కడ పండితుడనగా స్వస్వరూప జ్ఞానియని కాదు. శాస్త్ర పాండిత్యము కలవాడని తెలుసుకోవలెను. ఆత్మ విజ్ఞాని మరణమునకు భయపడడు. క్రిమికీటకాదుల వలెనే బాగా చదువుకున్న పండితునకు కూడా స్వభావముగా మరణ భయము కలుగును. సంస్కారము, వాసన అనగా పండితుని వద్ద వేదము చదువుకొనే విద్యార్థి బ్రాహ్మణుడా కాదా అను సందేహము రాగా చదువుకునే సమయములో బాగా కాల్చిన అట్లకాడ అంటించగా అల్లాహో అక్బర్ అన్నాడు. అది లోపల వాసనల వలన అలాపలికెను. అంటే ఎంతో కాలమునుంచి వేదము చదువు చున్నను తాను మహమ్మదీయుడు కనుక ఆ వాక్యమే వచ్చినది. ఇట్టిదానినే వాసన అంటారు.

10 సూ॥ తే ప్రతి ప్రసవ హేయాః సూక్ష్మాః॥

ఈ అధ్యాయము క్రియా యోగములో బోధించినది, దీని వల్ల అవిద్యాదులు క్రమముగా నశించి పోవును. కనుక ఈ క్రియా యోగమును కర్మయోగమని కూడ అంటారు. వారికి సంప్రజ్ఞాత సమాధి బాగా లభిస్తుంది. ఇట్టివానికి ప్రకృతి వేరు పురుషుడు వేరు అని బాగా తెలిసియుండును. అప్పుడు అవిద్యాదులు అంటే పంచక్లేశములు దగ్ధమైన వాటివలె యుండును పూర్తిగా నశించ లేదు. సాధకుడు సంప్రజ్ఞాత సమాధి వరకు ప్రకృతి వరకు సూక్ష్మముగా చేసికొన్నాడు. అట్టివాడు ఆ క్లేశములను పూర్తిగా నశింప చేయవచ్చును. అంటే ఇంకా బాగుగ పరవైరాగ్యమును శీలించినచో అసంప్రజ్ఞాత సమాధి లభించును. అప్పుడు సూక్ష్మములైన పంచక్లేశములు నశించిపోవును. చిత్తము నశించును. కర్మలు రాసులు రాసులుగా యున్నవంటే చాలా యున్నవని అర్థము. ఇవి అంతఃకరణలో సూక్ష్మముగా ఇమిడియుండును.

11 సూ॥ ధ్యాన హేయాస్త ద్వృత్తయః॥

ఆ క్లేశములకు సంబంధించినది చిత్తములోయున్నది నశించి పోవలెనంటే క్రియా యోగము వలన పంచక్లేశములు చాలావరకు శిథిలములగును. అంటే బలము తగ్గిపోవును. కాని నశించవు. ఆ తరువాత పురుషుని బాగా ధ్యానించినచో ఇంకా క్షీణించి పోవును. ధ్యానము చేయగా చేయగా చిత్తవృత్తులు తగ్గును.

తపస్సుస్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అంటే తాను తన సర్వస్వం పరమేశ్వరునకు సమర్పించుకొనుట వీటివలన చిత్త సంస్కారము క్షీణించుచు వచ్చును. సత్యధర్మాదులు లేనిచో చిత్త సంస్కారము బలీయమగుచుండును. అసంప్రజ్ఞాత సమాధి శీలించినచో సమూలముగా పంచక్లేశములు, చిత్త వృత్తులు నశించి పోవును.

1-8-74 గురువారం

మందాధి కారులకు పంచక్లేశములు ఉన్నవని, అవి స్థూలముగాను సూక్ష్మముగాను ఉండునవియు, సూక్ష్మమైన వాటిని నిర్విచారమైన సంప్రజ్ఞాత సమాధి శీలించగా క్రమముగా ప్రకృతి వరకు పోవును. ఇది సంప్రజ్ఞాత సమాధి.

12 సూ॥ క్లేశమూలః కర్మాశయో దృష్టాఽదృష్ట జన్మవేదనీయః॥

కర్మాశయమునకు కారణం అంటే కర్మల సమూహము క్లేశముల వలన ఏర్పడును. పుణ్యపాపకర్మలవలన ఏర్పడ్డ సంస్కారములను కర్మాశయ మని అంటారు. అవిద్యమొదలగు పంచ క్లేశముల వలన కర్మలు. ఆ కర్మలవలన సంస్కారము ఏర్పడును. ఆ సంస్కారము పుణ్యరూపముగాను, పాప రూపముగానుకూడ ఉండును. ఇదే కర్మాశయమంటే కర్మాశయము దృష్ట జన్మవేదనీయం అనగా ఈలోకములో కనుపించే ఈ జన్మ సంబంధమే. అదృష్ట జన్మవేదనీయమంటే పరలోకములో యున్న జన్మలనుబట్టి తెలుసుకోవలసినది.

శిలాదుని పుత్రుడు నందికేశుడు ఈశ్వరుని గురించి ఘోర తపస్సుచేసి ఈ లోకములోనే వెంటనే దేవత్వమును పొందెను. అంటే మనుష్యుడుగాయుండి అంత తీవ్రమైన తపస్సుచేసి దేవత్వము పొందెను. ఇది పుణ్యకర్మాశయము అంటే ఈ జన్మలోనే పుణ్యకర్మచేసి పొందెను.

పాపకర్మయగు దృష్ట జన్మ వేదనీయమగు పాపకర్మాశయమునకు నహుషుడు దేవరాజు అయినా అగస్త్యుని అధిక్షేపించుటయను పాపకర్మాశయముచే సర్పజన్మప్రాప్తించెను. అనగా నహుషుడు నూరు యజ్ఞములు చేసినందున వానికి ఇంద్రపదవి లభించును. అందువలన నహుషుని ఇంద్రలోకమునకు తీసికొనిపోయి దేవేంద్రపదవి ఇచ్చి దేవతలు కొన్ని దైవశక్తులను ఇచ్చిరి. కాని

నహుషుడు దేవేంద్రపదవిని పొందినందున శచీదేవి నాకు భార్య కావలెనని కోరినందున ఆమెగారు గురువగు బృహస్పతిని ప్రార్థించగా ఆయన ఒక ఉపాయము చెప్పెను అదేమనగా నాఅంతఃపురమునకు వచ్చునప్పుడు మహర్షులచేత నీ వాహనము మోయించుకొని రావలెనని చెప్పుమనగా ఆప్రకారము నహుషునకు తెలుపగా నహుషుడు దేవేంద్ర పదవి నధిష్టించినందున తప్పదని మహర్షులు పల్లకను మోయుచుండగా తన కామ తొందరచే సర్ప సర్ప అనెను. అనగా తొందరగా నడవమని కూడ అర్థము. ఐతే సర్ప సర్ప అని అమహర్షులను అనగా కుంభసంభవుడను అంటే అగస్త్య మహర్షికి కోపము వచ్చి నహుషుని సర్పము గమ్మని శపించెను. అప్పుడు నహుషుడా మహర్షిని ప్రార్థించగా కొన్ని ప్రశ్నలు చెప్పి ఆప్రశ్నలకు సమాధానము ఎవరైనా చెప్పినచో అప్పుడు నీకు శాపవిమోచనము కలుగునని చెప్పెను. ఇది దృష్ట జన్మవేదనీయ పాపకర్మ. నహుషుడు పుణ్యకర్మచేసి దేవేంద్ర పదవిని పొందినను మహర్షులకు అపకారము చేసినందున మరలా ఈ మానవ లోకములో సర్పమై పుట్టెను. పాపములు నవ్వుతూ చేస్తే ఏడుస్తూ ఆ ఫలమును అనుభవించవలసినదే 1 భూత ప్రతిబంధము-అంటే ధ్యానములో కూర్చుంటే గడచిపోయిన సంగతులు జ్ఞాపకమునకు వచ్చును. 2 వర్తమాన ప్రతిబంధమనగా-విషయములందు ఆసక్తి అంటే ప్రీతి యున్నచో అది ధ్యాన సమయములోవచ్చి కూర్చుండును. 3 ప్రజ్ఞా మాంద్యము అంటే గురువులు ఆత్మోపదేశము చేసిన దంతయు విన్నప్పుడు తెలిసినట్లుండును గాని మరలా జ్ఞాపకముండదు. ఇదే ప్రజ్ఞామాంద్యము మందబుద్ధి. కుతర్కం అంటే ఔనంటే కాదనడం. దీనిని గురించి ఖండన ఖండన ఖాద్యమను గ్రంథముకూడ యున్నది. 4 విపర్యయ దురాగ్రహ మనగా ఉన్నది ఒకటిఅయితే తాను తలచెడిది వేరు. శాస్త్రము 'సర్వం ఖల్విదం బ్రహ్మ'

అన్నది. మహర్షులు కూడ శాస్త్రము చెప్పినది సత్యము, మా అను భవముకూడ అదే అన్నారు. కాని మనకు అలా బ్రహ్మముగా కన్పించు చున్నదా? లేదు. మనుష్యులు, కుక్కలు, గోవులుగా కన్పించుచున్నవి. దీనినే విపర్యయ దురాగ్రహము అని అందురు. ఈ నాలుగింటిలో ఒకటి యున్నను జ్ఞానము కలుగదు.

విషయాదులను ఇంద్రియ నిగ్రహముచేత, ప్రజ్ఞామాంద్య మును గురువులను అడిగి తెలిసికొనడం వల్ల, శ్రవణము వల్ల, పోవును. కుతర్కము మననము వల్ల పోవును. నిదిధ్యాస చేత విప ర్యయ దురాగ్రహము పోవును. ఉన్నది ఒకటి అయితే కనుపించేది వేరుగా యున్నది. కనుక ఆ ఉన్నదానినే భావించమనియే ఇక్కడ నిదిధ్యాస చేయించుటకు కారణము.

అదృష్ట జన్మవేదనీయ మనగా ఇక్కడచచ్చి, ఆలోకము నకుపోయి అక్కడ సుఖము అనుభవించును. కర్మాశయమంటే పుణ్యపాప కర్మల సమూహమే. ఇది అంతయు పంచక్లేశములవల్లనే వచ్చును.

3-8-1974 శనివారం

16 సూ॥ హేయం దుఃఖమనాగతమ్॥

భూతకాల దుఃఖము అయిపోయినది. ఆ గతదుఃఖం అనగా వర్తమాన కాలంలో పోగొట్టుకొనుటకు వీలులేదు. ఇది అనుభ వించ వలసినదే. వర్తమాన దుఃఖము అనుభవముచేత నశించి పోవును. భవిష్యత్తులో రాబోయే దుఃఖమే అనాగతం. ఈ దుఃఖ మును పోగొట్టుకొనుటకు ప్రయత్నము చేయవలెను.

17 సూ॥ ద్రష్టృ దృశ్యయోః సంయోగో హేయ హేతుః॥

భవిష్యత్తులో దుఃఖము ఎందుకు కలుగుతుందో తెలిసి కొన్నచో అది రాకుండా చేసుకొనవచ్చును. ద్రష్ట పురుషుడు దృశ్యము ప్రకృతి యొక్క సంయోగమే దుఃఖమునకు హేతువు.

జ్ఞానస్వరూపుడైన పురుషుడు ద్రష్ట. దృశ్యం అంటే బుద్ధిరూప ప్రకృతి. ఈ పురుషునకు బుద్ధికి గల సంబంధమే దుఃఖమునకు కారణము. అయన పురుషుడు, నేను బుద్ధిని అనే వివేకము లేకపోవడమే దుఃఖమునకు కారణము. కేవలము మనస్సు విషయములను గ్రహించలేదు ఇంద్రియముల ద్వారానే విషయములను గ్రహించును. అంటే మనస్సు శబ్దాది విషయాకారముగా పరిణమించును. ఇదే విధముగా అన్ని ఇంద్రియముల విషయములు కూడా ఇంతే. విషయాకారమైన బుద్ధియందు అనగా చిత్తమునందు పురుషుని ఛాయా ప్రతిబింబము బింబించును. ఆ చిత్తములో శబ్దాదులన్నియు ఉన్నవి కనుక పురుషుడు ఆ చిత్తములోనివి అన్నియు నావే అనుకొనును. అంటే బుద్ధి వేరు పురుషుడు వేరు అనే వివేకము లేకపోవుటవలన ఈ దుఃఖము కలుగుటకు కారణము. వాస్తవముగా పురుషునకు దుఃఖము లేకపోయినా వివేకము లేకపోవుటవలన దుఃఖము కలుగుచున్నది. దృశ్యము వేరు దృక్ వేరు అని తెలియకపోవుట చేతనే దుఃఖము కలుగుటకు కారణము. అదే అజ్ఞానము. బుద్ధియొక్క ధర్మములైన సుఖములు, దుఃఖములు అన్నీ నావే అని పురుషుడు దుఃఖించును.

18 సూ॥ ప్రకాశక్రియా స్థితిశీలం భూతేంద్రియాత్మకం
భోగాపవర్గార్థం దృశ్యమ్॥

ప్రకాశము సత్వగుణధర్మము జ్ఞానము. క్రియ రజోగుణ కర్మము. ఇది ప్రవృత్తి స్థితి తమోగుణము. శీలమనగా ఆ మూడు స్వభావముగా కలిగి ప్రకృతి యుండును.

భూతేంద్రియాత్మకం—అపంచీకృత పంచభూతములు అంటే సూక్ష్మభూతములు పంచీకృత పంచభూతములంటే స్థూల పంచ భూతములు శబ్ద స్పర్శ రూప రస గంధాదులు జ్ఞానేంద్రియములు. వాక్ పాణి పాద పాయూపస్థలు కర్మేంద్రియములు. ఈ పది

బాహ్యేంద్రియములు. అంతఃకరణ చతుష్టయము, అంతరేంద్రియములు. సంకల్ప వికల్పాత్మక వృత్తి గలది మనస్సు. నిశ్చయాత్మకవృత్తి గలది. బుద్ధి అహంకారమన్నా గర్వమన్నా అభిమానమన్నను అహంకారవృత్తి అంటే అనాత్మయగు దేహేంద్రియాదులయందు గలది అహంకారవృత్తి. చిత్తమంటే స్మరణాత్మకమైన వృత్తి అంటే చింతన. ఈనాలుగు కలిసినదే అంతఃకరణ. వీటికి కారణము మనోబుద్ధి చిత్త అహంకారములు. ఇవి అంతరింద్రియములు. పంచీకరణము జరిగితే స్థూలభూతము లగును. భోగము అపవర్గము అర్థము అంటే ప్రయోజనము పురుషునకు భోగము కలిగించేది అనగా భోగాపవర్గములు బుద్ధి కృతములుగాన బుద్ధియందుండుటకు ఉచితము. కాని పురుషునియందు వ్యవహరించుట అనుచితము. ఐనను చేతనునియందు బుద్ధిగతము అగు బంధమోక్షములు సైతము వ్యవహరింపబడుచున్నవి. స్ఫటికమణియందు జపాకుసుమము ఉంచినచో స్ఫటికమణి ఎర్రగా కనుపించును. మణి ఎర్రగా యున్నదందురు. కాని మణి నిజముగా తెల్లదనము గలదే. పుష్పసాన్నిధ్యము వల్ల ఎరుపుదనము కనుపించినది. అలాగే పురుషుడు సుఖదుఃఖాదులన్ని బుద్ధివేగాని నాకు లేవు అని తెలిసి కొనడమే ఆత్మానాత్మ వివేకము. ఇవి అన్నియు నావే అనుకొని నాకు దేహమునకు సంబంధము లేదు. అని తెలిసికొనలేక, మలినచిత్తముతో గలవి అన్నియు నావే అనుకొని సంబంధమున్నదనుకుంటున్నందుననే దుఃఖము కలుగును. కనుక ఇదివరకు జరిగినది పోనీయండి. ఇక్కడి నుండి అయినా ప్రకృతివేరు, పురుషుడు వేరు, పురుషునకు సుఖ దుఃఖాదులేమియు లేవు. అవి అన్నియు అంతఃకరణ ధర్మములని పెద్దలవలన తెలిసికొన్నచో ఆ దుఃఖము తొలగును. అపుడు జ్ఞానము కలుగును. కనుక పురుషుని యొక్క భోగము అనగా బంధమునకు గాని అపవర్గం అనగా మోక్షమునకు గాని దృశ్యమును తొలగించుకొనవలెను.

4-8-1974 ఆదివారం

19 సూ॥ విశేషా౽విశేష లింగమాత్రాలింగాని గుణ పర్వాణి॥

1 విశేషము, 2 అవిశేషము, 3 లింగమాత్రము, 4 లింగము అనుగుణములతో కూడియున్నది. ప్రకృతి అందు 1 విశేషము— ఆకాశము వాయువు అగ్ని ఉదకము భూమి అను భూతములైదునూ, అట్లే శ్రోత్రము త్వక్కు-చక్షుస్సు జిహ్వా ఘ్రాణము అను జ్ఞానేంద్రియములైదునూ, వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ అను కర్మేంద్రియములైదును, మనస్సు-ఇవి పదహారు వికారములు, 2 అవిశేషము-అంటే తన్మాత్రలు అనగా ఒక దానిలో ఒకటి కలవక ఐదు భూతములు విడివిడిగా యున్నవి. అనగా ఆకాశము వాయువు అగ్ని జలము పృథ్వి, వీటిని తన్మాత్రలనియు సూక్ష్మభూతములనియు అందురు. ఇది ప్రకృతి యొక్క కార్యములు.

3 లింగమాత్రము- 4 అలింగము - అనగా గుణములు కలిగిన ప్రకృతి మూలప్రకృతినుండి మహాత్తత్వం పుట్టినది. మహాత్తత్వంనుండి అహంకారము, దీనినుండి పంచతన్మాత్రలు, దీనినుండి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరింద్రియములు పుట్టును. అంటే మూలప్రకృతి నుండి ప్రధానము పుట్టినది. ప్రధానమునుండి అహంకారము పుట్టినది. అంటే మూలప్రకృతి కారణము. మహాత్తత్వము కార్యము. దీనినుండి అహంకారము పుట్టెను. అప్పుడు మహాత్తత్వము కారణము అహంకారము కార్యము. అహంకారము ప్రధానమునకు వికృతి అన్నమాట. అంటే కార్యము. అహంకారమునుండి పంచ తన్మాత్రలు పుట్టెను. అంటే అహంకారమునకు పంచతన్మాత్రలు వికృతి అనగా కార్యము. అంటే జ్ఞానేంద్రియములు పంచతన్మాత్రలకు కార్యము. కర్మేంద్రియములు, మనస్సు ఈ పదునారు ఇంద్రియములు వికారములు. ఇవి విశేషములు.

అవిశేషము అంటే పంచతన్మాత్రలు. మహత్తత్వమునుండి అహంకారము పుట్టెను. మహత్తత్వము కారణమునకు కార్యము అహంకారము. సత్త్వరజస్తమోగుణములు మూడు హెచ్చుతక్కువలు లేక సమానముగా యున్నచో సృష్టి కలుగదు. ఇది సామ్యావస్థ. పంచతన్మాత్రలు, అహంకారము ఇవి అవిశేషములు. ప్రకృతి పురుషులయొక్క సంబంధము దుఃఖమునకు హేతువు. ప్రకృతి పురుష వివేకము మోక్షమునకు హేతువు. లింగతత్త్వం మహత్తత్వం అలింగం ప్రధానం అనగా ప్రకృతి అలింగం అంటే సత్త్వరజస్తమోగుణములు సమానముగా ఉండు స్థితి దీనినే ప్రకృతియని, ప్రధానమని అంటారు. ఆ మూడు గుణములలో హెచ్చుతక్కువలు కలిగినచో సృష్టి కలుగును.

20 సూ॥ ద్రష్టాదృశి మాత్రః శుద్ధోపి ప్రత్యయానుపశ్యః॥

ద్రష్ట అంటే కేవలం చైతన్య స్వరూపుడు. వానిలో జడత్వము ఏమియు లేదు. కేవల పరిశుద్ధుడు. ఫలనా వస్తువు అని తెలుసుకోవడమే ప్రత్యయము. బుద్ధి వేరు పురుషుడు వేరు. కాని ప్రకృతి పురుష వివేకము లేనివారు బుద్ధిలో కలిగిన వన్నియు తన వేయని పురుషుడు తలంచును. ఇది అజ్ఞానదశ అలా కాక ఈ వికారములన్నియు బుద్ధికి సంబంధించినవి, నాకు ఎట్టి వికారములు లేవు అని గ్రహించినదే వివేకము ఇదే జ్ఞానము, బుద్ధికంటె నేను వేరుగా నున్నానని తెలుసుకొనడమే వివేకము ఇదే ఆత్మానాత్మ వివేకము. ఇది అంతా పురుషుని స్వరూపము.

21 సూ॥ తదర్థ ఏవ దృశ్య స్యాత్మా॥

ద్రష్ట దృశ్యములలో ఏది ప్రధానమో చెప్పబడుచున్నది. ద్రష్టస్వరూపము పురుషుడు. ఒకానొకప్పుడు బుద్ధి దుఃఖిస్తూయుంటే పురుషుడు తానే దుఃఖపడుచున్నాననియు, బుద్ధికి కావలసినటువంటిది సంభవిస్తే పురుషుడు ఆ సుఖము తనదేయని భావిం

చును. ఇది అంతా అవివేకమే. అంటే ప్రకృతి పురుష వివేకము లేదు. వివేకము యున్నచో సుఖ దుఃఖములు, అన్నివికారములు బుద్ధికి సంబంధించినవే కాని, నాకు ఏమీ లేవు అని వివేకము కలిగినచో మోక్షము కలుగును. గురుదేవులు భావశుద్ధియే జ్ఞానమని అన్నారు. అంటే భావములు, దోషములు నశించుటకే పూజాదులు మొదలగునవి. భావము మార్చుకుంటే జ్ఞానము కలుగును. ఈశ్వరుని మనసు బాగా ప్రార్థన చేసినచో ఈశ్వరానుగ్రహము కలిగి మనస్సులో యున్న దోషములు తొలగి త్వరలో సమాధి సిద్ధించును. జ్ఞానము కలిగితే ఒక్కటేగాని, జ్ఞానము కలుగనంతవరకు ఈశ్వరుడు వేరు జీవుడు వేరు అని వేదాంతులు అందురు. ఎవరైతే తాను బాగు పడాలని మనస్సులో అనుకుంటారో, వారు దైవానుగ్రహము కలిగి, గుణములను సంపాదించుకోవలెను. అంటే సత్యము, ధర్మము నీతి, న్యాయములతో జపధ్యానాదులు చేయుచున్నచో సంసార దుఃఖ రోగము పోవును. కనుక తెలిసినంతలో క్రమక్రమముగా రాగ ద్వేషాదులను తొలగించుకొంటూ ప్రకృతి పురుష వివేకము కలిగి యున్నచో మోక్షము కలుగును. ఇది మానవజన్మకు సాఫల్యము. ఇదివరలో జరిగినది జరిగిపోనీయండి. ఇప్పటి నుండియైనా మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షాదులు కలిగి ప్రయత్నించవలెను. ప్రయత్న పూర్వకముగా దైవానుష్ఠానము చేసినచో కొంత కాలమునకు చక్కగా పట్టుబడి జ్ఞానము కలుగును.

26-8-74 మంగళవారము :-

22. సూ॥ కృతార్థం ప్రతినష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్

భావము - కృతార్థుడైన వానికి నష్టమైనప్పటికి, కృతార్థులు కాని వారికి ఉండియే తీరును. ప్రకృతి పురుషవివేక ఖ్యాతి కలిగి నప్పుడు ప్రకృతిపని అప్పుడు పూర్తి అయినది. సరి వానికి ప్రకృతి నష్టమైనందున జనన మరణ సంసారా ప్రకృతి వానికి వర్తించదు

ప్రకృతి, పురుష వివేకము కలుగని వారికి ప్రకృతి నష్టము కాలేదు. ప్రకృతి పురుషవివేకము కలిగిన వారికి రాగద్వేషాదులు నశించి కైవల్యము ప్రాప్తించినది. కనుక వానికి నష్టప్రాయమైన దాని వలె ఉండును. ప్రకృతి నశించిన వారికి భోగాపవర్గము సమర్పించ వద్దు. అట్టి అజ్ఞానులు అనేకమంది యున్నందున వారికి భోగమును మోక్షమును ఇవ్వవలెనుగా! వివేకము కలిగిన వానికి భోగాదులు నష్టమైనట్లు ఉండును. వానికి వ్యాపారము తొలగినది. అంటే భోగసమర్పణం, అపవర్గ సమర్పణం లేదు. విషయములలో ప్రవర్తించే పనిలేదు. వివేకము కలుగని వారికి భోగాపవర్గములు ఇవ్వవలసియున్నది. కనుక వారికి ప్రకృతి నశించలేదు. ప్రకృతి వ్యాపారము జరుగుచునే యుంటుంది. ఎవరు వివేకాదులు సంపాదించుకొందురో వారికే రాగద్వేషాదులు, ప్రకృతి నష్టమగును.

23. సూ॥ స్వస్వామి శక్త్యోః స్వరూపోపలబ్ధిహేతు స్సంయోగః॥

భావము :- స్వశక్తి అంటే దృశ్య స్వభావం. స్వామిశక్తి అన్నప్పుడు దృక్ స్వభావము అగును. ఆ ఇద్దరికి స్వరూపప్రాప్తికి అంటే సంబంధము కలుగచేయునదే సంయోగము అంటారు. ప్రకృతి పురుషులకు సంయోగము కలుగుటకు కారణము అజ్ఞానమే.

24. సూ॥ తస్య హేతురవిద్యా।

భా :- ప్రకృతివేరు, నేనువేరు అను వివేకము లేకపోవడమే అజ్ఞానము. జ్ఞానము లేదు కనుక దుఃఖముగాని, సుఖముగాని కలిగినచో బుద్ధి ఆ సుఖదుఃఖాదులు పొందుచుండగా పురుషుడు నేనే ఆ సుఖదుఃఖములను పొందుచున్నానని భావించును.

25. సూ॥ తదభావాత్ సంయోగాభావో హానం.
తత్ దృశేః కైవల్యమ్।

భా॥ :- దుఃఖము వచ్చుటకు హేతువు అజ్ఞానము, అవివేకము హానం అనగా సంయోగం పోవడమే. అది ఎట్లు పోవుననిన ఆ

అవిద్య అభావము వలన ఏర్పడినది. ప్రకృతి పురుషసంయోగం అవిద్య వలన ఏర్పడినది. కనుక వివేకము వలన సంయోగమునకు ఉపాదాన కారణం అవిద్య అవిద్యానాశంవల్ల కార్యమైన సంయోగముకూడ నశించును. అంటే అజ్ఞానము పోవుటవలన వివేకము కలుగును. అప్పుడు పురుషునకు మోక్షము కలుగును. అవిద్య వల్ల కలిగిన అవివేకము ప్రకృతి పురుష వివేకము వలన పోవును. వాస్తవముగా సుఖదుఃఖాదులు బుద్ధికి సంబంధించినవే కాని తనకు లేవు. తాను ఎప్పుడూ ముక్తుడే. బుద్ధియొక్క సంబంధమువల్లనూ, వివేకము లేకపోవుటవల్లనూ బంధముయని అనుకొందము. బుద్ధిని తనను విడదీసికొన్నచో జ్ఞానముకలిగి మోక్షము వచ్చును. ఆదే మోక్షము కీలకము పట్టుబడనంత వరకూ జననమరణ సంసారము ఉండనే ఉండును. బుద్ధి వృత్తిని తనయందు ఆరోపించుకొని తాను బంధములో యున్నట్లు భావించును. నిజముగా తాను ఎప్పుడూ బంధములో లేడు.

26 సూ॥ వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః॥

భా :- హానం అనగా ప్రకృతి పురుష సంయోగనాశనము అన్నమాట. అవిద్యకు విరోధియగును వివేకము. అందువల్ల వివేకము లేకుండ పోతుంది. విచారణచేసి బుద్ధిలోయున్న సంస్కారములన్నియు అంతే, కాని నాలో లేవు అని ఎప్పుడు తెలిసికొనునో అదే వివేకము. వివేకము కలిగినచో అవిద్య నశించును. అంటే ప్రకాశము కలిగితే చీకటి నశించును. విద్య అంటే జ్ఞానము. జ్ఞానము కలిగినచో అవిద్య నశించిపోవును. అవిచార పరులు బుద్ధికి కలిగిన బంధమును మోక్షమును, ఆత్మయందు కల్పన చేయుదురు. మేఘము ఆవరించి సూర్యుడు కనుపించుట లేదని అందుము గాని సూర్యుని మేఘము ఆవరించినచో సూర్యుడు ఎక్కడా కనుపించకూడదు.

కాని మేఘము మనదృష్టిని ఆవరించినందున ఈరోజులో సూర్యుడు కనుపించడము లేదు. అలాగే అజ్ఞానము అవిద్య బుద్ధిని ఆవరించినది. అందువల్ల చైతన్య స్వరూపము ఆత్మ స్వరూపము కనుపించక పోవడమునకు కారణము. సూర్యుడు భూగోళము కంటె పెద్దదైన మేఘమువలన ఆవరింపబడెనుగా! మేఘము మన కంటిని ఆవరించినందువల్ల సూర్యుడు కనుపించలేదు. కాని మనమో సూర్యుని మేఘము ఆవరించినదని అంటాము. "అత్యతిష్ఠద్దశాంగులమ్" బంధము బుద్ధికియున్నది. అజ్ఞానము బుద్ధిని ఆవరించినది, కనుక మోక్షము బుద్ధికి కలుగవలెను. బంధము బుద్ధికిపోవలెను. అవిచారపరులు అలాబుద్ధి ధర్మములను ఆత్మయందు ఆరోపించెదరు. బుద్ధికి కలిగిన బంధమునిత్యము కాదు. అగంతుకము. స్వభావము కాదు. స్వభావమంటే ఎల్లప్పుడుయుండవలెను. నీళ్ళకు, వేడియున్నదంటే అగంతుకము. అనగా అగ్ని సంబంధమువల్ల వేడిగాయుండును. ఆసంబంధము విడదీసినచో కొంతసేపటికి చల్లగా అయిపోవును. బుద్ధికికూడ సంబంధము అగంతుకమే. పురుషుని స్వభావము ఆనందము. సుఖదుఃఖాదులు, బుద్ధివేగాని నావి లేవని వివేకము కలిగినప్పుడు మోక్షమే.

7-8-74 బుధవారము

కైవల్యము వివేకఖ్యాతివల్ల కలుగును. అప్పుడు జీవన్ముక్తి లభించును. అట్టి జీవన్ముక్తిని వైభవము ఎలాయుండునంటే వాని యొక్క ప్రజ్ఞ ఏడు విధములుగా యుంటుంది. వివేకఖ్యాతిగలవాడు. ఆ జీవన్ముక్తుడు అట్టివానికి 7 అవస్థలతో కూడిన ప్రజ్ఞయుండును. ఆ ఏడులో 4 కార్య విముక్తసంజ్ఞ 3 చిత్త విముక్తసంజ్ఞ కలిగి యుండును. 1. దేనిని తెలిసికోతగినదో అది తెలిసికొన్నచో ఇక తెలిసికొనేది లేదు. కనుక ఇది నివృత్తి జిజ్ఞాసా నివృత్తి 2. దోషాలు పోగొట్టుకోతగినవి. హాతవ్యం - అనగా పోగొట్టుకోతగిన సముదా

యము. అంతా పోయినది. ఇక పోగొట్టుకోవలసినవి లేవు. ఇది జిహాసానివృత్తి. 3. వివేకఖ్యాతి కలుగుటవల్ల నేను పొందవలసిన దంతా పొందితిని. ఇక పొందదగినది లేదు. "ప్రేప్సాని"

4. వివేకఖ్యాతిప్రాప్తమువల్ల చేయదగినదంతా చేసి వివేకఖ్యాతిని సంపాదించుకొంటిని. ఇక చేయదలచినది లేదు. చేయాలనే చికీర్షనివృత్తి. ఈ నాలుగు కార్యరూప నివృత్తి సంజ్ఞలు.

1. చిత్త నివృత్తి సంజ్ఞగలవి మూడు చెప్పుచున్నారు. ఇవి బుద్ధికి సంబంధించినవి. కృతార్థమనగా నాబుద్ధి సంపాదింప తగినవి, సంపాదించినందున ఇక సంపాదించేది లేదు కనుక దుఃఖనివృత్తి అయినది.

2. భయ నివృత్తి - నాకు చాలా గుణములు నివృత్తి ఐనవి అంటే లీనమైనవి, తిరిగి పుట్టవు. సంపాదించేది లేదు కనుక బుద్ధి ధర్మము పుట్టదు. అంటే యోగము నుంచి చలించుననే భయము లేదు. ఇక అవి తిరిగి పుట్టవు. ఎప్పుడైతే గుణములు లీనమైనవో అప్పుడు నేను కేవల చైతన్య మాత్రుడనై యుంటాను. కనుక చిత్తగతమైనవి సకలము నివృత్తై పోయినవి. మొదటి పాదము నందు అంతరంగ పాదముగు చిత్తమును నిగ్రహించు యోగమును సంపాదించుకొన్న యోగికి అభ్యాసవైరాగ్యములను చెప్పెను. ఏకాగ్ర చిత్తునకు సమాధి కలుగును. రెండవ పాదములో ఎవని చిత్తము విషయములమీదకు పోతూయుంటుందో అట్టివానికి విషయ విక్షేపణ పోవుటకు క్రియా యోగము చెప్పబడినది. వాడు మధ్యరకం, మిక్కిలి చంచల చిత్తుడు కూడ అనగా పామరుడు. విషయ చిత్తుడైనవాడు కూడ యోగమును సాధించుటకు ఉపాయమును చెప్పుచున్నాడు ఇవి బాగా గమనించినచో ఎట్టి పామరుడైనను ఏకాగ్రతను సమాధిని సంపాదింపవచ్చును!

28 సూ॥ యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తి
రావివేకఖ్యాతేః॥

**29 సూ॥ యమ, నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధి యోఽష్టావంగాని॥**

భా॥ యోగము యొక్క అంగములను అనుష్ఠించుటచే చిత్త మాలిన్యము తొలగించును. అందువలన వివేక ఖ్యాతి యొక్క దీప్తి కలుగును. మిక్కిలి విక్షేప చిత్తము కలవాడు యోగాంగములను అనుష్ఠించవలెను. అవి 8 రకముల అంగములు 1 యమము, 2 నియమము, 3 ఆసనము, 4 ప్రాణాయామము, 5 ప్రత్యాహారము 6 ధారణము, 7 ధ్యానము, 8 సమాధి. వీటిని అనుష్ఠించుచుపోతే జ్ఞానాభివృద్ధిని సంపాదించుకొన వచ్చును. వివేకఖ్యాతి కొరకు జీవన్ముక్తి కొరకు దీప్తి కలుగును. అశుద్ధి అంటే పంచక్లేశములు. ఇవి పోతే చిత్తమాలిన్యమంతా పోయినట్లే అపుడు వివేకఖ్యాతి వరకు జ్ఞానము వృద్ధి కలుగును.

యోగాంగములను చక్కగా అనుష్టించినచో చిత్తనివృత్తి కలిగి ఋతంభరా ప్రజ్ఞ కలుగుతుంది. తద్వారా జీవన్ముక్తి కలుగుతుంది. యోగమంటే చిత్తవృత్తులు నశించుటయే. చిత్తవృత్తులు నశించవలెననే వారలు ఈ ఎనిమిది యోగాంగములను తప్పక అనుష్టించవలెను. అంటే శ్రద్ధయున్న ప్రతివ్యక్తియు బాగుపడవచ్చును.

**30. సూ॥ అహింసా సత్య మస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహాయమాః॥**

భా॥ యమము అంటే సాధకుని నివర్తింపజేయును. అహింస అనగా త్రికరణముల ద్వారా ఏప్రాణికి బాధకలిగించరాదు. సత్యమనగా ఎప్పుడూ అసత్యం మాట్లాడకుండా యుండవలెను. చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లు చెప్పేదే సత్యము. "సత్యం బ్రూయాత్" సత్యం అంటే ప్రాణులకు మేలును కలిగించే సత్యమును చెప్పవలెను. ఇతరులకు బాధకలిగించే సత్యమును చెప్పరాదు. దేవీభాగవతములో చెప్పిన విషయం వేటగాడు పందిని

కొట్టుట అది పారిపోవుట. ఆ విషయం ఒక మునిని వేటగాడు అడుగగా ఆ ముని బాగా ఆలోచించి అబద్ధం చెప్పరాదు. కాని సత్యం చెబితే ఆ పందిని చంపును. అని ఆలోచించి ఆ బోయివానితో అన్నమాట 'చూచేది చెప్పలేదు, చెప్పేది చూడలేదు'. అనగా కన్ను చూస్తుందిగాని చెప్పలేదు. నోరు చెప్పునుగాని చూడలేదు. కనుక నీవు మాటిమాటికి అడుగుతావు నీకు చెప్పేది ఏమిటని అన్నాడట. అంటే ఇతరులకు బాధకలిగే సత్యంనుండి ఇలా తప్పించుకోవలెను.

"అనుద్వేగకరం వాక్యం" ఇందులో నాలుగు విశేషము లున్నవి. వాటిని అనుష్ఠించుటయే తపస్సు. అహింసా సత్యములను బాగా అనుష్ఠించవలెను. ఒక సద్గుణము యుంటే మిగతా మంచి గుణములను అదే చేర్చుకొనును. "అస్తేయం" ఇతర వస్తువులను దొంగలించరాదు. ఒక సాధువుగారి వద్దకు ఒక దొంగ వచ్చి నమస్కరించినపుడు ఆ సాధువుగారు వానితో నేను ఒక మాట చెప్పెదను. చేసెదవా? అనగా వెంటనే దొంగ నన్ను దొంగతనము చేయవద్దని చెప్పకుండా ఇంకా ఏమైనా చెప్తే చేస్తానని చెప్పగా సరే దొంగతించిన సత్యమును మాత్రము చెప్పవలెననెను. ఆ దొంగ సరే నేను పట్టుబడినపుడు కదా యని అనుకొని సరే అబద్ధమాడనని చెప్పివెళ్ళెను. అప్పటినుండి ఆ దొంగ అబద్ధము మానినాడు. ఒకరోజు రాజుగారితో కలసి రాజ ధనాగారమునకు కన్నము వేసి అక్కడ యున్నవి నాలుగురత్నాలు వాళ్ళు వేసుకొన్నా వాటాప్రకారము 3 తీసుకొనివచ్చి ఒక దానిని విడచి వెళ్ళిరి. కారణం అది వాటా విడిపోవదు కనుక. దానిలో పోట్లాట వచ్చును. పోలీసులు పట్టుకొందురుయని వదలివేసిరి. వారిద్దరి ఒడంబడిక ఏమనగా లోనికి వెళ్ళినవానికి 2 వాటాలు బయటయున్న వానికి 1 వాటా. తానులోనికి వెళ్ళినవాడు కనుక తనకు రెండు బయటయున్న వానికి 1 ఇచ్చి వెళ్ళిపోయెను. తర్వాత రాజుగారి

ధనాగారములో దొంగలు పడెనని అందరికి తెలిసినది. ధనాగార యజమాని వెళ్ళి రత్నముల పెట్టెచూచి అందులో నాల్గుకు 3 లేవు 1 యున్నది అది దొంగ వదిలిపెట్టి పోయినాడంటే ఎవ్వరూ నమ్మరని దాచిసి తన జేబులో వేసుకొని రాజుగారితో నాలుగు రత్నములు పోయినవని చెప్పగా రాజుగారు ఆ దొంగనురప్పించి వానిని రాత్రి సంగతి అడుగగా వాడు తాను తీసుకొన్నది 3 రత్నములే అని, ఒకటి అక్కడే యుండినదని చెప్పగా ఆ ఉద్యోగిని తనిఖీ చేయగా అయనవద్ద ఒకటి దొరకడము. దానితో ఆ ఉద్యోగికి జైలుశిక్ష వేసి దొంగకు ఆ ఉద్యోగము యిప్పించెను. సత్యము యొక్క సంగతి చూచితిరా! దొంగ ఉద్యోగి అయిపోయెను. అపుడు దొంగ గురువుగారిని తలచుకొని సంతోషించెను. రాజుగారియొక్క విశ్వాసమును సంపాదించుకొనెను. బ్రహ్మచర్యము వలన శరీరబలము బాగా యుండును బ్రహ్మము బహుసూక్ష్మమైన వస్తువు బలహీన మనస్సు బ్రహ్మమును ధ్యానించి దర్శింపజాలరు. కనుకనే బ్రహ్మచర్యమును చెప్పరి. అంటే శరీరబలం, మనోబలం యుండును. "అపరిగ్రహం" ఇతరులనుంచి ఏమియు తీసుకొనరాదు. బ్రహ్మచారి 'భవతి భిక్షాం దేహి' యని అడుగవలెను. సన్యాసి అయినచో "నారాయణహరి" యని అడుగవలెను. బ్రహ్మచారులు సన్యాసులు భిక్షాన్నమును భుజింపవలెను. ఐతే వీరు భోజనము అడుగుచున్నారుగా అంటే వీరు పక్వాన్న స్వాములు. వీరు వచ్చినచో వీరికి భిక్ష పెట్టకుండ గృహస్తు భుజించినచో ఆ పాపము చాంద్రాయణ వ్రతము చేసిననే పోవును. శరీరము నిలబడుటకు కావలసిన వాటిని అనగా యింత అన్నము, యింత వస్త్రము, ఒక కుటీరము యుంటేచాలు. ఇంత మాత్రం పరిగ్రహించుటలో దోషము లేదు. అలా తానుమాత్రము తపస్సుచేసి తరించిన చాలు అనుకొనేవారికి అదిచాలు. అలాగాక లోకోపకారం కొరకు చేసే కార్య

ములున్నవారు. అంటే పూర్వము లోకోపకార కార్యముల రాజులు చేసేవారు. అపుడు బ్రాహ్మణేతరులు స్త్రీలు, వేదము భగవద్గీతాదులు చదవరాదనే రోజులు. శ్రీ గురు దేవులు శ్రీ సద్గురు మలయాళ స్వాములు పాఠశాలను పెట్టి పోషించుట. వారు స్వయముగ సంస్కృత, అధ్యాత్మిక సాధనలు చేయువారికి సదుపాయముల కొరకు ఆశ్రయము ఏర్పాటు చేసిరి. కనుక యివి అన్ని జరగుట కొరకు పరిగ్రహించవలెనని నిర్ణయించిరి. తిరుపతిలో లక్ష్మిగిరి అనే అబ్బాయిని సంస్కృతము చదువులలో గొప్పమేధావంతడగుటచే వానికి విషమును ఇచ్చి చంపినందున శ్రీ గురు దేవుల అలా కాదని శ్రీ వ్యాసాశ్రమము ఏర్పడిన తర్వాత స్వయముగా సంస్కృత పాఠశాలను ఏర్పరచి స్త్రీలు, పురుషులు, బ్రాహ్మణేరులు ఏజాతి వారైన సరే సంస్కృతము చదువుకొనవచ్చును పాఠశాలను ఏర్పరచిరి. అవి అన్ని నడుచుటకై ఎవరు ఏమి ఇచ్చి తీసుకొనేది. తనకు మాత్రం ఎంత కావలెనో అంత ఉపయోగించుకొని, మిగతా అంతా ఆశ్రమ పోషణకు వినియోగ పరచెడివారు

31 సూ॥ జాతి, దేశ, కాల, సమయానవచ్ఛిన్నాః సార్వ
భౌమా మహావ్రతం

బ్రాహ్మణాది జాతి పుణ్యతీర్థములు చతుర్థశ్యాదులు గ కాలము చేతగాని పరిచ్ఛిన్నము కానిది మహావ్రతము. బ్రాహ్మణులను మాత్రము చంపను అనేది బ్రాహ్మణులయందు మాత్రమ అహింసయున్నది. తక్కిన వారియందు హింసయున్నది. కనుక యి మహావ్రతము కాజాలదు. అలాగే కొందరు పుణ్యప్రదేశములల హింసచేయననియు, పుణ్యకాలములలో అంటే చతుర్థశి, సంక్రాం మొదలగు పుణ్యకాలములలో చంపనని కొందరు యుందురు. ఇ మహావ్రతము కాజాలదు. అలాగాక దేశ కాల జాత్యాది భేదవ లేక ఎప్పుడూ ఎక్కడా నేను దేనిని చంపననియున్న వ్రత

అహింసా మహావ్రత మనబడును. ఏ జాతినిగాని ఏ పుణ్యతీర్థము గాని, ఏ పుణ్యదినముగాని, ఎవరికొరకుగాని, చంపవనేది అహింసా మహావ్రతము. అలాగే సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము విషయములన్నిటిలోను ఏ జాతిని గురించిగాని ఏ ప్రదేశమందుగాని, ఏ రోజునగాని, ఎవరిని గురించిగాని అసత్యము చెప్పవనేది సత్యమును గురించిన మహావ్రతమగును. అలాగే తక్కిన మూడున్నూ కూడ గ్రహించుకొనవలెను. ఇది యమ మును గురించి చెప్పినది.

32 సూ॥ శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వర ప్రణి
ధానాని నియమాః॥

శౌచము సంతోషము తపస్సు స్వాధ్యాయము ఈశ్వర ప్రణిధానము ఇవి నియమములు. శుచియుండవలెను. అంటే ఉండే చోటు, కట్టేబట్ట, ఈ శరీరమును స్నానాదుల వలన శుభ్రముగా ఉంచుట చదివే పుస్తకము శుభ్రముగా ఉండవలెను. పాత్ర శుభ్రముగా ఉంచుకొనవలెను. బట్టలు శుభ్రముగా యుండవలెను. అంటే వెలగల వస్త్రములనిగాదు. మాసిపోయినవి, చినిగిపోయినవి కాకూడదని భావము. ఇవి అన్నియు శుభ్రముగా ఉంచుకొనవలెను. వచ్చే 40వ సూత్రములో శౌచాదులను గురించి చెప్పియున్నది. ఆ శౌచాదులైనా మితముగా నుండవలెనుగాని అతిగా యుండరాదు. అంటే ఒక అమ్మగారికి అతిశుచి ఎక్కువైనా. ఒక్క మెతుకు కనిపించినచో ఇల్లు అంతయు కడిగించెడిదట, కడకు ఆమె చనిపోవునప్పుడు మెతుకు, మెతుకు అంటూ చనిపోయినదట!

శౌచము రెండురకములు అది బాహ్యము, అంతర్యము. అని, జలము చేత, మట్టిచేత, బాహ్యశుచి, అంతఃకరణశుచి అంటే కామ క్రోధాదులను నిర్మూలించుట.

2) సంతోషమనగా కోరికలు లేకపోవడమే అనగా చేయ

దగినపని చేయుచూ దొరికిన దానితో తృప్తి పొందుటవలన మనస్సు శాంతిగా యుండి యోగము కుదురును.

3) తపస్సు అంటే శరీరమును తపింప జేయుట అనగా శాస్త్రములో చెప్పినట్లు కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతాయణాదులు చేయుట ఉత్తమ తపస్సని తాపసులు తెలిపిరి.

4) స్వాధ్యాయము అనగా వాక్కు తపస్సు అనగా గాయత్రీ మంత్రముగాని వేదములను శాస్త్రములను చదవడము, వేదాంత గ్రంధములు చదువుట ప్రణవ మంత్రాదులను జపించుట ఇది స్వాధ్యాయము.

5) ఈశ్వర ప్రణిధానమనగా శాస్త్రమునందు చేయమని చెప్పినవి కొన్ని, శాస్త్రములు చెప్పకపోయినను పారంపర్యముగా చేసేవికొన్ని. వీటినన్నిటిని ఈశ్వరార్పణ బుద్ధితో చేయుటయే. నాకు విధి అని ఫలమును ఆశించకూడదు. కర్తృత్వాహంకారము ఉండకూడదు. ఈశ్వరుని శరణు వేడుకోవడమే ఈశ్వర ప్రణిధానము. అందువలన సమాధికి సాధన భూతమగును.

10-8-1974 కృష్ణాష్టమి శనివారము.

33 సూ॥ వితర్క బాధనే ప్రతిపక్ష భావనం॥

అహింసకు విరుద్ధమైనది. హింస. సత్యమునకు విరుద్ధము అసత్యము. అట్లే అస్తేయము, బ్రహ్మచర్యము. అపరిగ్రహము అనుయమము అనగా స్తేయము. బ్రహ్మచర్యము లేకపోవడము, పరిగ్రహము ఇవి విరుద్ధమైనవి. అట్లే శౌచము, సంతోషము, తపస్సు స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము సరిగాయుంటే నియమము, వీటికి విరుద్ధముగాయున్నచో నియమము తప్పినట్లే ఎప్పుడైనా హింస చేయవలెనని బుద్ధి కలిగినచో అప్పుడు హింస వలన వచ్చే దోషమును, అహింసవలన వచ్చే ఫలమును బాగా విచారించి వితర్క భావములైన యమనియమాదులను బాగా

భావించవలెను అందువలన విరుద్ధభావములను తొలగించుకొనవలెను.

34 సూ॥ వితర్కా హింసాదయః కృత కారితానుమోదితా లోభక్రోధ మోహా పూర్వకా మృదు మధ్యాధిమాత్రా దుఃఖా జ్ఞానానంత ఫలా ఇతి ప్రతిపక్ష భావనమ్॥

యోగాంగములు అహింసాదులు, వాటికి విరుద్ధమైన హింసాదులు వితర్కములు, కృత అంటే స్వయముగా హింస చేయుట, ఇతరులను ప్రోత్సహించి చేయించడము, ఇతరులు హింస చేయుచున్నచో చూచి ఆమోదించుట అని హింస మూడురకములుగా జరుగును.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః।
పుణ్యకార్యే పాపకార్యే చత్వారస్సమ భాగినః॥

చేయుట చేయించుట ప్రేరేపించుట, ఆమోదించుట అనువావిలో లోభము చేత చేయుట, చేయించుట, ఆమోదించుట, మోహము చేత చేయవలసినది తెలియక తాను చేయుటగాని యితరుల చేత చేయించుటగాని ఇతరులను ప్రేరణ చేయుటగాని చూచి సంతోషించుటగాని చేయును. హింసకూడ మృదు, మధ్య తీవ్రములుగాయుండును. అధికముగా చేసినచో అధిక దుఃఖము కొద్దిగా చేసినచో కొద్ది దుఃఖము అనుభవించడము జరుగును. "ఋణం కృత్వా ఘృతం పిబేత్" అని నాస్తికులనెదరు. కాని మనలో ఋణము చేసి చనిపోయినచో కుక్క అయి పుట్టిఅయినా ఆ ఋణము తీర్చవలెనని ఆస్తికులనెదరు. నాస్తికులలో మానవ జన్మ కడజన్మ కనుక ఋణము చేసి అయినా పప్పు నెయ్యి అన్నము తిను. ఈ జన్మ ఆఖరుదే, ఇక జన్మరాదని అనెదరు. ఈశరీరము భస్మమైపోవును కనుక తిరిగిరాదని నాస్తికులవాదము. చేసిన కర్మము బ్రహ్మదేవునికైనా తప్పదు. మొదట బ్రహ్మదేవుడు

పంచముఖుడు అయి ఉండి అమ్మవారిని చూచినందున ఈశ్వరుడు ఒక శిరస్సును త్రుంచివేసినందున చతుర్ముఖబ్రహ్మ అయినాడు. ప్రతివారు దోషములకు గురికాకుండా చూచుకొనడము ముఖ్యము. ఆపైని మంచి గుణములను పెంచుకొంటూపోవలెను. జన్మమునకు కారణము కర్మమే కనుక చేసిన కర్మములను జాగ్రత్తగా చేయవలెను. అంటే దుష్ట కర్మలు మాని మంచి కర్మలు చేయవలెను. కర్మలు జడము కనుక కర్మలు ఫలమును ఇవ్వజాలవు. ఆ కర్మలకు ఈశ్వరుడు సాక్షి కనుక ఆ ఫలము ఈశ్వరుడు ఇచ్చునని వేదాంతుల అభిప్రాయము. కర్మను జీవుడు చేయును. ఫలమును ఈశ్వరుడు యిచ్చును. కొందరు ధనవంతులుగను, కొందరు ధనహీనులుగను, కొందరు ఆరోగ్యవంతులుగను, కొందరు అనారోగ్యవంతులుగను, ఉన్నారంటే ఈశ్వరుడు పక్షపాతముతో అలా చేయలేదు. జీవుడు చేసిన కర్మప్రకారమే ఆయా కష్టసుఖములు వచ్చునని వేదాంతము చెప్పును లారీయున్నది అది జడము. లారీ యజమానిది సామాను మాటలుకూడ యజమానివే అయినా లారీ వెళ్ళి సామాను తీసికొని రాలేదు జడము కనుక, కాని డ్రైవరు ఉన్నచో ఎక్కడకు వెళ్ళాలో అక్కడకు వెళ్ళి తన సామాను తెచ్చుకొనగలడు. ఆ డ్రైవరు ఎలా అవసరమో ఆ దే ఈశ్వరుడు చేసేది. అంటే కర్మఫలదాత ఈశ్వరుడు, నీవు చెడ్డ కర్మచేసినచో చెడు జన్మ, మంచి కర్మ చేసినచో మంచి జన్మయు, జ్ఞానమును అనుసరించినచో మోక్షము కలుగును. కనుక ఏదియైనను నీ చేతిలోనేయున్నది. తనకున్న దానిని దుర్గుణములవల్ల పోగొట్టుకొనును, మంచి గుణములవలన సంపాదించుకొనవచ్చును.

ఇదివరలో చేసిన కర్మలవల్ల దుఃఖము కలుగును. యిప్పుడు కూడ అజ్ఞానమువలన చెడ్డ కర్మలు చేసినచో ముందుకూడ దుఃఖములు కలుగును. కనుక ఇప్పుడు జాగ్రత్తపడవలెను. జ్ఞానము వల్లనే మోక్షము కలుగును

## 13-8-1974 మంగళవారము

35 సూ॥ అహింసా ప్రతిష్ఠాయాంతత్సన్నిధౌ వైరత్యాగః॥

యమాదులు అయిదులో అహింస మొదటిది. అహింస దృఢముగా సిద్ధించినచో ఆయన సన్నిధిలో పరస్పరము విరోధము గల మృగములు స్నేహ భావముతో మెలగును. ఎవని సన్నిధిని విరోధము కల జంతువులు స్నేహముతో యున్నవో అక్కడ అవశ్యముగా అహింసావ్రతము ఉన్నదని గ్రహించుకొనవచ్చును. దీనికి దృష్టాంతము వాల్మీకి ముందుగా బాటసారుల తలలు బ్రద్దలుకొట్టి మూటలను లాగుకొనేవాడు అట్టివాడు అహింసావ్రతమును అవలంభించి తపస్వి అయ్యెను. అగస్త్యుడు తపస్సు చేయుటకు అరణ్యములో నివశించేవాడు ఖరదూషణాదులు తపస్సు చేసే మునులను చంపి తిన్నందున అట్టి వారి ఎముకలు పర్వతాలు పర్వతాలుగా పడియుండుట రాముడు చూచెను అగస్త్యుని ఆశ్రమమునకు మాత్రము రాక్షసులు ఏమియు అపకారము చేయలేకపోయిరి. అగస్త్యుని ఆశ్రమ ఆవరణలోనికి ఎట్టి క్రూరమృగములు వచ్చినను అవి స్నేహముతో యుండెడివి. సింహము ఏనుగు పులి మేక, మొదలైన జంతువులన్నియు ఆ ఆవరణలోనికి వచ్చినచో స్నేహముగా యుండేవి. ఆ ఆశ్రమములో అబద్ధమాడువారే లేరు. కపటం లేదు, అక్కడ మనుష్యులు ఘాతము చేయువారు అక్కడ లేరు. యితర మృగములను చంపి పాపమును సంపాదించుకొనెడివారు అచట లేరు. అగస్త్యుని ఆశ్రమములో ఏవిధమైన దోషములు లేవు. ఆ ఆశ్రమ ఆవరణలోనికి రాక్షసులు వచ్చినను ఆ క్రూరబుద్ధిని మరచిపోయెదరు, తిరిగి ఆ ఆవరణ దాటిన తరువాత మరల క్రూరత్వము కలిగెడిది. యిప్పుడు శృంగేరీ మఠముగల స్థలము అనగా శారదా మఠము కట్టుటకు ముందు శ్రీ శంకరాచార్యులవారు. కప్ప ప్రసవించుచుండగా త్రాచుపాము ఆ కప్పకు ఎండ తగులకుండా పడగ

పట్టినది చూచి అక్కడ మఠము కట్టిరి. దానికి శారదామఠమని పేరు పెట్టిరి. సత్యమును బాగా అనుష్ఠించినచో క్రియలు అంటే పుణ్య పాప ఫలమును గురించి ఏమి పలికిన అది అగును.

36 సూ॥ సత్యప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వమ్ ।

సత్యమును 12 సం॥ బాగా అనుష్ఠించినచో ఆయన ఏది పలికిన అది అగును. నీవు ధర్మాత్ముడవు అగుమనిన అగును. విద్యావంతుడవగుమంటే అగును. అనగా ఆయన నోటివెంటనుంచి గాని చెడ్డగాని ఏది ఏలావచ్చిన అలా జరుగును.

37 సూ॥ అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్ ।

స్తేయమంటే దొంగతనము. అస్తేయమంటే దొంగతనము లేకపోవుట. అస్తేయమును 12 సం॥లు అనుష్ఠించినచో దివ్యరత్నములు దివ్యపదార్థములు ఆయనవద్దకువచ్చి చేరుచుండును.

38 సూ॥ బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః ।

బ్రహ్మచర్యమును అనుష్ఠించినచో వీర్యమును నిరోధించినట్లగును. వీరికి గొప్ప సామర్థ్యము కలుగును. అంటే అతిసూక్ష్మమైన పరబ్రహ్మ వస్తువును తెలిసికొనవలెనంటే బ్రహ్మచర్యమును అవలంభించినచో మనస్సుకు మనస్సుకు బలము చేకూరి దృఢముగా ధ్యానించగలుగును, ఆత్మజ్ఞానమును సంపాదించ దలచినవారు బ్రహ్మచర్యమును చక్కగా అనుష్ఠించినచో శరీరమునకు మనస్సునకున్నూ బలమువచ్చి అతిసూక్ష్మమైన ఆత్మధ్యానము చేయుశక్తి గలుగును.

39 సూ॥ అపరిగ్రహస్థైర్యే జన్మకథన్తా సంబోధః ।

పూర్వ జన్మమునందు ఎట్లు ఉండెనో ఏమేమి తాను చేసెనో అవి అన్నియు బాగా తెలియును. అంటే పూర్వజన్మ రాబోవుజన్మ బాగా తెలియును, యమము బాగా శీలించినవారికి పైని చెప్పిన ఫలములు సిద్ధించును, పైని చెప్పిన అయిదు సూత్రములలో గల ఫలము సిద్ధించును ఇది యమసిద్ధి.

**40 సూ: శౌచాత్ స్వాంగ జుగుప్సా పరైరసంసర్గః ॥**

ఇక నియమములయొక్క అంగములను చెప్పుచున్నారు. శౌచమనగా యోగి బాగా శుచికలిగి యుండవలెను. శుచివలన తన అవయవములయందు జుగుప్స కలుగును. శుచి అంటే మట్టి నీళ్ళతో బాహ్యశుద్ధి - కామక్రోధాదులు లేకపోవుట అంతర్యశుద్ధి. ఇట్టి రెండు శుద్ధులను సంపాదించవలెను. కన్నుపుసి, చెవిగుబిలి, నోరు ఎంగిలి, మలమూత్రాదులతో కూడిన తన అవయవముల యందు అసహ్యము కలుగును. స్వభావముగా ఈ శరీరము అశుద్ధమైనది నవరంధ్రములు అసహ్యకరమైనవి. రోమకూపముల ద్వారా చెమట వెలువడుచుండును. పుట్టినది మొదలు చచ్చేవరకు రోజుకు ఎన్నియో సాకాలు ఈ శరీరమును శుద్ధము చేయుచునే యుండవలెను. "నవచ్ఛిద్ర ఘటా" కఠోపనిషత్తులో పదకొండు ద్వారములని అన్నారు. మన శరీరమంతయు రంధ్రములతో కూడినదే. క్రొత్తకుండలో నీరు పైకి స్రవించినట్లు ఈ శరీరమునుండి కంపుపైకి వెళ్ళుచునే యుండును. బాహ్యశుదియే యిలాయుండగా అంతర శుచి ఎట్లుసాధ్యము? తన శరీరమునందు యింత జుగుప్స కలిగిన పురుషు ఇతర శరీరములను గురించి ఏమి ఊహించును? కనుక యితరులతో సంసర్గము పెట్టుకొనడు. తన శరీరమునందు ఏవగింపు కలుగకపోయినచో యిక వైరాగ్యము కలుగునది ఎట్లు? తన అవయవముల యందే వైరాగ్యము కలుగనివానికి యిక లోకములో వైరాగ్యము కలిగించెడిది ఏదియు లేదు. ఇది బాహ్యశుదినిగురించి తెలిపిన విషయము, అంతర శౌచముయొక్క ప్రయోజనమును చెప్పుచున్నారు.

**41 సూ॥ సత్వ శుద్ధిసౌ మనస్యైకాగ్ర్యేంద్రియ జయాత్మ దర్శన యోగ్యత్వానిచ ॥**

రాగద్వేషాది మాలిన్య నివృత్తి. ఇది అంతఃకరణకు సంబంధించిన మాలిన్యము లేకుండా పోయినచో బుద్ధియొక్క శుద్ధి

అనగా అసూయాదులు లేకుండా పోవుట యితరులయొక్క గుణములయందు దోషములను ఆరోపణ చేయువాడు అసూయాపరుడు. ఎంత మంచిపని చేసినను వానియందు దోషములను ఎంచుచుండుట. లోకమంతయు దిద్దవలెనంటే ఒకేసారి ఎవరికీ సాధ్యము కాదు. దేవుడు రాముడై వచ్చి అందరినీ దిద్దగలిగినాడా, కృష్ణుడు కూడా దేవుడే. అందరినీ దిద్దినాడా! లేదు. కొంతమందిని దిద్ది దిద్దడానికి వీలు కాని రావణాదులను సంహరించెను. కంసునియొక్క చాకలిని వ్రేలితో ఇట్లంటే తల తెగి చచ్చెను. మాలికారుడైన సుదాముని యింటికి వెళ్ళగా ఆ పూలమాలలు యివ్వగా వానిని అనుగ్రహించెను. కుబ్జ యిచ్చిన గంధము బాగా రాసుకున్నాడు; అంటే భక్తిశ్రద్ధలుగల వారిని అనుగ్రహించెను. వ్యతిరేకులను దండించినాడు శ్రీకృష్ణ పరమాత్మ.

వ్యవసాయదారులు పైరు పెట్టిన తర్వాత కలుపును తీసివేసెదరు. అప్పుడు పైరు బాగా పెరుగును. అలాగే మనస్సు అను భూమిలో రాగద్వేషాదులనే కలుపు తీసివేసినచో శమదమాది సద్గుణములను పైరు అభివృద్ధి పొందును. సౌమనస్యము అనగా మంచి మనస్సు కలుగుట అంటే లక్ష్యమునందు ఏకాగ్రము కలుగును. బాహ్యేంద్రియ జయము వల్ల ఆత్మదర్శన యోగ్యత కలుగును.

సత్త్వశుద్ధి మొదలగునవి లేనిచో ఆత్మదర్శనము కలుగదు. కనుక ఆత్మదర్శనము కావలసినచో బాహ్యశౌచములను సంపాదించుకొనవలెను. అవి సత్త్వశుద్ధి సౌమనస్యము, ఏకాగ్రత, ఇంద్రియ జయము కలిగినచో ఆత్మసాక్షాత్కార యోగ్యత కలుగును.

14-8-1974 బుధవారము

42 సూ॥ సంతోషాదనుత్తమః సుఖలాభః॥

సంతోషమువలన ఉత్తమోత్తమ సుఖము లభించును. సత్త్వగుణము ఉద్రిక్తమైనపుడే సంతోషము కలుగును. రజోగుణ

తమోగుణములు ఎక్కువగా యున్నచో సంతోషము కలుగను. శబ్ద స్పర్శాదుల వలన కలిగే సుఖము అట్టి సంతోషవంతునకు విషమువలె కనుపించునదికూడ చెప్పుచున్నారు. సంతోషమును అమృతమును త్రాగి తృప్తిపొందిన వారికి అత్యంతమైన భోగలక్ష్మి కూడ విషము వలె తోచును. ఇదే రెండవ ప్రయోజనము. రెండవటిది ఉత్తమోత్తమ సుఖము.

43 సూ॥ కాయేంద్రియ సిద్ధిరశుద్ధిక్షయాత్తపసః॥

తపస్సు వలన శరీర ఇంద్రియాదులశుద్ధి కలుగును. అంటే తపస్సు వలన అశుద్ధి నశించినందువలన శుద్ధి కలిగినది. తపస్సు అంటే కృచ్ఛ్రాచాంద్రాయణాదులు. దానితో యోగమునుకూడ శీలించుచుండును. కాయేంద్రియశుద్ధి అంటే అణిమాది సిద్ధులు కలుగును. అవి అవిద్యాది పంచక్లేశములు పాపములు అన్నియూ నశించినందున యోగమహిమ వలన ఈ శరీరము అణువుమాదిరి చిన్నదిగా చేసికొనవచ్చును లేదా పెద్దశరీరమును చేసికొనవచ్చును. ఇంద్రియములకు మంచి సూక్ష్మబుద్ధి కలుగును. ఎంత చిన్నమాటనైనను వినగలుగును. చాలాదూరములో యున్న విషయములను కూడ గ్రహించగలుగును.

44 సూ॥ స్వాధ్యాయాదిష్ట దేవతా సంప్రయోగః॥

స్వాధ్యాయమంటే దివ్యమంత్ర జపమని యిక్కడ చెప్పబడి యున్నది. ఆ జపమును ఎక్కువగా చేయవలెను. జపము చేసినా ఇష్ట దేవతాదర్శనము లభించును. ధ్యానము కష్టము, ధ్యానము కంటే జపము సులభము, దివ్యమంత్రజపము చేయువారు బ్రాహ్మణ కోటికి చెందినవారే. జపము చేసినవారు "మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" అనగా ఇతర జీవులతో స్నేహముకలిగి మెలగగలిగే సామర్థ్యముకూడ వచ్చును. సాధకులు జపమును బాగా చేసినచో కొన్ని సిద్ధులు కలుగును. విషయ రహితమైన మనస్సునను ధ్యాన

మని అంటారు. అంటే ఇతర విషయములు ఏమియూ లేకుండ లక్ష్యమాత్రముగా మనస్సు ఉండవలెను. అందుకే "ధ్యానం నిర్విషయం మనః" అన్నారు. ఊరకనే ఉండుట మంత్రము జపించుట కాదు. అది దేవతా భావన పూర్వకముగా జపము చేసినచో గొప్పఫలము త్వరగా లభించును. యితరమైన వాటిని తగ్గించుకొని జపధ్యానాదులను బాగాభివృద్ధి చేసికొనవలెను.

శ్లో॥ పూజాకోటి సమం స్తోత్రం స్తోత్రకోటి సమోజపః
జపకోటి సమంధ్యానం ధ్యానకోటి సమోలయః

తా॥ కోట్లాది పూజలు చేసినందువలన ఎట్టి ఫలము కలుగునో అట్టి ఫలము స్తోత్రమువలన కలుగును. కోటి స్తోత్రములతో ఒక జపము సమమగును. కోటి జపములతో సమానమైనది. ఒక ధ్యానము, మనోలయము కోటి సంఖ్యలు కల ధ్యానమునకు సమానమగును. లయమనగా ఏకత్వము. ధ్యానమనగా ధ్యాత, ధ్యానము, ధ్యేయము, అని త్రిపుటి యుండును. లయావస్థలో అది లేదు. ఏకత్వము మాత్రమేయుండును. ముసలివారైన తర్వాత సంసారచింతలు ఎక్కువగును యిప్పుడు ముసలివారైనవారు యిపుడైనా వారి వారికి వొప్పజెప్పి ప్రారంభించుకోవలెను. భూత ప్రతిబంధములో నేదెను గురించి చెప్పిరి. గదా అలా ఉంటుంది శ్రద్ధ ముఖ్యముగా నుండవలెను. ముఖ్యముగా నుందుగా దివ్య మంత్ర జపమును చేయండి అపుడు మంత్రార్థమైన పరమాత్మను భావములో నిలుపుకోవలెను కొన్ని వేలు జపము చేయువరకు కూర్చున్న ఆసనమునుండి లేవనని గట్టి పట్టుదలయున్నచో కొద్ది రోజులకు ఆ మనస్సు వశమగును. అలాగే ఆసనము వేసికొని కూర్చున్న తరువాత అది మార్చకూడదు. నొప్పివచ్చినాసరేకద పట్టయున్నచో కొద్దిరోజులలోనే ఆ ఆసనసిద్ధి కలుగును. సాధుత్వము అంటే భోజనమునకు దక్షిణలకు అయితే ఏలాగూ సాధుత్వము అలా దక్షిణలు అందుకొనుట ఊరక సేవచ్చేది కాదు,

ఇదివరలో మనకే కావలసినంతయున్నది. మరల దక్షి ణలు. అందుకొనుటలో వారికికూడ కొంతవచ్చును. ఇది బాగా సాధువులు గ్రహించుకొనవలెను. యిచ్చేది పుణ్యము రావలెనని, కదా యిచ్చేదరు పాపము పోయిన గదా పుణ్యము వచ్చేది ఆ పాప మును దానము తీసుకొన్నవారికివచ్చును. ఆశ్రమమునకు వచ్చిన తర్వాత బాగుపడవలెనుగాని పాడైపోకాడు. రాగద్వేషాదులు నశించిననే పాపముపోయిననే బాగుపడెదరు. దానము నీకు ఎంత అవసరమో అంత తీసుకొని ముందుకుపోతూ యుండమని మహార్షులు మనకు తెలిపియున్నారు. మనస్సు ఊరకనే ఉండదు. కనుక జప మును బాగా చేయుండి. మనస్సును ఎటు త్రిప్పినా అటు తిరుగును కనుక ఎక్కువగా మనకాలమును జపధ్యానాదులలో గడుపు లాగున ప్రయత్నించండి స్తోత్రాదులు. చేయుచున్నను మనస్సును అంతర్ముఖముగా యుండునట్లు అభ్యాసము చేయవలెను. ధ్యానము చేయునపుడు ఏకాగ్రతగా యుండుటకాదు ఎల్లపుడూ మనస్సును అంతర్ముఖమునకు త్రిప్పుటకై ప్రయత్నించవలెను.

**15-8-1974** గురువారము

45 సూ॥ సమాధి సిద్ధి రీశ్వర ప్రణిదానాత్॥

భా॥ ఈశ్వర ప్రణిధానములవలన సమాధి సిద్ధించును. అంటే ఈశ్వరునకు శరీరము ఇంద్రియములు బాక్కు సర్వస్వము నీవే అని ధ్యానము చేసినచో సమాధి సిద్ధించును. ధ్యానము రొక్క పరిపక్వావస్థయే సమాధి ధ్యాన సమయములో యితరము ఏమియు ఉండరాదు. ఒక్క ఈశ్వరభావము ఆత్మభావమే యుండ వలెను యిక్కడకు యమనియమామనే అష్టాంగములు తెలిపెను.

46 సూ॥ స్థిరసుఖమాసనమ్॥

భా॥ స్థిరమైనది సుఖమైనదిగాను యుండవలెను ఆసనము. అవి పద్మాసనం స్వస్తికాసనమని కొన్ని ఆసనములను అభ్యసించ

వలెను. స్వస్తికాసనమనగా తొడలమధ్యలో పాదములనుంచుట, వీరాసనమన్న పద్మాసనమన్నా ఒకటే. పద్మాసనమునకు వేళ్ళు పట్టుకొనేది వీరాసనము. అర్ధపద్మాసనముగాని ఇవి కొన్ని నేర్చుకొనియుండవలెను. దేహము కదలకుండా నిశ్చలముగా యుండవలెను. ఆసనములో యుండగా శరీరములో ఎక్కడా బాధకలుగ రాదు. కనీసము 3 గంటలైనా ఒకే ఆసనము మీాద కూర్చోవడము అభ్యాసము చేసుకోవలెను. ఆసనమువల్ల స్థిరత్వము నిశ్చలత్వము కలుగును.

47 సూ॥ ప్రయత్నశైథిల్యానంత సమాపత్తిభ్యామ్॥

భా॥ మనశరీరములోగల చేష్టలను సిథిల పరచవలెను. అంటే అటు యిటు పోవుట మొదలగునవి అరికట్టవలెను. అంటే మానసికమైన చేష్టలను అరికట్టవలెను. అప్పుడు చక్కగా కూర్చొ గలుగును. ప్రయత్నము లేకపోతే ఉత్సాహమువల్ల కూర్చున్నను వానిని లేవదీసివేయును. అనంత సమాపత్తి అనగా శేషుడు వేయి పడగలతో భూమిని మోయుచున్నాడని అందురుగా! కనుక ఆ శేషునివలె స్థిరముగా యుండవలెను శేషుడు కదిలితే మనమంతా ఏమైపోవలెను? కనుక ఆది శేషుడే నేను అని భావన చేస్తే కదలకుండా స్థిరముగా కూర్చొగలుగును. నిశ్చలత్వము లభించును. ఈ అభ్యాసమువల్ల ఆసనము స్థిరముగాను సుఖముగాను యుండును. అనంతునివలె కదలరాదు. దోమలు ఈగలు తోలుకొనకూడదు.

48 సూ॥ తతో ద్వంద్వానభిఘాతః॥

భా:- ఆ విధముగా సిద్ధించిన ఆసనమువల్ల సీతోష్ణాదులు సుఖదుఃఖాదులు, మానావమానములు వానిని బాధించవు. అభ్యాసమువల్ల స్థిరముగా ధ్యానములో కూర్చొనగలడు క్రమముగా సమాధి సిద్ధించును. యోగాంగములు 8 వీటిలో 3 చెప్పెను 4 వది ప్రాణాయామమును చెప్పుచున్నారు.

49 సూ॥ తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతి విచ్ఛేదః
ప్రాణాయామః॥

భా॥ ఆసనము చక్కగా సిద్ధించిన తరువాత ప్రాణాయామము చేయుటకు వీలుకలుగును. పద్మాసనము నేర్చుకొనుట చాలా మంచిది. లేదా అర్థపద్మాసనము అనగా కుడిపాదము ఎడమమోకాలుమీద ఎడమపాదము కుడి మోకాలు క్రింద ఉంచుట. ఇదియైనా కనీసము నేర్చుకోవలెను. శ్వాస ప్రశ్వాసలను ప్రాణాయామము అంటారు. రేచక, పూరక, కుంభకముతో నియమించుట ప్రాణాయామమందురు. కుంభకములు రెండురకములు, ఒకటి బాహ్య కుంభకము, రెండు అంతరకుంభకమని అంటే రేచక పూర్వక, కుంభకములని దానినే ప్రాణాయామమని అందురు. కుండలో పోసిననీరు బయటకు పోజాలనట్లు వాయువును లోపల నేయుంచును. కనుక దీనిని కుంభకమని అన్నారు. యమనియమాదులు బాగా సంపాదించి ఆసన సిద్ధిని పొందిననే ప్రాణాయామమునకు యోగ్యత కలుగును.

16-8-1974 శుక్రవారము

50 సూ॥ బాహ్యాభ్యంతర స్తంభవృత్తిర్దేశ కాల సంఖ్యాభిః
పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః॥

బాహ్యవృత్తి అంటే రేచకము. అభ్యంతరవృత్తి అంటే పూరకము స్తంభవృత్తి అంటే కుంభకం. ఇది దేశ కాల సంఖ్యలచే పరీక్షింపబడినదై అంటే అభ్యాసముగుండా విభజింపబడినదై దీర్ఘము, సూక్ష్మము అగును. బయటకు వదులుట రేచకము. దీని పరీక్ష హృదయప్రదేశమునుండి బయలుదేరిన ప్రాణము ముక్కుపుటముల ద్వారా బయటకువచ్చును. అది 12 అంగుళముల దూరము వెళ్ళును. అది తెలిసికొనుట 12 అంగుళముల దూరములో దూదిని కొంచము ప్రేలాడగట్టి శ్వాసించినచో ఆ దూదికదలినచో అంత

దూరము వెళ్ళినట్లు గ్రహించవలెను. యిలా కొంత కాలము అభ్యాసము చేయుగా, చేయగా కొన్నాళ్ళకు హృదయము కాకుండా నాభి నుండి ఆ ప్రాణవాయువు బయలు దేరునని తెలియును. అప్పుడు 24 అంగుళముల దూరము వెళ్ళును. అప్పుడు దూదిని 24 అంగుళముల దూరములో పెట్టి కదలినది లేనిది పరీక్షించుకోవలెను. యింకా కొన్నాళ్ళకు మూలాధారమునుండి వచ్చుచున్నట్లు భావించవలెను. ఇది 36 అంగుళముల దూరము వరకు వెళ్ళును. అప్పుడు 36 అంగుళముల దూరములో దూదిని కట్టి కదిలేది, లేనిది పరీక్షించుకోవలెను, బయటకు వదిలేటప్పుడు అధిక ప్రయత్నమువల్ల నాభి వద్ద ఒకవిధమైన కదలిక కదులును. దానివల్ల తెలుసుకోవచ్చును అట్లే మూలాధారము నుండి వచ్చునపుడు అక్కడ క్షోభకలుగును దానివలన అక్కడనుండి వాయువు వచ్చుచున్నదని గ్రహించుకోవ వచ్చును. ఈ పరీక్ష ఎముకుగా దూదిని కట్టి పరీక్షించుకోవలెను. ఇది దేశపరీక్ష.

కాలపరీక్ష అనగా మొట్టమొదట కొద్దిరోజులు 10 మాత్రల కాలము గాలి వదలుతూయుండి, యింకా కొన్నాళ్ళకు 20 మాత్రలు, ఇంకా కొన్నాళ్ళకు 30 మాత్రల కాలము ఈ లాగున సంఖ్యాపరీక్ష మొదటి నెలలో 10 సార్లు రేచకము చేయువలెను. 2 వ నెలలో 20 సార్లు. 3 వ నెలలో 30 సార్లుచేయుట ఇది సంఖ్యాపరీక్ష. ఇవి మూడు రేచక ప్రాణాయామమునకు సంబంధించినవి. ఇదే ప్రకారము పూరక కుంభకము అనగా పూరించేది 10మాత్రలు ఐతే హృదయము వరకు పోయినట్లు, 20 మాత్రలు ఐతే నాభి వరకున్నూ, 30 మాత్రలు అయితే మూలాధారము వరకు పోయినట్లుయని తెలుసుకొనేది. ఇంత దేశములో బాహ్య అంతర కుంభకమని ఎట్లు తెలిసికొనవలెననగా అది బాగా తెలియదు. దానిని గురించి ఏది ఒక నెలలో 10 మాత్రలు, 2 వ నెలలో 20 మాత్రలు

3 వ నెలలో 30 మాత్రలు యిలా చేసుకుంటూపోతే కాలము, సంఖ్యకూడ కుంభకములో తెలియును. దీర్ఘ సూక్ష్మమగును. అంటే గట్టిగాయున్న దూదిని లాగినచో పొడవుగా వచ్చును. దూది ఒక అంగుళము యున్నప్పుడు లావుగాయుండును. పొడవైన కొలది సన్నబడును అలాగే ప్రాణాయామము కూడ 12-24-36-మాత్రల వరకు పెంచుకొంటూ పోతే అదే దీర్ఘ సూక్ష్మమగును.

51 సూ॥ బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః॥

భా :— 4 వ రకం ప్రాణాయామమంటే బాహ్యము. అంటే రేచకము తరువాత కుంభకము. అభ్యంతరము అంటే పూరకము మరల అట్లే కుంబకము. అంటే రేచకానంతరం కుంభకం పూరకానంతరం కుంభకం అగును. రేచించకను పూరించకను వదలివేసి అంటే రేచించేది, పూరించేది లేకుండాయున్నది. కేవల కుంభకం, బాహ్య విషయాపేక్ష రేచకము. అభ్యంతర విషయాపేక్ష కలది అంతర కుంభకం. ఈ రెండింటిని ఆక్షేపించక కుంభించేది కేవల కుంభకం. రేచించకను పూరింపకను కేవలము కుంభకం చేసినచో యిది కేవల కుంభకమగును. ఇది నాలుగవది అంటే 1) రేచకము, 2) పూరకము, 3) కుంభకము, 4) కేవల కుంభకము. ఇది ఎవరు చేయాలంటే నిద్రవచ్చేవారు. తంద్ర అంటే అది పూర్తిగా నిద్రకాదు. ఏమీ తెలియదు. మత్తుగా యుంటుంది. తమోగుణము బాగా విజృంభించినపుడు గాఢనిద్ర. రజోగుణము బాగావిజృంభించినచో జాగ్రత్త, సత్త్వము అంటే స్వప్నము. తంద్ర అయితే కూచొనియుంటాడు కాని లోకము తెలియదు. ఏదోకొంత ఆనందముగాయుండును, ఇక్కడసాధకులు పొరపాటుపడుదురు. ఇదే తనకు సిద్ధికలిగినదని అందురు. ఇది సమాధి అవస్థ అనుకొనిమాకు సాక్షాత్కారము కలిగినదని కూడ చెప్పెదరు. కాని అది సమాధి కాదుకదా-సమాధికి విఘ్నమని అన్నారు. సమాధిలో చిత్తము

కేవలము సత్వములోయుండును. అప్పుడు స్వస్వరూపజ్ఞానము విస్ఫుటముగా యుండును. ఏ సాధకునకు నిద్ర, తంద్ర, శరీరము, బరువు ఏమీతోచక పోవుట కూర్చొనవలెనను ఉత్సాహము లేక పోవుట అనునవి ఉన్నవో, ఆ సాధకులు రేచక పూరక కుంభక ప్రాణాయామము బాగా అభ్యసించినచో ఈ దోషములు అన్నియు పోవును. అంతఃకరణ శుద్ధమగును. అప్పుడు కేవల కుంభకములో త్వరలో సమాధి సిద్ధించును. నిద్ర, తంద్ర, విక్షేపాదులు పోయిన వారికి కేవల కుంభకము మిక్కిలి సహకరించును. ఇంతవరకు ప్రాణాయామము యొక్క సామాన్య విశేషములను చెప్పి ఫలమును చెప్పుచున్నాము.

52 సూ॥ తతః క్షీయతే ప్రకాశావరణమ్॥

భా:- ఆప్రకారము ప్రాణాయామము చేయుటవల్ల జ్ఞానమును ఆవరించియున్నది నశించిపోవును. అంటే అజ్ఞానరూపమైన తమస్సు నశించిపోవును. ఆత్మ అంతటా ప్రకాశించుచున్ననూ తెలిసికొనలేక దేహేంద్రియాదులు నేను యని అజ్ఞానమువల్ల తమస్సువల్ల తెలుసుకొనలేకపోవుచున్నాము. ప్రాణాయామము వలన ఆ చైతన్యమును స్వస్వరూపమును ఆవరించిన అజ్ఞానము నశించడమే ప్రాణాయామము

53 సూ॥ ధారణాసుచ యోగ్యతా మనసః॥

భా:- ప్రాణమునకు మనస్సునకు సంబంధము యున్నది. ప్రాణము ఆగితే మనస్సు ఆగును. కనుక యోగి రేచక, పూరక, కుంభక రూపముగా ప్రాణమును అదుపులో పెట్టుకొనెదరు. అప్పుడు మనస్సును అదుపు చేసుకుంటారు. జ్ఞానులు. ఆత్మ అంటే ఏమి అనాత్మ స్వరూపము ఏమి అని బాగా విచారణచేసి అనాత్మ అసత్తు దుఃఖము, జడము, ద్వైతము, అనియు ఆత్మ సత్తు, చిత్తు, ఆనందము, అద్వైతము, అని తెలిసికొని జ్ఞానులు. ఈ విధముగా

ఆత్మవిచారణ చేయుదురు. అంటే అనాత్మ దుఃఖము ఆత్మసుఖము అనాత్మ అసత్తు, ఆత్మసత్తు గనుక నేను ఆత్మను స్వీకరించినచో దుఃఖములు తొలగును. దుఃఖము వద్దు అనుకొనుటచే దానియందు విరక్తి కలుగును. ఆత్మసుఖము గనుక ఆత్మయందు రక్తి కలిగి మనస్సును అడుగును. అలా అడుగగా మనస్సు సిగ్గుపడి అప్పుడు ఆగిపోవును. కేవల సిద్ధస్థితికి పోవలెనంటే ఏదో అట్లు కూర్చొని యిట్లు లేచిపోతే రాదు. అప్పుడు మనస్సు ప్రాణము, ఆగిపోవలెను అపుడు నిర్వికల్ప సమాధి లభించును. స్వస్వరూప సాక్షాత్కారము లభించును. జ్ఞానులు యిట్టి విచారణవలన మనస్సును ఆపి ప్రాణమును నిలిపెదరు. వేదాంతులకు విచారణవలన అన్నీ తెలిసిన మనస్సు. ఆగకపోయినచో అప్పుడు మనోమదము అణగలేదన్నమాట అప్పుడు ప్రాణాయామము తప్పక చేయవలసినదే, ప్రాణాయామము చేసినచో అంతఃకరణదోషములు పోవును. అలా విచారణ చేసినను మనస్సు నిలువకపోవుటకు కారణము అంతఃకరణ యింకా పరిశుద్ధము కాలేదన్నమాట. పరిశుద్ధమగుటకు ప్రాణాయామము చేయవలెను. అపరోక్షానుభూతిలో ఆత్మను తెలిసికొని దానియందు మనస్సు నిలుచుటకు పంచదశ యోగాంగములను చెప్పబడియున్నవి, అలా అయిన చాంచల్యము నశించకపోయినచో అపుడు యోగము చేయుమని చెప్పెను. మనవారిలో చాలా మందికి అన్ని తత్త్వములూ బాగా తెలిసియుండును గాని కుదరలేదు. అంటే అప్పుడు ప్రాణాయామము, పుణ్యకర్మలు ఈశ్వరుని యందు భక్తి బాగా అభ్యసించవలెను. మనుష్య శరీరము అను ఓడను గొప్ప పుణ్యమను ధనముతో తెచ్చుకొన్నాము. అన్నీ తెలియును గాని అనుభూతి మాత్రము యుండదు.

శ్లో॥ "అనుభూతిం వినామూఢో వృథా బ్రహ్మణి మోదతే
ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్"

తా॥ అనుభవము కలుగువరకు అనుష్ఠానము చేయని మూఢుడు కేవలము సన్యాసము చేసంతోషించుట వ్యర్థమే యగును. అది ఎట్టిదన జలాశయ తీరమునగల వృక్షాగ్రమునగల పండ్లు నీటిలో ప్రతిబించుచుండినవి చూచి వాటిని భుజించి ఆనందించి నట్లుండును. లేక నీటిలోగల ప్రతిబింబ ఫలములను చూచి ఆ జలములో మునిగి వాటిని పట్టుకొని భుజించుటకు యత్నించునట్లు వ్యర్థ ప్రయత్నమే యగును.

ఆవరణపోతే ప్రకృతి పురుష వివేకము కలుగును. ఇదే యోగము.

54 సూ॥ స్వవిషయా సంప్రయోగే చిత్తస్యస్వరూపాను కార
ఇవేంద్రియాణాం ప్రత్యాహారః॥

శబ్ద స్పర్శాదులు 5 వీటినే విషయములని అందురు. శ్రోత్రమునకు శబ్ద విషయము, త్వగింద్రియమునకు స్పర్శము విషయము, నేత్రమునకు రూపము విషయము, తెలుపు నలుపు వగైరాలు గ్రహించును. జిహ్వకు రసము విషయము. పులుపు, తీపు మొదలగునవి. గంధము ఘ్రాణేంద్రియమునకు విషయము దుర్వాసన, సువాసనాదులు. యింద్రియములు. విషయములతో సంబంధము లేనివి అగుటచే అప్పుడు చిత్తమునకు ఏస్వరూపమున్నదో ఆస్వరూపమునే అనుసరించినట్లుండును. ఇదే ప్రత్యాహారము.

చిత్తమునకు ఒక విషయముండును, చిత్తము అవిషయాకారముగా యుండును, అపుడు ఇంద్రియములు ఆయా గోళకములో యుండును. కనుక ఆసమయములో ఇంద్రియములు విషయముల మీదకు పోవడమే లేదు. కనుక చిత్తము ఉన్నా లక్ష్యము మీదనే ఇంద్రియములు ఉన్నవానివలెయుండును. ఇంద్రియములు ఆయా విషయములను స్పృశించును. అప్పుడు మనస్సు వెళ్ళి ఆ విషయాకారమును పొందును. అంటే గ్రహించును. ఇంద్రియములతో కూడ

మనస్సు వెళ్ళినపుడు ఆ విషయమును మనస్సు గ్రహించును. ఒక్కొక్కపుడు మన దగ్గరనుంచి ఏ ఎవరైనా వెళ్ళినా మనము గ్రహించలేము అంటే, అప్పుడు, మనస్సు, నేత్రముతో కలియలేదన్నమాట నేత్రము ఒక్కటే విషయమున్న చోటికి వెళ్ళి గ్రహించును. మిగత నాలుగు యింద్రియములు వాటివాటి విషయములను తమ దగ్గరకు వచ్చిననే గ్రహించగలవు ఇతర విషయముల మీదకు యింద్రియములు పోవడము లేదు కనుక చిత్తరూపమైనట్లు ఉండును. అంటే చిత్తరూపమును పొందలేదు.

55 సూ॥ తతః పరమావశ్య తేంద్రియాణాం॥

ఈ రీతిగా ప్రత్యాహారము సిద్ధించుటవలన ఇంద్రియాలు పరమవశ్యములై యుండును. ఇంద్రియములు మిక్కిలివశమైయుండును. ఇదే ప్రత్యాహారము మనస్సు ఒక దానిని పట్టుకొన్నది. యింద్రియములుకూడ దానిని పట్టుకొన్నవానివలెయుండును. ఇపుడు మనస్సు మాత్రము లక్ష్యమందుండును, చంచలమగు ఇంద్రియములు నిశ్చలముగాయుండడమే వశ్యమై ఉండుట అందురు. ఇదే ప్రత్యాహారము.

రెండవ పాదము సమాప్తము

మొదటి పాదములో సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధులను చెప్పెను. ఇది యోగపాదము, అభ్యాసవైరాగ్యముల చేతసమాధి సిద్ధించును. పంచక్లేశములవలన సమాధి సిద్ధించకపోయినచో అభ్యాసవైరాగ్యాదులవలన పొందవలెను. ఇది ఎవరికి చెప్పెనంటే మనస్సు యింద్రియములు స్వాధీనము చేసుకొన్నవారికి మొదటి పాదములో యోగమును సాధించగలరని చెప్పెను. వీరు ఉత్తమాధికారులు ఇక మధ్యమాధికారుల కొరకు క్రియాయోగము చెప్పెను. అంటే తపస్సు స్వాధ్యాయము ఈశ్వర ప్రణిధానము వీటివలన క్రమముగా యోగమును సాధించుకొనవచ్చునని ద్వితీయ

పాదములో తెలిపెను. ఇక అధమాధికారుల గతి ఎట్లు అంటే క్రియా యోగమునుకూడ చేయక ఇంద్రియములు పోయినట్లు తాను కూడపోయి ఇంద్రియారాములైనవారు ఏదో ఒకసారి ఇట్టి ప్రసంగము విని తానుకూడ బాగుపడవలెననే అభిప్రాయముతో అష్టాంగ యోగములను అభ్యసించును. యోగమనగా చిత్తవృత్తి నిరోధము. సమాధిని సిద్ధించవలెనంటే మొదటిపాదములోని యోగమును సాధించవలెను. వీరు ఉత్తములు.

మధ్యములు క్రియా యోగమును, అధములు అష్టాంగ యోగములు, అభ్యసించినచో బాగా అనుష్ఠించినచో మనస్సు బాగా వశమై సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధులను పొందవచ్చును అని పతంజలి మహర్షి మహోదయతో తెలిపెను.

ఇక మూడవ పాదములో అష్టాంగ యోగములను గురించి రెండవ పాదములో అయిదు యోగములను చెప్పి మిగిలిన మూడు యోగములు ఆచరించినగా కొన్ని సిద్ధులువచ్చును. ఆ సిద్ధులు మొదలగునవి కలుగు విధానము చెప్పెదరు. పండ్లు, విభూతి ఫోటోలు రావడము గొప్పసిద్ధిగాదు. యిక్కడ యుండి ఇప్పుడు కాశిలో ఏమిజరుగుచున్నదో చెప్పేది గొప్పసిద్ధి అగును. ఆ మూడూ కలిపి సంయమం అంటారు. దానినే విభూతి పాదమని అన్నారు. అంటే ఐశ్వర్యము అన్న అర్థము ఉన్నది. రెండవ పాదము సాధన పాదమని అన్నారు. అంటే ఇందులో క్రియా యోగమును, అష్టాంగ యోగమును చెప్పెను. మొదటి పాదములో యోగమే చెప్పెను. కనుక యోగపాదమని అన్నారు. యోగమును చక్కగా ఆచరించినవారికి ఇంద్రియములు మనస్సు ఎట్లు చెప్పిన అట్లు వినును.

శ్లో॥ యోగిహీనం కథంజ్ఞానం మోక్షదం భవతి ధ్రువం।
తస్మాజ్ఞానం చ యోగంచ ముముక్షుర్దృఢ మభ్యసేత్॥

భా:- మోక్షదాయకమైన జ్ఞానము యోగములేక సిద్ధించుటకు ప్రయాసము. ఆ కారణముచే ముముక్షువైనవాడు యోగమును, జ్ఞానమును నిశ్చయముగా అభ్యసింపవలెను.

వేదాంతపద్ధతిలో నిష్కామకర్మవల్ల చిత్తశుద్ధియు, 'ఉపాసనవలన ఏకాగ్రత కలుగును, అప్పుడు గురువులవద్ద శ్రవణము చేయుటవల్ల ఆవరణపోయి స్వస్వరూప స్థితి కలుగును. ఇంద్రియ సంయమము లేకపోతే చిత్త ఏకాగ్రత కలుగదు. కనుక జ్ఞానము యొక్క అంగమైన యోగము కలిగితే త్వరగా జ్ఞానము కలుగుతుంది. శ్రీ విద్యానందస్వాముల వారు ఒకసారి పుట్టపర్తికి వెళ్ళి అచట భవనములు కట్టుచున్నందున నిలువబడి చూచుచుండగా శ్రీ సత్యసాయిబాబాగారు దగ్గరకువచ్చి తట్టలుతో మట్టిరాళ్ళు మోయుచున్న వీరందరు లక్షాధికారులు, మంచి శ్రీమంతులు వీరికి ఒక్కసారిగా జ్ఞానోపదేశము చేసినచో పట్టుబడదు. అందువలన కొన్ని సిద్ధులను చూపించి మార్గములో పడిన తరువాత అసలు విషయమునకు వచ్చెదము. కాని ఈ సిద్ధులన్నియు బూటకములే అని శ్రీ సత్యసాయిబాబాగారు స్వయముగా చెప్పిరి.

మనకు సుఖము, శాంతి, కావలెనంటే జ్ఞానము కావలెను. యోగమువల్ల ఇంద్రియములు వశమగును. అపుడు జ్ఞానము శీఘ్రముగా కలుగును. మోక్షమునిచ్చే జ్ఞానము కావలెను. యోగము శీలించి ఏదో సిద్ధిని సంపాదించిన దుఃఖముపోదు. అప్పుడు జ్ఞానము సంపాదించుకొనవలెను.

ఆగ్రా పట్టణములో ఒకప్రక్క అణిమాద్యష్ట సిద్ధులుగల యోగియుండెను. యింకొకప్రక్క గొప్ప ఆత్మజ్ఞాని యుండెను. యోగి అందరికి కోర్టు వ్యవహారములు, రోగములు మొదలైనవి చెప్పుటచే గొప్పగొప్ప వారు శిష్యులుగా యుండేవారు. వారికి గొప్పరథము చేయించి సంవత్సరమునకు ఒకసారి ఆ రథములో

కూర్చుండబెట్టి, ఉత్సవము చేసేవారు. మంచి పట్టు బట్టలు, మంచి భోజనము, అన్ని మంచిమంచివిగా యుండేవి. జ్ఞానికి అట్టివి ఏమీ లేవు. ఆయన (జ్ఞాని) ఎట్లు యున్నాడని యోగి తెలుసుకొంటూయుండి ఆయనకు ఏమీ ఆడంబరము లేదా. సరి నేనే గొప్ప అనుకున్నాడు. కొంత కాలమునకు గొప్ప యోగదర్శకుడు ఆ పట్టణములో ప్రదర్శని ఇస్తాడని ప్రకటించగా అది చూచి ఆ యోగి తనకంటే గొప్పవాడో ఏమో తన్ను జయించునేమో యని భయము కలిగి భయపడి పోయినాడు. జ్ఞాని ఎప్పుడూ ఉత్సాహంగాయుంటాడని శిష్యులు చెప్పగా అప్పుడు యోగి అనుకున్నాడు గదా! నా కంటే ఆయనలో ఏదో గొప్పది ఒకటియున్నది. దానిని నేను తెలుసుకొనవలెనని అపుడు తాను ఆయనవద్దకు వెళ్ళాలి కదా. అలా తాను వెళ్ళితే తన శిష్యులంతా తనను తక్కువ వాడని అనుకుంటారని సందేహముతో అలా కొంత కాలము జరిగిన తర్వాత ఒకరోజు రాత్రి 11గం॥ల పైని యోగి జ్ఞాని వద్దకు వెళ్ళెను యోగియొక్క గొప్పతనము తనశిష్యులు కూడ జ్ఞానికి చెప్పేవారు. ఆయన రాగానే మంచిమర్యాదగా మాట్లాడి ఒక చాప వేసి కూర్చుండబెట్టి యోగిని మీరు ఎంతో గొప్పవారని. ఆ జ్ఞాని అనగా అపుడు ఆ యోగి మాట్లాడలేక వెళ్ళిపోయి. మరల కొన్ని రోజుల తర్వాత వచ్చి ఇక తాను తెలుసుకోవలసినది తెలుసుకొనే విధానము లేదని తలంచియు మరల యింకొక్కసారి వచ్చి జ్ఞాని కాళ్ళ మీదపడి నమస్కారము చేసినాడు. జ్ఞాని ఆయనను గౌరవించి నందున అప్పుడుకూడ ఏమియు చెప్పలేక వెళ్ళిపోయి మరల వచ్చి నపుడు నాకు మీవద్ద తెలిసికొనవలెనని యున్నదని చెప్పగా అదేమి, మీరు గొప్పవారని అనుటచే మరల వెళ్ళిపోతూ ఈలాగున చాలాసార్లు జరిగిన తర్వాత ఒకరోజు, సరే ఆ చెప్పేడిది ఏమని అడిగి, నన్ను నీ శిష్యునిగా స్వీకరించి ఆ భయము తొలగే విధానము చెప్పుమనగా "తద్విద్ధి ప్రణిపాతేన" యని చెప్పి నిర

హంకారికి జ్ఞానము కలుగును. కాని అహంకారికి కలుగదని చెప్పెను. అంటే అహంకారికి జ్ఞానము కలుగదు. కనుక సేవ చేయాలని చెప్పెను. చేస్తానన్నాడు - అలాగే చేస్తున్నాడు. ఊళ్ళో శిష్యులు ఆయోగ్యి మీరు కావడమేమిటని గోలచేయగా మాట్లాడక కూడదు గనుక ఏమియు చెప్పువాడు కాదు. అలా మూడు నెలలు పరీక్ష చేసిన తర్వాత ఒకరోజున జ్ఞానము బోధించి హస్తమస్తక సంయోగము చేసి 'తత్వమసి' మహావాక్యమును శీలించగా చక్కగా దానికి పట్టుబడి నిర్వికల్ప సమాధికి పోయినాడు. నేను గొప్పయోగినని యున్న అహంకారమంతా 3 నెలలు నిరహంకారముతో సేవ భిక్షాటన చేయుటతో అహంకారము పోయెను, ఇది జరిగిన విషయము.

## విభూతి పాదం:

18-8-1974 ఆదివారము

1 సూ॥ దేశ బంధశ్చిత్తస్య ధారణా ॥

భా॥ ప్రస్తుతము ధారణ, ధ్యానము, సమాధి అనే దానిని సంయమ సాధన అంటారు. ముందుగా ధారణను గురించి చెప్పాచున్నారు. మూలాధారము మణిపూరము మొ॥ షడాధారములయందు ఉంచుట ఏదో అది ధారణ యోగి దృష్టిలో మూలాధారము మొదలు బాటయందు చిత్తమును ఉంచుట, ధారణయగును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములతో కూడుకొన్న మనస్సు బాగా సంస్కరింపబడినది. ఆ మనస్సును. ఆయా ఆధారములయందు ఉంచుట ధారణ యగును.

సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం॥

భా॥ ఇక ధ్యానము పూర్వము చెప్పిన ఆధారములయందు ఎడతెరిపి లేకుండ చిత్తవృత్తిని నిలుపుట, గురుపులు పదేశించిన లక్ష్యసంబంధమైన చిత్తవృత్తి, సజాతీయ. ప్రత్యయ ప్రవాహము

అనగా లక్ష్యమునకు సంబంధించిన ధ్యానము. ప్రత్యయము అంటే జ్ఞానము. జ్ఞానము క్షణికము. ప్రవాహము అనగా ఒకటి పుట్టి నశించుచు మరల యింకొక జ్ఞానమును పుట్టించి యుండుది నశించును. అంటే మధ్యలో యితర సంకల్పములు రాకుండ యుండేది. ప్రత్యయమని అనిపించుకొంటుంది. మధ్యలో శబ్దాది విషయములమీదకు చిత్తముపోతే ధ్యానము తెగిపోయినదన్నమాట. తైలధారవలె ధ్యానము యుండవలెను. ధ్యానము యొక్క పరిపక్వావస్థనే సమాధి అన్నారు ధ్యానము చేయగా చేయగా పక్వదశలో పడినచో ఒకే విషయమునకు సంబంధించిన ప్రత్యయ ప్రవాహమే సమాధి అన్నారు. ఆ ధ్యానము మధ్య మధ్యలో తెగిపోవును. అంటే ధ్యానము చేయుచూ చేయుచూ మరచిపోయి కొంతసేపటికి అయ్యోయని మరల ధ్యానములో సాధకులు నిలుపుకొందురు. అలా చేయగా చేయగా పక్వదశలో పడును. అపుడు మనస్సు అటూయిటూ పోక ఏకదిశగా యుండును. అపుడు సమాధి లభించును.

3 సూ॥ తదేవార్థమాత్రా నిర్భాసం స్వరూప శూన్యమివసమాధిః॥

భా॥:- ఆ ధ్యానమే అర్థమాత్ర అనగా ధ్యేయమైన వస్తువే మధ్యలో శబ్దాదివస్తువులు స్ఫురించకుండా తన్మాత్రగా భాసించుచున్నచో ధ్యానముయొక్క స్వరూపము శూన్యమువలె యుండుటయే సమాధి. ధ్యాన సమయములో కొంతసేపు లక్ష్యములో యుండి మరల ఎక్కడికో పోవడము, రావడము. జరిగేవి ధ్యానము ఆ ధ్యానము చిరకాలము అభ్యసించుటవల్ల ఆ లక్ష్యము, ఏకాగ్రతగా నిలచుటవల్ల ఇక ధ్యానము నశించినట్లే యుండును. అదే సమాధి. అప్పుడు చిరకాలము అనగా ఎంతసేపు కూర్చున్నా లక్ష్యమునుండి మనస్సు చెదరకుండా యుండును. అదియే సమాధి అంటారు. అహంకారము లేకుండా అహంబ్రహ్మాస్మి అను మనో

వృత్తి ఎడతెగిపి లేకుండా యుండుటయే సమాధి. అంగి, అంగము. అంగము, ధ్యానము చిరకాలము ధ్యానము చేస్తే అంగీ అనగా సమాధి కలుగును. అంటే ధ్యానము అంగము, సమాధి అంగి ఐనది ధ్యానము నకు సమాధికి ఎంతో తేడా లేదు. ధ్యానములో మధ్యమధ్య తెగి పోయిన మనస్సు ఎక్కడికో పోవును మరల వచ్చును. మరల పోవును ఇది ధ్యానము. కాని సమాధిలో మధ్య మధ్యలో తెగ కుండ యుంటుంది. అదే సమాధి. ఇంకొక పద్ధతి సవికల్పము, నిర్వి కల్పము అంటారు. ధ్యానమునకు సమాధికి ఎక్కువ వ్యత్యాసము లేదు ధ్యానము అంటే ధ్యాతృ, ధ్యాన, ధ్యేయములుండును.

సమాధి యందున్నను ఒక్క ధ్యేయము మాత్రమే భాసిం చును. ఇంతమాత్రమే ధ్యానమునకు సమాధికి భేదము. అపర వైరాగ్యముతో చిరకాలము అనుష్టించుటచేత రజస్తమో గుణ ములు నశించును. అప్పుడు సంప్రజ్ఞాత సమాధి లభించును. అ సంప్రజ్ఞాత సమాధికి, సంప్రజ్ఞాత సమాధి చాలదు. పరవైరాగ్యము సాధనమగును.

## విభూతి పాదః

4 సూ॥ త్రయమేకత్రసంయమః ।

భా॥ :- రెండవ పాదములో చెప్పబడ్డ యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములు బాగా అనుష్టించినచో అత్వాత ధారణ, ధ్యాన, సమాధులు అనుష్టించవలెను. ధారణ, ధ్యాన, సమాధులు, మూటికి ఒకపేరు పెట్టుచున్నారు. అది సంయమము అను పేరుతో యుంటుంది. ఈ మూటికి విషయము ఒకటిగానే యుంటుంది కనుక సంయమమని పేరు పెట్టిరి.

5 సూ॥ తజ్జయాత్ప్రజ్ఞా లోకః ।

భా॥ ;- సంయమమును చిరకాలము అనుష్టించుట వలన సమాధి ప్రజ్ఞ కలుగును. యోగాంగములను చక్కగా అనుష్టించినచో సం

ప్రజ్ఞాత సమాధి లభించును. అదికూడ చిర కాలము అనుష్ఠించుటచేత పరవైరాగ్యము కలిగి, సంప్రజ్ఞాత సమాధి బాగా వృద్ధియైనచో ఋతంభర ప్రజ్ఞా అనగా సత్యమైన ప్రజ్ఞ కలుగునని తాత్పర్యము.

6 సూ॥ తస్య భూమిషు వినియోగః ॥

భా॥:- సంప్రజ్ఞాత సమాధి అనుష్ఠించు సమయములో సవితర్కం నిర్వితర్కం, సవిచారం, నిర్విచారం అను ఇటువంటి అవస్థలు, అనుష్ఠించి పూర్ణత్వమును పొందినచో అప్పుడు సంప్రజ్ఞాత సమాధి పూర్ణముగా లభించి ఋతుంభర ప్రజ్ఞ లభించును.

7 సూ॥ త్రయమంతరంగం పూర్వేభ్యః॥

భా॥ ముందు చెప్పిన యమ, నియమాదులకంటె ధారణా, ధ్యాన సమాధులు అంతరంగమైనవి. సంప్రజ్ఞాత సమాధికి యమాదులు అయిదు బహిరంగ సాధనలు. ధారణాదులు మూడు అంతరంగ సాధనలు అగును. బహిరంగములుకూడా సమాధికి దూరముగాయుండి, ఉపకారమగును. అంతరంగము అంటే, దగ్గరగా యుండి యుపకారమగును. లక్ష్యమును భేదించుటకు ధనస్సు బాణము యున్ననే లక్ష్యమును భేదించగలదు. అయితే ధనస్సు దూరముగాయుండి లక్ష్యభేదముకు ఉపకరించునది. బాణము గ్రుచ్చుకొని దగ్గరగా ఉపయోగించునట్లు యమనుగ్రహించుకోవలయును. యమాదులు అయిదు, బాగా అనుష్ఠించినవారికే ధారణ, ధ్యాన, సమాధులను అనుష్ఠించు, యోగ్యత కలుగును. యమాదులచే సంస్కరింపబడిన మనస్సునకు ధారణాత్రయము సులభముగా పట్టుబడును. ఈ అంతరంగసాధనవల్ల సమాధి లభించును.

8 సూ॥ తదపి బహిరంగం నిర్బీజస్య॥

భా॥ ఈ త్రయము అనగా సంయమా అనగా ధారణ, ధ్యాన సమాధులు ఇవి సంప్రజ్ఞాత సమాధికి అంతరంగ సాధనలు. ఐతే అసంప్రజ్ఞాత సమాధి అనగా నిర్బీజ సమాధికి బహిరంగ సాధనమే

అగును. ధారణ, ధ్యాన, సమాధులు పరవైరాగ్యముచే, నిరోధింపబడినవే అసంప్రజ్ఞాత సమాధి కలుగును. అసంప్రజ్ఞాతసమాధికి ధారణ, ధ్యాన, సమాధులు బహిరంగసాధనములుపరవైరాగ్యము మాత్రమే అంతరంగ సాధనమగును.

20-8-79 మంగళవారం

9 సూ॥ వ్యుత్థాన నిరోధ సంస్కార యోరభి భవ ప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయో నిరోధ పరిణామః॥

భా॥ సంస్కారములు రెండురకములు, అందులో ఒకటి శబ్దాది విషయ సంస్కారములు. ఇది వ్యుత్థాన సంస్కారము. ఇవి యుంటే సమాధి కలుగదు. రెండవది నిరోధ సంస్కారము అంటే అట్టి శబ్దాదిసంస్కారములనునిరోధించుటయే. శబ్దాది సంస్కారము తిరస్కరింపబడవలెను. నిరోధ సంస్కారము కలిగింది,కనుకనిరోధ సంస్కారము చిత్తమునకు ఎక్కువగా కలుగవలెను. ఇదే నిర్బీజ సమాధి. ఇదేఅసంప్రజ్ఞాతసమాధి నిరోధసంస్కారములు బాగాకలుగుటయే అసంప్రజ్ఞాతసమాధి.పురుషుడంటే చిత్తశక్తి ఒక్కటితప్ప ప్రతిక్షణం, చిత్తమునకు సంబంధించిన సంస్కారములు మారుచునే యుండును. చిత్తము యొక్క భావములు ఎల్లప్పుడు పరిణామము పొందుచుండుటచే. పరిణామమే చెప్పవలెను. చంచల చిత్తము నిరోధించినచో చిత్తముకూడ మారవలెనంటే అప్పుడు చిత్తము ఏలాగునఉండుననిన,నిరోధసంస్కారము వలన ప్రశాంతప్రవాహము వలె నుండును. అంటే ప్రశాంతమైన భావ ప్రవాహము యుండును. సమిధలు, నేయి అగ్నిలో వేసినచో అగ్నిజ్వలించును. ఎక్కువ వేస్తే ఎక్కువ జ్వలించునట్లు సమిధలు వేయుట ఆపివేసినచో అజ్వాల క్రమముగా తగ్గి తగ్గి క్షయించి పోవును. అలాగే చిత్త వృత్తులను నిరోధించినచో మొదట కొద్దిగా శాంతి కలుగును. క్రమముగా, ఆ శాంతి వృద్ధిని పొందుచూ పోవును.

10 సూ॥ తస్య ప్రశాంత వాహితా సంస్కారాత్ ॥

భా॥ ప్రశాంతమైన సంస్కారములవలన క్రమముగా ప్రశాంతత వృద్ధి పొందును. ఇంతవరకు అసంప్రజ్ఞాత సమాధి చిత్తవృత్తుల నిరోధమువలన కలుగునని చెప్పబడినది.

11 సూ॥ సర్వార్థతై కాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః॥

భా:- ఇప్పుడు సంప్రజ్ఞాత సమాధినిగురించి చెప్పుచున్నారు. సర్వార్థత, ఏకాగ్రత, క్షయము, ఉదయము చిత్తము అన్నిటి మీదకి పోవడము సర్వార్థత. అలాకాక ఏకాగ్రతగా ఒకే విషయము మీద యుండుట ఏకాగ్రత చిత్తమునకు సర్వార్థత యొక్క క్షయము ఏకాగ్రతయొక్క ఉదయము కలుగును. అప్పుడు సంప్రజ్ఞాత సమాధి కలిగినట్లు ఈ సంప్రజ్ఞాత సమాధిని అభ్యసంచుచు పోగా, పోగా సర్వార్థత నశించి ఏకాగ్రత కలిగి నిర్బీజసమాధి కలుగును. అప్పుడు చిత్తము ప్రశాంత ప్రవాహమువలెయుండును. సంప్రజ్ఞాత సమాధిలో చిత్తము అనేకము మీదకుపోక ఒకే లక్ష్యము మీద నుండును. అంటే పురుషుని యందు ఏకాగ్రత అసంప్రజ్ఞాత సమాధిలో ఆ ఏకాగ్రత అనగా పురుషుని మీద కూడా లక్ష్యము ఉండక ప్రశాంత ప్రవాహముగా యుండును. రజోగుణము యున్నచో చంచలముగాయుండును. ఆ రజోగుణము నశింపజేయుటకై యోగి ఏదో ఒక లక్ష్యమునందు మనస్సు నిలిపి రజోగుణ సంబంధమైన చంచలమునునశింపజేయును. ఏకాగ్రత కలిగినచో చిత్తము అనేక విషయములమీదకు పోవుట నశించును. కాని ఇక్కడ అనేకము మీద చిత్తములేదు, కాని పురుషుని యందు మాత్రము ఏకాగ్రత కలిగియున్నచో ఇది సంప్రజ్ఞాత సమాధి యగును. పురుషుని యందుకూడ అంటే లక్ష్యముయందు కూడ వైరాగ్యము కలిగినచో అనగా పరవైరాగ్యము కలిగినచో ప్రశాంత ప్రవాహము ఏర్పడును. అదే అసంప్రజ్ఞాత సమాధి.

12 సూ॥ తతః పునః శాంతోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః॥

భా:- అతీతము అనగా భూత కాలము, ఉదితం అంటే ఉద్భవించినది. అంటే వర్తమాన కాలము. మొట్ట మొదట సాధకుడు గురూపదిష్టమందు లక్ష్యము ఉంచును. అది ధ్యానము. అట్టి ధ్యానము ఒక్క క్షణముయుండును అది పోతూ మరల యింకొకదానిని కలిగించును. ఈ ప్రకారమే కలిగినది పోతూ, కొత్తదానిని పుట్టించు చుండును. అది క్షణ క్షణమూ మారుచున్నా ఒకే విషయమునకు సంబంధించినది కనుక ఆమార్పు మనకు తెలియదు. ముందుపుట్టి నశించిన ఏకాగ్రత భూత కాలము అగును. మరల పుట్టినది వర్తమాన కాలమగును. మరల యిది నశించును. ఈ నశించినదే మరల భూత కాలమగును. అనగా భూత కాలమునకు, వర్తమాన కాలమునకు విషయము ఒక్కటే. అదే ఏకాగ్రత కొంత సేపు ఏకాగ్రత కలిగి మరల యితర విషయముల మీదకు పోయినచో. ఏకాగ్రత పోయినది. మరల కొంత సేపు ప్రయత్నము చేసి లక్ష్యములో నిలుపుదురు. ఈ ప్రకారము ఉన్న దానిని అనైకాగ్రత అంటారు. నశించే విషయములకు, క్రొత్తగా పుట్టేవాటికి విషయము ఒక్కటే ఐతే అదే ఏకాగ్రత ప్రత్యయము అంటే శమించిన దానికి. పుట్టిన దానిని ప్రత్యయము అంటారు. ఈ రెంటింటికి ఒకే లక్ష్యము ఐనచో ఏకాగ్రత అగును. ఇది యోగుల ప్రక్రియ వేదాంతులు ధారావాహికం అంటారు. అంటే మొట్ట మొదట కలిగిన ఏకాగ్రత ఏది యున్నదో అది అలా ఎంత కాలమైనా ఉన్న దానిని ధారావాహికం అంటారు. కనుక ధ్యానము చేయువారు సాధన చేయునపుడు ధారణ పోయినచో ఏకాగ్రత అన్నారు. వారివారి లక్ష్యమునందు ఏకాగ్రత ప్రవాహము ఉన్నచో, అనైకాగ్రత ఉన్నదో బాగా గ్రహించుకొనండి. శమించిన దానికి వేరు విషయము పుట్టిన ప్రత్యయ

ముకు యింకొక్క విషయము ఉంటే ధ్యానము కుదర లేనట్లు. కనుక ఎవరికివారు బాగా చూచుకొని ప్రయత్నము చేయండి.

21-8-74 బుధవారము

13 సూ॥ ఏతేనభూతేంద్రియేషు ధర్మలక్షణా
వస్థా పరిణామా వ్యాఖ్యాతాః॥

భా॥:- చిత్తమునకు మాత్రమే పరిణామములు యున్నవని చెప్పుటచేత పంచభూతములయందు, నేత్రేంద్రియాదులయందు కూడా పరిణామము యున్నదని గ్రహించవలయును. ఎట్లన ఒక ఘటమును తీసుకొనండి. మట్టి ధర్మి, ఆ మట్టియందు అనేక ధర్మములున్నవి. అంటే మట్టి ముందుగా చూర్ణముగా యుండును. యిది యొక పరిణామము. నీరుపోసి కలిపితే పిండరూప పరిణామముగును. ఆ ముద్దను చక్రము మీద పెట్టి త్రిప్పితే ఘటరూప పరిణామము కలుగును. ముందు ఒకటిపోయి యింకొకటి పుట్టి అదీపోయి, యింకొకటి పుట్టింది. యిది ధర్మపరిణామము. మట్టి చూర్ణరూప పరిణామమును అతీత లక్షణరూప పరిణామమంటారు. దానిలో నీరుపోసి కలిపితే పిండరూపము వచ్చింది. అప్పుడు చూర్ణరూపము పోయింది. యిది అతీత పరిణామము. ఇప్పుడు పిండరూపము వచ్చింది. ఇది వర్తమాన పరిణామము. మొదట నుండే ప్రకటమైనదని అంగీకరించవలెను. అలా కాక మట్టిలో ఘటము లేదని అంటారు.

కాని విచారణచేస్తే ఘటము పుట్టకముందు మట్టిలో ఘటము అవ్యక్తాకారముగా యుండి ఘటము పుట్టిన తర్వాత వ్యక్తమైనదని అందురు. అంటే కారణము వినా కార్యము ఉండదు. అంటే కార్యము కారణమునందు ఉండే వ్యక్తమగునని అంటారు. యిసుకనుండి ఘటము పుట్టదు. ఒక రకమైన జిగురు మట్టినుండియే ఘటము పుట్టును. ఒక రాయితో వినాయక విగ్రహమును చేస్తారు. ఆ రాతిలో వినాయక విగ్రహము ఉన్నది. అయితే ఆ రాతిలో వినా

యొక విగ్రహము కానిదికూడ కొంతయున్నది. ఆ కానిదానిని శిల్పి తొలగించినచో వినాయకుడు వ్యక్తమగును. నూలునుండి ఘటము పుట్టదు మట్టినుండి నూలుపోగులు పుట్టవు. నూలుపోగులలో వస్త్రము మునుందేయున్నది. కానిసాధనవల్ల వ్యక్తమగును. అలాగే మట్టిలో ఘటము సాధనవల్లవ్యక్తమగును. చూర్ణరూప మట్టిపోయి అంటే అతీతమయిపోయి పిండత్వము వ్యక్తమగును. లక్షణము అంటే మట్టి. ఆ మట్టిలోని మార్పులే ధర్మములు. మట్టిచూర్ణముగా ధర్మములు మారును. మట్టిలో అన్ని ధర్మములుయున్నవి చూర్ణత్వ రూపము మట్టిలో నష్టమైనప్పుడు అతీత అనాగత లక్షణమగును. ముద్దయింకా పుట్టలేదు. ముందు పుట్టబోతున్నది. అనే దానిని అనాగత లక్షణ పరిణామమందురు. ముద్ద పుట్టింది దానిని వర్తమాన లక్షణ పరిణామమంటారు. మనకు మొదట, చిన్నవయస్సులో బాగా వినిపించును రానురాను కొంత కొంత తగ్గును. బాగా వృద్ధత్వమువస్తే అసలే వినిపించక పోవడమనేది చెవి ధర్మమేగాని మరియొక యింద్రియ ధర్మము కాదు, కేవలము చిత్తమునందే పరిణామము కాదు. అన్నిటియందు ఈ పరిణామము యున్నది. కారణమునందు పుట్టకముందే కార్యముండును. దీనిని సత్కార్య వాదమంటారు. దీనిని యోగులు, వేదాంతులు కూడ అంగీకరించెదరు. మట్టి ధర్మి చూర్ణము అతీతలక్షణ పరిణామము. ముద్ద అనాగత లక్షణ పరిణామము. ఘటము వర్తమాన లక్షణ పరిణామము. ఇవి ధర్మములు. అసాధారణ ధర్మములను లక్షణము అంటారు. అవస్థా పరిణామమనగా ఘటముగా పుట్టిన తర్వాత అది ప్రతిక్షణములోను నశించిపోవుచునేయుండును. మన శరీరము చూడండి. 5 సం॥ వరకు బాల్యావస్థ. 15 సం॥ పైబడి కౌమారావస్థ. 50 సం॥ వరకు యవ్వనావస్థ. ఆ పైని వార్ధక్యముగా యుండునుగదా! ఇది ఒక్కసారే మారునా? లేదు. క్రమక్రమముగా క్షణక్షణము మారుచునే యుండును. ఆ మారుచున్నది మాత్రము మనకు తెలియదు. ఇదే

అవస్థ యొక్క చిత్తమునకే కాదు. పంచభూతములకు ఇంద్రియములకు పరిణామమున్నది. చిన్నవయస్సులో అభివృద్ధిని చెంది తర్వాత శరీరము క్షీణదశకు వచ్చును. స్వప్నము అంటే చిన్న కల. జాగ్రత్త అంటే పెద్దకల. రజ్జువునందు పాము కల్పితము. అలాగే ప్రపంచము. బ్రహ్మమే బ్రహ్మయొక్క అజ్ఞానమువల్ల ప్రపంచముగా గోచరించిన కాగా విచారించినచో బ్రహ్మకు భిన్నముగా ప్రపంచము లేదు. అంతా బ్రహ్మమే. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" సుషుప్తిలో చిత్తమునకు కార్యము లేదు. కనుక హాయిగా, ఆనందముగా యుండును. జాగ్రత్ స్వప్నమునందు, కార్యములు యున్నవి కనుక శాంతిలేదు. ఆనందము లేదు. రజ్జువుయొక్క అజ్ఞానమువల్ల సర్పము కనుపించునట్లు బ్రహ్మయొక్క అజ్ఞానమువల్ల ప్రపంచము గోచరించును. కాని వాస్తవముగా ప్రపంచము లేదు. ఉన్నది బ్రహ్మమే.

22-8-1974 గురువారం.

14 సూ॥ శాంతోదితాఽవ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ॥

భా॥ :- ధర్మములు కలది దర్మి. ఆ దర్మి ఎట్టిదనిన శాంతములు అంటే గతించినవి. ఉదితములు అంటే వర్తమానము. అవ్యపదేశమంటే ఆగామి. అంటే భవిష్యత్తు. మట్టిలోయున్న ఘటమును. అవ్యపదేశమంటారు. అట్టిది కొన్ని సాధనలవలన ఘటముగా పుట్టబోవుచున్నది.

15 సూ॥ క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః॥

భా॥ :- మట్టికి చూర్ణ పరిణామము, పిండ పరిణామము, కుండ పరిణామము, కపాల పరిణామములని అనేక పరిణామములు కలుగుచున్నవి. ఇవి క్రమక్రమ పరిణామములనబడును. ఈ మూడవ పాదము సమాప్తమగువరకు ఆయా విషయములలో సంయమము చేయుటవలన కలిగే విభూతులను తెల్పబోవుచున్నారు.

16 సూ॥ పరిణామత్రయ సంయమాద తీతా నా గత జ్ఞానమ్॥

భా:- ఒక ధర్మమునందు గాని లక్షణమందు గాని అవస్థయందు గాని ఒక్కొక్క దానియందు. సంయమము చేసినచో భూత కాలము భావికాలము యొక్క జ్ఞానము కలుగును. చిత్తమునకు సత్వ, రజస్, తమో గుణములుండును. యోగము శీలించుటచే రజో గుణ తమోగుణములు నశించి సత్వము వృద్ధిపొందును. సత్వగుణమువల్ల వస్తుప్రకాశమును చేయుజ్ఞానము కలుగును. రజోగుణములో యితరులు చెప్పినా, తాను చదివినాకూడ తెలియదు. అంటే యితర విషయములమీదకు పోవుటవలన తెలియదు. తమోగుణము నిద్రవచ్చుటచే తెలియదు. యోగముశీలించినచో, రజోగుణ, తమోగుణములునశించి సత్వగుణము వృద్ధిపొంది సమస్తపదార్థములను ప్రకాశింపచేయు సామర్థ్యము కలుగును ప్రత్యక్షప్రమాణములు 6. అవి శ్రోత్రము ప్రమాణము, దానికి శబ్దము, విషయము. త్వక్కు, ప్రమాణము, స్పర్శము విషయము. చక్షుప్రమాణము, రూపము విషయము. జిహ్వాప్రమాణము రసము విషయము. ఘ్రాణము ప్రమాణము, గంధము విషయము. అవి ఐదు మనస్సు ఒకటి ఇవి ఆరు. యోగము చేత సత్వము వృద్ధిపొందినచో అప్పుడు ప్రత్యక్ష ప్రమాణ అవసరము లేకనే చిత్తమునకు స్వభావముగానే 6 ప్రమాణములను. గ్రహించు సామర్థ్యము కలుగును. మనము జపధ్యానాదులు చేయుచున్నామంటే, ఆ ఉపాసనా దైవసాక్షాత్కారము కావలెను. ఆ ఉపాసనా దైవము యొక్క ధర్మపరిణామమందును, లక్షణ పరిణామమందును, అవస్థాపరిణామమునందును. ధారణము ధ్యానము.ను సమాధి అనగా సంయమము చేస్తే ఉపాసనా దైవ సాక్షాత్కారము కలుగును. మేము ప్రతిరోజూ చేయుచున్నా సాక్షాత్కారము కాలేదంటే చిత్తములోయున్న రాజస, తామస గుణములు నష్టము కాలేదు. ఈ రాజస. తామస గుణములను

పట్టుబట్టి నశింప జేయువలెను. ధృవుడు 5 సం॥ పిల్లవాడు. ఆటవస్తువులతో ఆడుకొను వయస్సు కదా! అట్టివాడు తపస్సుకు వెళ్ళెను. వానికి నారదుడు ఎదురుపడి ఎక్కడికి వెళ్ళుచున్నావని అడుగగా తపస్సు చేయుటకు అనగా నారదుడు నగరిలో నున్న సుఖములను అనుభవించక అడవికి వెళ్ళుచున్నావు. అడవిలో అనేక క్రూర మృగములుండునని చెప్పగా దానికి ధృవుడు "ఏమయ్యా నేను తపస్సుకు వెళ్ళుచున్నాను నాకు ఏదైనా చెప్పదలచినచో చెప్పుము. లేదా నీదారిని నీవు వెళ్ళుమనగా", వెంటనే నారదుడు సంతోషించి అష్టాక్షరి మంత్రమును ఉపదేశించి యమునానదీ తీరములో తపస్సు చేయుమని చెప్పగా ఆప్రకారము చేసి 6 నెలలకు సిద్ధిని బొందెను. అనగా సామాన్య సాధకులు 12॥సం॥ చేసిపొందే స్థితిని ధృవుడు పట్టుదలతో 6 నెలలలో సంపాదించెను. ఇదిఫలించవలెనంటే "శ్రద్ధ వీర్యస్మృతి సమాధి ప్రజ్ఞా పూర్వక యితరేషాం॥"

వీర్యము అంటే పట్టుదల వీటిలో ఏది కొరతయున్నదో ఒకొక్కరు బాగా విచారణచేసి తెలిసికొని ఆకొరతను పూర్తి చేసినచో విఘ్ననివృత్తి, భగవదనుగ్రహము కలుగును. బ్రహ్మదేవుడు ఇంద్రియములను బహిర్ముఖముగా సృష్టించెను. మనము ఆప్రకారమే చేయుచున్నాము. చెవి లోపలయున్న శబ్దములను వినదు. బయటి వాటిని వినుటకే ప్రయత్నించును. కాని ఒకానొక ధీరుడు మాత్రము విలక్షణమైన ఆత్మను చూడగలుగును. బాహ్య దృష్టిగల ఇంద్రియములను ప్రయత్నముతో అంతరదృష్టి అంటే తన యిష్టమైన లక్ష్యము వైపుకు త్రిప్పుకొన్నవాళ్లే అమృతత్వమును పొందగలరు. తాను చేసే సాధన తదను గుణముగా యున్నదా. దానికి భిన్నముగా యున్నదా అని తెలిసికొని సాధనను అనుకూలముగా కష్టపడి చేసినచో తప్పక ఫలితమును పొందగలరు. బాహ్యమైన వ్యవసాయ, వ్యాపార, ఉద్యోగాదులకే ఎంతో శ్రమ

పడుచుండగా నిత్య నిరతిశయ సుఖము కొరకు పట్టుదలతో ప్రయత్నము చేయవలెను. ఒకటవ పాదము 29వ సూత్రములో చెప్పినట్లు ఈశ్వర ప్రణిధానమువలన విఘ్ననివృత్తి కలిగి భగవత్ సాక్షాత్కారము కలుగును. కనుక కష్టపడి సాధించండి. మంగలి కత్తి పదును మీద నడవడము ఎంత కష్టమో ఆత్మమార్గములో నడవడము కూడ అంత కష్టము. అంటే తాను పైకిపోవలెనని ప్రయత్నము చేస్తే మాయ అడుగడుగున దానికి విఘ్నములు చేయుచుండును. కనుకనే గీత 7వ అ "దైవీహ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా" అనగా దాటుటకు చాలా కష్టమైన మాయను. దాటవలెనంటే నన్ను శరణు పొందినవారుమాత్రమే మాయను తప్పించుకొనగలరని శ్రీకృష్ణ పరమాత్మ చెప్పెను.

శరణాగతి అంటే నీకంటే అన్యము ఏమీ లేదు. శరీరముతో సహా వాక్కు, మనస్సునందు నీకంటే అన్యము లేదను శరణాగతితో భావించినచో ఏకాగ్రత కలిగి ఈశ్వరానుగ్రహము కలుగును. అటువంటప్పుడు రాగ ద్వేషాదులు వచ్చుచుండును. కనుక భగవంతుని యందు నిర్మలభక్తి కావలయును. అట్టి భక్తి కావలెనంటే సత్యము, ధర్మము, నీతి, న్యాయము, పెద్దలయందు ఎంత భక్తికలిగి ప్రవర్తించినచో భగవంతుడు అనుగ్రహించును. కనుక ఈ గుణములు దైవ నామమును మరువక యున్నచో తప్పక దైవానుగ్రహము పొంది పైకి పోగలరు. కనుక ఈ రహస్యమును గ్రహించి అనుష్ఠించినచో తరించిపోగలరు.

23-8-74 శుక్రవారం

17 సూ॥ శబ్దార్థ ప్రత్యయానా మితరేతరా ధ్యాసాత్సంకర
స్తత్ప్రవిభాగ సంయమాత్సర్వ భూత రుత జ్ఞానమ్॥

భా:- శబ్దము, అర్థము, ప్రత్యయము అన్నారు. గోవు శబ్దము గోవు అర్థము, గోవుజ్ఞానము గోవు అనుశబ్దము వినగానే

గొమ్ములు మొదలగునవి కలవి యని తెలిసినవారికి గోచరమగును. అనగా గోవు అంటే గోవుయని అర్థము. రెండు కొమ్ములు, నాలుగు కాళ్ళు, తోక, మొదలగునవి కల గోవుయని ఇదివరలో గోవును తెలిసియున్నవారికే తెలియును. మనము మాట్లాడే శబ్దము వర్ణాత్మకము అనగా, అ ఆ లు, క ఖ లుగా ఉండును. పశు పక్ష్యాదుల శబ్దములు, వర్ణాత్మకముగా యుండవు. గోవు అనగా జ్ఞానము, గోవు దాని ఆకారమును గ్రహించినదే జ్ఞానము. అంటే ధారణ, ధ్యాన, సమాధులను మూడింటిని సంయమము చేసినచో శబ్దము, అర్థము, జ్ఞానములను వేరు వేరుగా చేసుకొని సంయమము చేసి నచో సమస్త భూతములయొక్క శబ్ద జ్ఞానము కలుగును. అంటే పశుపక్ష్యాదుల యొక్క శబ్ద, అర్థ, జ్ఞానములయందు సంయమము చేసినచో ఆయా జంతువులయొక్క శబ్ద, అర్థ, జ్ఞానము అనగా వాటి జ్ఞానము కలుగును. అంటే సర్వప్రాణుల భాషను ఎరుంగు సామర్థ్యము తనంతటనే లభించును.

18 సూ॥ సంస్కార సాక్షాత్కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్ ॥

భా॥ :- సంయమమువల్ల సాక్షాత్కరించుట వల్ల పూర్వజన్మ తెలియబడును. సంస్కారములు రెండురకములు. అందులో ఒకటి వాసనారూప సంస్కారము. అనగా మనకు కొన్ని జ్ఞాపకము వచ్చుచుండును. అంటే తిరుపతివెళ్ళి వెంకటేశ్వరులను యిదివరలో దర్శించియున్నందున, యిప్పుడు తిరుపతి జ్ఞాపకము రాగానే ఆ వెంకటేశ్వరులు ఆ గర్భగుడి మొదలగున వన్నియు స్ఫురించునుగా, యిదే వాసనారూప సంస్కారమంటే. ధర్మా ధర్మ సంస్కారములనగా పుణ్యపాప సంస్కారములు, పుణ్యసంస్కారము వల్ల సుఖము పాప సంస్కారమువల్ల దుఃఖము కల్గును. ఇవి పూర్వాపూర్వ జన్మలలో చేసినవి ప్రారబ్ధపూర్వకముగా సుఖదుఃఖరూప సంస్కారము కల్గును. యోగి ఈ రెండు విధముల సంస్కారములయందు ధ్యాన,

ధారణ, సమాధులను అంటే సంయమము చేసినచో ఆయా పూర్వ
పూర్వ జన్మల జ్ఞానము కలుగును. ఇది తన సంస్కారమునందు
సంయమము చేస్తే తనజన్మలు తెలియును. ఇతరుల సంస్కారము
నందు సంయమము చేస్తే ఇతరుల జన్మ తెలియును యోగియొక్క
చిత్తవృత్తికే తన జన్మలు కాని యితరుల జన్మలు కాని గోచరించును.

19 సూ॥ ప్రత్యయస్య పరిచిత్త జ్ఞానమ్ ॥

భా॥ :- ఇతరుల యొక్క చిత్తమునందు తాను సంయమము
చేయుట వలన ఆ యోగికి ఇతరులబుద్ధి చిత్తము కనుపించును.
యోగి చిత్తము సత్వ తమో గుణములతో గాని, కామ క్రోధాదు
లతో యున్నను తెలియును. గాని కాగా తెలియదు.

20 సూ॥ నచతత్సాలంబనం తస్యా విషయీభూతత్వాత్ ॥

భా॥ :- ఆ పరచిత్తమునందు యోగి సంయమము చేసినచో అతని
చిత్తము రాగ ద్వేషాదులయందు ఉన్నట్లు తెలియునేగాని, ఆ రాగ
ద్వేషాదులు దేనియందుండునని కాగా తెలియదు. ఇది నిరాలంబనం.
అదే సాలంబనము అయినచో తెలియునని కొందరు అన్నారు.
ముందు యోగము సంపాదించి ఆపైని ధారణ, ధ్యాన, సమాధుల
సంయమమును సంపాదించినచో యిట్టి సిద్ధులు కలుగును.

24-8-1974 శనివారం

21 సూ॥ కాయరూప సంయమాత్ తద్గ్రాహ్యశక్తి స్తంభే
చక్షుప్రకాశా సంయోగేం తర్ధానమ్ ॥

భా :- యోగి తన శరీర రూపమునందు ధారణ, ధ్యాన సమాధి
యను సంయమము చేసినచో యితరులయొక్క నేత్రములకు తన
శరీర రూపమును గ్రహించేశక్తి ప్రతిబంధింపబడును. అంటే ఇత
రులకు తన శరీరము కనుపించదు. అనగా తాను ఇతరులకు కను
పించడు. నలుడు దమయంతి అంతఃపురమునకు వెళ్ళెను. గాని

నలుడు యితరుల కంటికి కనుపించలేదు. ఐతే అక్కడ నలుడు ఈ సంయమము చేసి కనుపించక పోవడము కాదు.

ఇంద్రాది దేవతలు ఒక తాయత్తును యిచ్చినందున కనుపించలేదు. మూలికలు కూడ ఎంతో అద్భుతమయినవి యున్నవి. అనగా గొప్ప శక్తిగల మూలికలు కూడా యున్నవి. మంత్రములలో కూడ సామర్థ్యములున్నవి అలాగే తన శబ్దమునందు సంయమము చేసినచో తాను మాట్లాడినా ఎవరికీ వినిపించదు. అలాగే స్పర్శయందు సంయమము చేసినచో ఆ స్పర్శను ఇతరులు గ్రహించలేరు.

22 సూ॥ సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సం
యమాదపరాంత జ్ఞాన మరిష్టేభ్యోవా॥

భా:- సోపక్రమము అంటే ఉపక్రమముతో కూడిన కర్మ నిరుపక్రమంచ అనగా యింకా ఉపక్రమించని కర్మ అంటే సంచిత కర్మ, సోపక్రమము అంటే ప్రారబ్ధకర్మ ఫలమును ఇచ్చుటకు ప్రారంభించబడినది. ప్రారబ్ధకర్మ ఏ ప్రకారము చేసిన ఆ ప్రకారము క్రమముగా వచ్చును. కాని అత్యధిక పుణ్యముగాని, పాపముగాని అయినచో ఈ జన్మలోనే అనుభవమునకు వచ్చును. అనగా ఫలమును వచ్చిన కర్మ పరిపక్వదశకు వచ్చినదన్నమాట. సంచితమునుండి పక్వదశకు వచ్చినదానిని, కానిదానిని, విడదీసి పక్వదశకు వచ్చిన దానివల్ల జన్మవచ్చి అనుభవించెదరు. ఆగామి అలాగాదు. దీనివలన తన జీవితమును చక్కదిద్దుకొనవచ్చును. మంచిపనులు సజ్జన సహవాసము. చేసినచో మంచిజన్మ వచ్చును దుష్టుల సహవాసము, దుష్టపనులు చేసినచో పాపము కలుగును, ఇది తిరిగిసంచితములో కలియును, సోపక్రమము అంటే ప్రారబ్ధకర్మ.

నిరుపక్రమమంటే యింకా పక్వదశకురాని సంచితకర్మ. ప్రారబ్ధ కర్మయందు సంయమము చేయుటవలన తాను ఎప్పుడు

చనిపోయేది. ఎప్పుడే దేశంలో ఏవిధముగా చనిపోయేది తెలియును. ప్రాసంగికముగా తాను ఎప్పుడు చనిపోయేది కూడ తెలిసికొన వచ్చును. అని చెప్పుచున్నారు. యిది యోగికాని వారికి కూడ తెలియును. శత్రువువలె మరణము భయపెట్టును. మరణ సూచకములను అరిష్టములన్నారు. అవి ఆధ్యాత్మికము, ఆదిభౌతికము, ఆదిదైవికము అని. సాధారణముగా చెవులు మూసికొన్నచో అందరికీ ధ్వని వినబడును. జపధ్యానాది సాధనములు చేయుచు కొంత ఏకాగ్రత యున్నచో నిశబ్దముగా యున్నపుడు తనకు తానుగానే వినిపించును. అలా చెవులలో వ్రేళ్ళుపెట్టుకొన్న తరువాత ధ్వని వినిపించక పోయినచో త్వరలో చనిపోవును. యిది ఆధ్యాత్మికము తాను పండుకొని యున్నపుడు యమదూతలు కనుపించెదరు. ఇది ఆదిభౌతికము యిక మరణము దగ్గరలో యున్నదని తెలిసికొన వచ్చును. దీనివలన ఆదిదైవికమనగా ఆకస్మికముగా స్వర్గాదులు కొందరు సిద్ధులు కనుపించెదరు. ఇవి మరణమును సూచించెడివి. ఇవి యోగికాని వారలకు కూడ తెలియును.

**28 సూ॥ మైత్ర్యాదిషు బలాని ।**

మైత్రీ మొదలగు వాటియందు సంయమము చేసినచో బలము కలుగును. అంటే సుఖవంతులయందు ధారణ ధ్యాన సమాధి అను సంయమము బాగా చేసినచో లోకములో అందరూ తనకు స్నేహితులగుదురు.

సంతోషమును భావన చేసినచో తనకంటే గొప్పవారిని చూచిన సంతోషము. తనతో సమానులయందు మైత్రి. తక్కువ వారి విషయములో కరుణను భావించినచో గొప్పవారందరు తెలిసిన వారగుదురు. ఇది సంతోషము. దీనులయందు కరుణ బలము వచ్చును. అంటే దీనులయందు కరుణను సంయమము చేసినచో తనకు కరుణాబలము వచ్చును. మైత్రీబలము, సంతోషబలము,

కరుణాబలమువల్ల దీనులకు సహాయము చేయు సమర్థత కలుగును. ఉపేషాభావన గురించి యిక్కడ చెప్పలేదు వదిలివేసిరి.

24 సూ॥ బలేషు హస్తి బలాదీని॥

భా:- ఏనుగు మొదలగువాటి బలమును సంపాదించుకొనుటకై హనుమంతుని బలము ప్రదర్శించే ఘట్టము బాగా చదివి ఆ బలము వంటి ధారణ, ధ్యాన, సమాధులను శీలించినచో ఆ కొండను ఎత్తు బలము కలుగును. ఏనుగును భావించిన ఏనుగు బలము వచ్చును. చిత్తమునకు స్వతహాగా సమస్త సామర్థ్యములు ఉన్నవి. కాని అణగియుండును. మనము ఆయా సాధనలు చేసి వాటిని ప్రకటన చేసికొనవలెను. ధారణ, ధ్యాన, సమాధులను సంయమము చేసినచో ఆయా సామర్థ్యము కలుగును.

25 సూ॥ ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మ వ్యవహిత
విప్రకృష్ట జ్ఞానమ్॥

జ్యోతిష్మతీ ప్రవృత్తియందు సంయమము చేసినచో పరమాణువులను సూక్ష్మపదార్థములు యోగదృష్టికి గోచరమగును. ఇదే దివ్యదృష్టి ఆపైది జ్ఞానదృష్టి మనకు యిప్పుడు ఉన్నది భౌతికదృష్టి.

అపంచీకృత పంచభూతములకు సంబంధించినది యీ దృష్టి. పంచభూతములవల్ల ఏర్పడిన పదార్థములు గోచరమగును. అర్జునుడు విశ్వరూప దర్శనమును ఈ చక్షువులతో చూడజాలడని దివ్యదృష్టిని ఇచ్చెను అపుడు చూచెను. యిది సగుణస్వరూపము. నిర్గుణ స్వరూపము చూడవలెననిన జ్ఞానదృష్టి, యోగదృష్టి కావలెను.

వ్యవహితములైన పదార్థములంటే గోడకు అవతల యున్న పదార్థములను కూడ యోగదృష్టితో చూడగలుగును. ఇక్కడ వుంటాడు అండన్‌లో ఏమియున్నదో అది కనుపించవలెనంటే కనుపించును. అంటే జ్యోతిష్మతి ప్రవృత్తియొక్క ప్రకాశమునందు సంయమము చేసిననే యిది కలుగును.

25-8-1974 ఆదివారము

26 సూ॥ భువన జ్ఞానమ్ సూర్యే సంయమాత్ ॥

సుషుమ్నయందుగాని, సూర్యునియందుగాని ధారణ, ధ్యాన, సమాధులను, సంయమము చేసినచో పదునాలుగు లోకముల యొక్క జ్ఞానము తెలియును.

27 సూ॥ చంద్రే తారావ్యూహ జ్ఞానం॥

చంద్రునియందు సంయోగము చేయుటవలన నక్షత్రములయొక్క అనగా నక్షత్రములు ఎక్కడ ఎట్లుయున్నది తెలియును.

28 సూ॥ ధృవే తద్గతి జ్ఞానమ్॥

ధృవుని యందు, ధృవ నక్షత్రమునందు సంయమము చేసినచో ఏయే నక్షత్రములు ఎట్లెట్లు గమనము చేయునది తెలియును. సప్తఋషుల నక్షత్రములు రాత్రి ఒకచోట ఉంటే తెల్లవారు జామున ఇంకొక చోటయున్నట్లు కనుపించును కదా! ఆ ప్రకారముగా బాహ్యమైన పదార్థముల యందు సంయమము చెప్పెను. ఇక శరీరము నందు చెప్పుచున్నారు.

29 సూ॥ నాభి చక్రే కాయవ్యూహజ్ఞానమ్॥

నాభి అనగా బొడ్డు నందు ఒక చక్రమున్నది. దానియందు సంయమము చేస్తే ఈశరీరములో వాత, పిత్త, శ్లేష్మాదులు ఎంతెంతయున్నవి. ఏనాడులు ఎట్లెట్లుయున్నవి తెలియును.

30 సూ॥ కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః॥

భా॥ కండ కూపమునందు అంటే గుంట యందు సంయమము చేస్తే ఆకలి దప్పి నివృత్తి అగును.

31 సూ॥ కూర్మనాడ్యాం స్థైర్యమ్॥

భా॥ కూర్మనాడియందు సంయమము చేయుటవలన వక్షస్థలములో కూర్మమువలె ఒక చుట్టచుట్టుకొనివుంటుందట దానియందు సంయమము చేసినచో శరీరమునకు చిత్తమునకు స్థిరత్వము, ఏకాగ్రత కలుగును.

32 సూ॥ మూర్ధజ్యోతిషి సిద్ధ దర్శనమ్॥

మూర్ధము అంటే బ్రహ్మ కపాలము. అదే బ్రహ్మరంధ్రము ఆ రంధ్రమునందు ఒక తేజస్సు యున్నది. ఆ తేజస్సునందు సంయమము చేస్తే సిద్ధ పురుషుల దర్శనము లభించును. మణిప్రభ వలె చిత్త ప్రభ యుండును. అప్పుడు సిద్ధ పురుషుల దర్శనమగును.

33 సూ॥ ప్రాతిభాద్వా సర్వమ్॥

యోగి ఆత్మ దర్శనము కొరకు సంప్రజ్ఞాత సమాధిని బాగా అనుష్ఠించునప్పుడు ప్రకృతి పురుష వివేకము కలుగుటకై బాగా సాధన చేస్తూ పోగా ఆ ప్రకృతి పురుష వివేకము కలిగే సమయము దగ్గరకు వచ్చినదన్నమాట. అటువంటప్పుడు "ప్రాతిభ" అంటే నవ నవోన్మేష శాలిని అంటే ఆయా విషయములను గ్రహించుటలో మహోన్నతముగా గ్రహించును. బహు శీఘ్రముగా తెలియును. అది నిర్దుష్టముగా నిర్ణయరూపముగా యుండును. అది నూతన, నూతనముగా కలుగుతూ పోతుంటుంది. దానినే ప్రతిభ అంటారు. అట్టి ప్రతిభ చేత కలిగిన జ్ఞానమును ప్రాతిభములని అందురు. అట్టి ప్రాతిభమునందు యోగి సంయమము చేసినచో అంటే ప్రకృతి పురుష వివేకోదయము దగ్గరకు వచ్చినపుడే అట్టి ప్రతిభ కలుగును. ఇట్టి ప్రతిభ కలిగినపుడు సూర్యోదయమునకు ముందు అరుణోదయము అగును. అరుణోదయమువల్ల సమస్త పదార్థముల జ్ఞానము కలిగినట్లున్నా సూర్యోదయము కలుగు సమయము దగ్గరకు వచ్చినట్లే అని తెలియునట్లే అని తెలిసికొనవలెను. దీనికి సర్వజ్ఞత్వము కలుగును. ఈ సర్వజ్ఞత్వము సమస్త విషయములు తెలియబడునపుడు ఇక దగ్గరలోనే ప్రకృతి పురుష వివేకము కలుగునని గ్రహించేది.

34 సూ॥ హృదయే చిత్త సంవిత్॥

భా॥ హృదయము నందు పద్మము యుంటుంది అది అథోముఖముగా యుంటుంది కాడ పైకి యుంటుంది. సాధకులైన వారు వారి వారి ఇష్టదైవమును, హృదయములో నిలిపి జప, ధ్యానాదులు, వారి గురువులు చెప్పిన ప్రకారము చేసినచో ఆ పద్మము ఊర్ధ్వ ముఖముగా తిరుగును. అప్పుడు ఆ పద్మమునందు తన యిష్టదైవమును నిలిపి జప, ధ్యానాదులు చేయవచ్చును. చిత్తము ఎటువంటి వాసనలతో యున్నదంటే పక్వదశలో పడిన సంస్కారాన్ని వాసన అంటారు. ఏదైన ఒక అభ్యాసము చిరకాలము చేస్తే అదే వాసనగా పరిణమించును. సాధకులు తమ అనుష్ఠానము పక్వదశలో పడే వరకు పట్టుదలతో చేయవలెను. అలా చేసినచో ఒక దశలో పమును. హారతి యివ్వడము, గంట కొట్టడము మొదట చేతగాక పోయినా ఆ రెండూ ఒకేసారి చేయలేకపోయినా పట్టుదలతో చేయుటచే సంస్కారము ఏర్పడును. అలాగే విడువకుండా పట్టుదలతో చేస్తూ కాగా, కాగా ఆ అభ్యాసము వాసనగా పరిణమించును.

అలా పరిణమించిన తర్వాత అదే సహజముగా జరిగిపోవుచుండును. వాసనగా పరిణమించే వరకే ప్రయత్నముతో పట్టుదలగా చేయవలెను. ఆ తర్వాత యిక అదే సాగిపోవును. మన ప్రయత్నము అంతగా అక్కర లేదు చిరకాలాభ్యాసమే వాసనగా పరిణమించును. ఆత్మజ్ఞానము తెలిసికోవడము కష్టము కాదు కాని జప, ధ్యానాదులు చేయునపుడు తనంతట తానే ఆ మనస్సు ఎక్కడికి పోవుచుండును. అది తనకు తెలియకుండగనే జరిగి పోవుచుండును. ఇది అంతా సంస్కారము. మంత్రము జరుగును. మాల తిరుగుచుండును. కాని మనస్సు ఏదో ఆలోచించుచునే యుండును. అంటే అవి అన్నియు చాలా కాలాభ్యాసము వల్ల వాసనగా మారి అలా ఉద్బుద్ధమగుచుండును, కనుక వాటిని తగ్గించి ఆత్మసంస్కారమును

పట్టుదలతో వృద్ధిచేసుకొంటూ పోతే అదే వాసనగా పట్టిపోవలెను, అప్పుడే పాతవాసనలు పోయి ఆత్మవాసన బాగా పట్టిపోవును. అలా ఐననే ఎల్లప్పుడు ఆత్మభావములో ఉండవచ్చును. ఆత్మభావము బాగా దృఢపడవలెను. జ్ఞానికికూడ మనస్సులో యితర విషయము లను గురించి భావించినపుడు "అహంబ్రహ్మాస్మి" భావము ఉండునా అంటే ఒక విషయము ఆలోచించినపుడు యింకొక విషయము ఉండదు. అష్టావధాని, శతావధాని అన్నిటిని గ్రహిస్తున్నాడంటే బుద్ధి ఎప్పుడు ఒకే సమయములో అనేకము గ్రహించలేదు. వారి బుద్ధి అతిసూక్ష్మముగా పనిచేయుటచేత ఒక్కొక్కటే గ్రహించినా అన్నీ ఒక్కసారే గ్రహించినట్లు అనిపించును.

## 25-8-1974 ఆదివారం

తామర రేకులు 100 పెట్టి ఆ రేకులమీద సూదితో పొడిచినచో టకీమని క్రిందికి పోవును. ఐతే అంత వేగముగా ఒక్కొక్కటి గ్రుచ్చుకుంటూనే పోవును. కాని పైది క్రిందిదే తగిలి మధ్యలో కొన్నిటికి రంధ్రము పడకుండాయుండదు. ఆ రేకులు అతిమృదువు ఆ సూది అతి పదునుకలగి. అలాగే అష్టావధానులుకూడ ఒక్కొక్కటే గ్రహించును కాని అతి తీవ్రముగా గ్రహించుటచే అలా అనిపించును. ఆత్మభావము చాలా కాలము అభ్యాసము చేయుట వలన బాగా దృఢపడిపోయి యున్నచో అటువంటివారు శరీరము వదలినపుడు స్మృతిలేకుండ పోయినచో వానిగతి ఏమి అనగా ఎల్లప్పుడు ఆ భావములో యున్నారు కనుక అట్టివారు ఆత్మలోనే చేరుకొందురు.

భ. గీ. "యం. యం వాపి స్మరన్భావం" అని అనగా ఏ భావనయుంటే ఆ జన్మవచ్చునని గదా! ఉన్నదని అంటే జ్ఞాని విషయమై ఇది ఏమి లేదు. జ్ఞానికి లోపల దృఢపడిపోయి యున్నందున ఆయన పరమాత్మలోనే లీనమైపోవును. "యం, యం వాపి"

అనేది ఉపాసకుల విషయమై చెప్పినదిగాని జ్ఞానిని గురించి కాదు. జ్ఞాని ఏమి చేసినా, ఏమి మాట్లాడినా "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని దృఢపడిపోయి యుండును. అందుచేత పరమాత్మలోనే లీన మైపోవును.

27-8-74 మంగళవారము

35 సూ॥ సత్త్వపురుషయోరత్యంతా సంకీర్ణయోః ప్రత్య
యావిశేషోభోగః పరార్థత్వాత్ స్వార్థ సంయమాత్
పురుషజ్ఞానమ్ ॥

భా :- సత్త్వము పురుషుడు అంటే సత్త్వమనగా బుద్ధి. జడరూపమైనది. పురుషునకు సమర్పితము కనుక భోగ్యము. పురుషుడు చైతన్యరూపుడు భోక్త అగును. ఆ యిద్దరు వేరు వేరే కాని ఒకటి కాదు. పురుషుడు బుద్ధియందు ప్రతిబింబించును. ఆ బుద్ధి సుఖము, దుఃఖము, మోహము మొదలగునవి కలిగి యుండును. ఆ బుద్ధిలో పురుష ప్రతిబింబము పడును. ఆ ప్రతిబింబములో బుద్ధిరూప సుఖ దుఃఖాదులు అభేదముగా గోచరించును. అదే భోగము అందురు. బుద్ధి అనగా ప్రకృతి. దీని సుఖదుఃఖాదులు పురుషుని యందు ఆరోపితమై యుండును. అనగా బుద్ధి సుఖ దుఃఖ మోహాదులను పురుషునకు సమర్పించును. కనుక భోగము సమర్పణమైనది. పురుషుడు భోక్తయగును. బుద్ధి పదార్థము కనుక దానిని వదలివేసి పురుషునికి సంబంధించిన ప్రతిబింబము బుద్ధి యందుండును. ఆ ప్రతిబింబమునందు సంయమము చేస్తే పురుష జ్ఞానము కలుగును. అపుడు బుద్ధిలోగల గుణములన్నియు నష్టమైయుండును. అందుచేత పురుషుడు అనగా ఆత్మజ్ఞానము కలుగును. విచారణ లేనిచో బుద్ధికిగల సుఖదుఃఖాదులు నావియని భావించును. విచారణ బాగా చేసినచో ప్రకృతి పురుషవివేకము బాగా కలిగి అపుడు పురుషుడు వేరు ప్రకృతి అనగా బుద్ధి వేరు అను జ్ఞానము కలుగును. ఇది సంప్రజ్ఞాత

సమాధి. ఏది స్ఫురించనిది అసంప్రజ్ఞాత సమాధి. బుద్ధియందు గల పురుషుని ప్రతిబింబమునందు సంయమము చేసినచో ఆత్మజ్ఞానము కలుగును. బుద్ధియందు పురుషుని ప్రతిబింబమునందు ఏకాగ్రము చేసి సమాధి శీలించుచుండగా అనగా యింకా ఆత్మసాక్షాత్కా-రము కలుగక ముందుగా కొన్ని సిద్ధులు కలుగునని చెప్పుచున్నారు.

36 సూ॥ తతః ప్రాతిభ శ్రావణ వేదనా-దర్శా స్వాద వార్తా జాయంతే॥

భా॥ ప్రకృతి పురుష వివేకము కొరకు, బుద్ధి యందలి ప్రతిబింబము నందు సంయమము చేసినచో ఆరు సిద్ధులు కలుగును. ప్రాతిభ జ్యోతియందు, సంయమము చేసినచో, అతీతములు, అనాగతములు, సూక్ష్మములు, అయిన పదార్థముల జ్ఞానము కలుగును ఇవి అన్నియు ప్రకృతి పురుష వివేకము కలుగక ముందుగా నేకలిగే సిద్ధులు. అవి 1 ప్రాతిభము, 2 శ్రావణము, 3 వేదన, 4 ఆదర్శ, 5 ఆస్వాద, 6 వార్తా సిద్ధి అను ఆరు సిద్ధులు కలుగును

2 శ్రావణము అనగా దేవతలచే అనుభవింపబడు సూక్ష్మ శబ్దగ్రహణము కలుగును. 3 వేదనము అనగా త్వగింద్రియము చేత ఈలోకములోనివే తెలియును. గాని దేవతల భోగార్హమైన సూక్ష్మమగు స్పర్శమును గ్రహించుశక్తి త్వగింద్రియమునకు కలుగును. 4 ఆదర్శమనగా దివ్యమైన సూక్ష్మమగురూపమును గ్రహించు చక్షురింద్రియశక్తి, 5 ఆస్వాదమనగా దేవానుభవయోగ్యమైన సూక్ష్మమగు రసమును గమనింపగల రసనేంద్రియ శక్తి 6 వార్త అనగా దేవభోగానుగుణ్యమైన సూక్ష్మ గంధ విశేషము నెరుగు ఘ్రాణేంద్రియ నిష్టమగు సామర్థ్యము కలుగును. ఆ సంయమము వల్ల దేవభోగ్యమైనవి ప్రాప్తించును. అయితే వాటి వలన కృతకృత్యుడైనట్లైన అనగా

37 సూ॥ తే సమాధా ఉపసర్గా వ్యుత్థానే సిద్ధయః॥

భా:- ఈ ఆరు సిద్ధులు సమాధి విషయములో విఘ్నములగును. సమాధి ప్రకృతి పురుష వివేకముకొరకు శీలించుచుండగా ఈ ఆరు సిద్ధులు తనకు కలిగెను. అప్పుడు ఆసిద్ధులలో పడిపోయినచో ప్రకృతి పురుష వివేకముకలుగదు. ఆ సిద్ధులు ప్రకృతి పురుష వివేకమునకు విఘ్నములు. బహిర్దృష్టిలో పురుషార్థములుగా కనుపించునుగాని అంతరదృష్టిలో ప్రకృతి పురుష వివేకము కలుగలేదు కనుక ఆ వివేకమునకు విఘ్నములగును. సాధకులకు కొంత ఏకాగ్రత కలిగినచో కొంత శక్తి కలుగును. ఆ శక్తిని లోకులకు ప్రదర్శించెదరు. దానితో ఆత్మసాక్షాత్కారమునకు తగిన ప్రకృతి పురుష వివేకమునకు విఘ్నము వచ్చినట్లే. ఆత్మజ్ఞానమునకు భగవద్భక్తి బాగా కలిగియున్నచో, ఇట్టి విఘ్నములు కష్టములు తప్పిపోవును. అని శ్రీ పతంజలి మహర్షియే "ఈశ్వరప్రణిధానాద్వా" అని చెప్పెను. ఆ ఈశ్వరునకు ఓంకారము పేరు. ఆ ఓంకారమును అనగా పరమేశ్వరుని భక్తితో నీకంటె నాకు అన్యము లేదనే పద్ధతిలో భక్తియొక్క ఆవేశముతో ఎవరు ప్రార్థన చేసెదరో వారికే పురుష ప్రాప్తి కలుగును. విఘ్నములు కావు. సిద్ధులకు లోబడినవారు ఆత్మజ్ఞానమునకు దూరులై జనన మరణములలో పడిపోయెదరు. ఆత్మసాక్షాత్కారము కలుగవలెనని భగవద్భక్తి బాగా కలిగియుండవలెను. భగవద్భక్తి హీనులకు సాక్షాత్కారముండదు. సమాధిని శీలించుచుందురు, మధ్యలో విఘ్నములు వచ్చి పడి అంతటితో ఆగిపోవుదురు సత్కర్మ నిష్ఠ బాగా కలిగియుండవలెను. శుద్ధాంతఃకరణమునందే ఆత్మానాత్మ వివేకము కలుగును. అప్పుడు అనాత్మయందు విరక్తి కలిగి ఆత్మయందు అనురక్తి కలిగి బాగా వృద్ధిపొంది ఆత్మజ్ఞానము బాగా దృఢపడును. కర్మానుష్ఠానము గాని జ్ఞాన సాధన అనుష్ఠానమును గాని భక్తి పూర్వకముగా శీలించవలెను. సత్కర్మనిష్ఠ భగవద్భక్తి

కలిగినచో భగవదనుగ్రహము కలుగును. భగవదనుగ్రహము కలిగిననే సద్గురువు లభించును. పరమేశ్వరానుగ్రహముయున్నచో మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయము కలుగును. ఈ ఈశ్వరానుగ్రహము వేదానుగ్రహము, గుర్వనుగ్రహము, అంతఃకరణ అనుగ్రహము యుండవలెను. ఈశ్వరానుగ్రహమువలన సాధన సామాగ్రి లభించును. గురువు దొరికిన గురువు అనుగ్రహము సంపాదించుకొనవలెను. గురువు అనుగ్రహమున్నచో 90 పాళ్లు జ్ఞానము లభించినట్లే. ఇక శిష్యుని 10 పాళ్లే ఆచరణ, వేదానుగ్రహమంటే సత్కర్మ, ఉపాసనాకాండ, ఉపనిషత్తు, జ్ఞానము బోధించును. గురువు అనుగ్రహముతో బోధించిన ఈశ్వరానుగ్రహము లేక పోయినచో ఆ బోధించినది బాగా మనసునకు పట్టదు. గురువుగారు "తత్వమసి" మహావాక్య బోధను బాగా విడదీసి బోధించెను. కాని అది బాగా పట్టక పోయినచో వారి వారి సంస్కారాను సారముగా అనేక రకములుగా గురువు బోధించినా శిష్యులకు పట్టదు కాని శిష్యునకు యింకా జ్ఞానము బోధపడ లేదంటే ఈశ్వరానుగ్రహము కలుగ లేదన్నమాట.

శ్లో॥ శ్రుత్వాతత్వమసీత్యేవం బోధ్యమానోప్యనేకధా।
న విజానాత్యయం తత్త్వమీశానుగ్రహ వర్జితః॥

తా॥ "తత్వమసి" అను మహావాక్యమును అనేకసార్లు మహాత్ములగు గురువులవలన శ్రవణము చేసినను అనేక యుక్తి అనుభవముల చేత, స్వయముగా బోధించినను ఈశ్వరానుగ్రహము లేని వారికి జీవేశ్వర ఏకత్వముగు అద్వైత తత్త్వము బోధపడజాలదు.

భగవదనుగ్రహము కలుగవలెనంటే భగవంతుడు చేయుమని చెప్పినవి శక్తి వంచన లేకుండ చేయుచు, చేయకూడదన్నవి చేయక పోవడమువల్లను భగవదనుగ్రహము కలిగి సాధనలు విఘ్న

ములు లేకుండా చక్కగా సాగిపోవును. అంతఃకరణ అనుగ్రహము కూడ ఉండవలెను. అంతఃకరణ చంచలము కలది. ఆ చంచలము అణగి నిశ్చలముగాయున్నచో వేదము ద్వారా గురువుల ద్వారా విన్నది విన్నట్లు పట్టును. చిత్తము చంచలమైనది. ఒకచోటయుండ లేదు. పుణ్య, పాపములచేత ఆ చిత్తము ఆ శరీరమునందు బంధింపబడియుండును. సమాధిని చిరకాలము అభ్యసించుటవలన పుణ్య పాపములు శిథిలములగును. అంటే పట్టు సడలును.

28-8-1974 బుధవారం

38 సూ॥ బంధకారణ శైథిల్యాత్ప్రచార సంవేదనా
చ్చ చిత్తస్య పరశరీరావేశః ।

ప్రచారము అంటే చిత్తము హృదయ ప్రదేశమునుండి విషయముల వైపుకు పోవుటయే. అలాపోయే విషయమును యోగి చిత్త వహానునాడి ద్వారా. చిత్తము ప్రసరించుటను తెలిసికొనుట వలనను, చిత్తమునకు అన్యుల శరీరములో ప్రవేశము కలుగును. అనగా తన చిత్తమును ప్రచార సంవేదనలను రెండింటిని సంయమము చేయుటవల్ల పరకాయ ప్రవేశము చేయగలుగును.

బంధకారణమైన చిత్తమును శిథిలము చేసిన తరువాత ప్రచార సంవేదనము అనగా హృదయమునుండి, చిత్తము ఇంద్రియములద్వారా విషయముల మీదకు చిత్తోవహాను నాడిద్వారా పోయే విషయమును బాగా గ్రహించి సమాధి ద్వారా ఆ నాడిని ఆ నాడిద్వారా పోయే విషయములను బాగా గుర్తించ గలిగినచో పరశరీరములో ప్రవేశింపవచ్చును. యోగములు చెప్పినట్లుగా చేసినచో ఈ సిద్ధులు సిద్ధించును. జ్ఞాని దృష్టిలో ఈ సిద్ధులు లేవు. జ్ఞానిదృష్టిలో యున్నది బ్రహ్మము ఒక్కటే.

యోగి కొంతకాలము లోకము దృష్టిలో గౌరవాదులు సంపాదించుటకు ఉపయోగించినను కడకు యోగికూడా జ్ఞానమార్గ

మునకు రావలసినదే. యోగముచేత మోక్షము కలుగదు. యోగులు ప్రకృతి వేరు పురుషుడు వేరు అని చెప్పిరి. ప్రకృతి యున్నది. ప్రకృతి కారణము. విత్తనము యున్నచో చెట్టు పుట్టు అవకాశము యున్నది. అలాగే ప్రకృతియున్నది సత్యము కనుక మరల సంసారమనే వృక్షము కలుగు అవకాశమున్నది. యోగులకు జ్ఞాని దృష్టిలో ఈ ప్రపంచ మంతయు బ్రహ్మమే అయితే బ్రహ్మయొక్క అజ్ఞానమువలన రకరకములుగా కనుపించుచున్నది. కాని ఉన్నది మాత్రము ఒక్క బ్రహ్మమే. రజ్జువును చూచి పాము అని భ్రమించి బాగా చూచినచో త్రాడు అని తెలిసికొనును ఆ మధ్యలో రజ్జు జ్ఞానము లేనందున పాము అనుకున్నారు. అలాగే బ్రహ్మ అజ్ఞానమువలన తెలియడము లేదు. బ్రహ్మయందు కల్పించబడిన ప్రపంచము బ్రహ్మముకన్నా అన్యము కాదు. త్రాడుయందు పాము ఆ త్రాడుకంటే వేరుకానట్లు అని గ్రహించుకొనవలెను. యోగములో ప్రకృతి పురుషులు వేరు అని అనుకొన్నా మరల ప్రకృతి సత్యము అంటారు. కనుక మరల పడిపోయే అవకాశమున్నది. సమాధివరకు వెళ్ళినా సమాధిలో ఆనందముగా యున్నను సమాధి విడిచినతో మరల ప్రకృతి సత్యమని తోచునుగా. కాని యోగమువలన చిత్తశుద్ధి త్వరలో ఏర్పడి జ్ఞానము త్వరలో ఏర్పడుటకు సహాయపడును.

శ్లో॥ యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధృవం
తస్మాజ్ఞానంచ యోగంచ ముముక్షుర్దృఢ మభ్యసేత్।

తా॥ మోక్షదాయకమైన జ్ఞానము యోగము లేక సిద్ధించుటకు ప్రయాసము. ఆ కారణముచే ముముక్షువైన వాడు యోగమును జ్ఞానమును, నిశ్చయముగా అభ్యసింపవలెను.

39 సూ॥ ఉదానజయాజ్జల పంక కంటకాదిష్వ
సంగ ఉత్క్రాంతిశ్చ।

ఉదాన వాయువును సమాధి మార్గమున జయించిన, అనగా ఉదాన వాయువునందు సంయోగము చేసినచో తన శరీరము దూది వలె తేలిక అయిపోవును. అప్పుడు ఆయన జలములో మునగడు. బురద అంటుకోనదు. ముల్లు గుచ్చుకోనదు. ప్రాణ ప్రయాణ కాలములో అర్చిరాది మార్గమున బ్రహ్మలోకము వెళ్ళగల సామర్థ్యము ఉంటుంది.

29-8-1974 గురువారము

40 సూ॥ సమానజయా జ్జ్వలనమ్॥

సమాన వాయువు హృదయము మొదలు నాభి వరకు వ్యాపించియుండును. సమాన వాయువునందు ధారణ ధ్యాన సమాధులను శీలించినచో, ఆ యోగి ప్రకాశించుచుండును. అనగా అగ్నివలె ప్రకాశించును. మిక్కిలి ప్రకాశవంతుడుగా యుండును.

41 సూ॥ శ్రోత్రాకాశయోస్సంబంధ సంయమాత్
దివ్యం శ్రోత్రం॥

చెవి ఆకాశము యొక్క సంబంధమునందు సంయమము చేసినచో అంటే శ్రోత్రము ఆకాశమును ఆశ్రయించి యుండును. ఆ ఆధారమునందు సంయమము చేసినచో దివ్యశ్రోత్రము కలుగును. అంటే దేవత్వము కలుగును. అనగా ఇక్కడ యుండి కాశిలో జరిగే శబ్దమును వినగలశక్తి లభించును. ప్రకృతి నుండి మహత్తు, దీనినుండి అహంకారము, ఈ అహంకారమునుండి పుట్టినది శబ్ద తన్మాత్ర. దీనికి ఆధారము ఆకాశము. ఆకాశమునకు శ్రోత్రము ఆధేయము గును. ఈ ఆధార ఆధేయ భావమును గమనించి దాని యందు సంయమము చేసినచో దివ్యశబ్దము లభించును. లోపలనే దివ్యశబ్దములున్నవి. కేవలము మనము హృదయము వరకు గల శబ్దములను జపధ్యానాదులు చేయువారు సూక్ష్మబుద్ధి కలవారై నచో ఏకాంతములో ఉండి విన్నచో వినిపించును. అలా గాక అంద

రకు వినిపించవలెనంటే చెవులలో వ్రేళ్ళు పెట్టుకొన్నచో వినిపించును. చూచుకొనండి దీనిని అనాహత ధ్వని అంటారు. ఇది గాక ఇంకా రెండు రకముల శబ్దములున్నవి. అవికూడ యోగికి వినిపించును. అవి మూలాధారమందు ఒకటి, స్వాధిష్ఠానమునందు ఒకటి, హృదయము అనాహతము అనగా కొట్టబడని శబ్దము. మనము మాట్లాడునది ఆహతశబ్దమగును. ఇదే వైఖరీవాణి అని అంటారు. "అ, కు, హ విసర్జనీయానాంకంఠః" కాలూ అంటే దవడలలో నుంచి వచ్చేవికొన్ని ఆకాశ గమనమును చెప్పుచున్నారు.

42 సూ॥ కాయాకాశయోస్సంబంధ సంయమాల్లఘుతూల సమాపత్తేశ్చ ఆకాశగమనమ్॥

ఆకాశమునకు ఉండే ఆధార, ఆధేయ భావమునందు. సంయమము చేయుటవలనను, దూదివలె తేలిక అగును. అప్పుడు ఆకాశగమనము లభించును. దూది అంత తేలిక గల దానియందు సంయమము చేసినా ఆకాశగమనము లంభించునని చెప్పుచున్నారు. అనగా ఆకాశమునందు గమనము చేయుశక్తి కలుగును.

43 సూ॥ బహిరకల్పితా వృత్తిర్మహా విదేహా తతః ప్రకాశావరణ క్షయః॥

శరీరమునకు బయటగా ఏదైనా ఒక విషయమునందు సంయమము చేసినచో విదేహానామకమగు ధారణ అగును. మనస్సు బయటకు రాక లోపలనే నిలిపినచో అది మహా విదేహావృత్తి అంటారు. అప్పుడు బుద్ధి వస్తుతః ప్రకాశమైనదే అది సత్వము గలది. ఆ బుద్ధి లోపలయుండే కరణము కనుక అంతః కరణము అని అన్నారు.

బాహ్యకరణములు అనగా కరణములు అంటే అసాధారణ కారణము. అనగా ఇతరమునకు కారణము గాక యేదో ఒక్కదానికే కారణమగును. అనగా శ్రోత్రము ఒక్క శబ్దము వినుటకే

కారణమగును. కాని ఇంకొక దానికి కారణము కాజాలదు కనుక అసాధారణ కారణము. స్పర్శ, రూప, రస, గంధములు ఒక్కొక్కటి గ్రహించును. కనుక బాహ్యేంద్రియములు అసాధారణ కారణములు అంటారు. అంతఃకరణమనగా లోపలయుండే అసాధారణ కారణమగును. ఆ అంతఃకరణము వృత్తి భేదమువల్ల 1. మనస్సు, 2. బుద్ధి, 3. చిత్తము, 4. అహంకారము అని నాలుగు రకములుగా అయినది. సంకల్ప, వికల్ప రూపమైనవృత్తి మనస్సు. దీనినే సంశయమనికూడ అంటారు. ఆ సంశయముగల దానిని ఆలోచించి ఒక నిశ్చయమునకు వచ్చును; దానిని బుద్ధి అందురు. చిత్తము అనగా స్మరణాత్మకమైన వృత్తి. ఇదివరలో తెలిసిన విషయమును తరువాత కలిగినచో స్మృతి అగును. మొదటిది అనుభవము. రెండవది స్మృతి అగును. ఇది చిత్తవృత్తి. అభిమానాత్మకమైన వృత్తి అహంకారము, అంటే అనాత్మయగు దేహేంద్రియాదుల యందు గల ఆత్మబుద్ధియే అహంకారము. ఆత్మవేరు దేహము వేరు. స్థూల శరీరము లావుగాయున్న, పొడవుగా, లేక పొట్టిగాయున్నను, వెళుతున్నా, వస్తున్నాననేవనియు, శరీరము చేయుచుండగా వాటిని ఆత్మయందు ఆరోపించుకొని నేను లావు, నేను పొడవు, పొట్టి, బ్రాహ్మణాది జాతులని చెప్పుకొందుముగా, అది అంతా అనాత్మ బుద్ధియే. రజ్జు సర్ప భ్రాంతివలెనే సర్పముగాని రజ్జువునందు సర్పమనుబుద్ధిని అధ్యాస అజ్ఞానం అని రకరకములుగా చెప్పెదరు. శరీరమునందు ఇంద్రియముల యందుకూడ ఆత్మబుద్ధి ఉంటున్నది. వినేది కనేది. అంతా నేను అనుకొనేది అంతా అధ్యాస, ఇదే అహంకారము. అంటే అనాత్మయందు ఆత్మభావనే అహంకారము అంతఃకరణ అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారమని ఒక్క దానినే ఆయావృత్తులను బట్టి నాలుగు రకములుగా అసాధారణ కారణమని అన్నారు. సాధారణమనగా అనేకమునకు

ఉపయోగపడే వాటిని సాధారణ కారణమంటారు. అనగా అవి ఈశ్వరుడు, దిక్కులు మొదలైనవి. ప్రకాశావరణము అంటే బుద్ధి. అపంచీకృత పంచభూతములయొక్క సమష్టియందు అయిదు భూతములలోయున్న సత్వమును తీసికొన్నచో ఆకాశ సత్వము వల్ల శ్రోత్రము, వాయుసత్వము వలన త్వగింద్రియము, అగ్ని సత్వమువల్ల నేత్రము, జలసత్వము వలన జిహ్వ అనగా రసనేంద్రియము పృథ్వీ సత్వమువల్ల ఘ్రాణము పుట్టినవి. ఈ అయిదు భూతముల సమిష్టి సత్వమునుండి అంతఃకరణ పుట్టినది. వ్యష్టి సత్వము నుండి జ్ఞానేంద్రియాదులు పుట్టినవి బైటకు పోకుండా లోపలనే నిలచిపోయినచో మహా విదేహానామకమగును. బుద్ధియొక్క ఆవరణ నశించిపోవును.

లక్ష్యమునందు నిలుపుట ధ్యానము. ధ్యానావస్థలో బుద్ధి కొంతసేపు లక్ష్యములో నిలచి మరల బైటకు పోవును. మరల కొంతసేపటికి అయ్యో పోయినదని తెలిసివచ్చి మరల నిలుపుటయు ఈలాగున పోతూవస్తూయుంటుంది. చిరకాలము ఈ ధ్యానమును అనుష్ఠించుచు పోగా ఇక ఇతర విషయములమీదకు పోకుండా యున్నచో అది సమాధి. అనగా ధ్యానములో విక్షేపము కలిగినచో ధ్యానము. అలా విక్షేపము లేక పోవడమే సమాధి. అంటే ధ్యానముయొక్క పరిపక్వావస్థయే సమాధి. సమాధికి, ధ్యానమునకు ఇదే తేడా, యోగిబుద్ధిలోగల ఆవరణ పురుషుని ధ్యానము చేసినప్పుడు పోవును. పురుషుని ధ్యానము చేయునపుడు ఆ ధ్యానము సమాధి వరకు శీలించవలెను. ఒక్కొక్క సిద్ధి తనకు లభించవలె నంటే ఆయాచోట్ల చెప్పిన దానియందు లక్ష్యమును ఉంచి ఆ లక్ష్యము ధారణ, ధ్యాన, సమాధులను పొందవలెను. అప్పుడే ఆ సిద్ధి కలుగును.

30-8-1974 శుక్రవారము

44 సూ॥ స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వ సంయ
మాత్ భూతజయః॥

పంచభూతములు సూక్ష్మముగాయుండును. కాని పృథ్విలో మొత్తము ఐదు ఉన్నవి అనగా 1. ఆకాశము, 2. వాయువు, 3. అగ్ని, 4. జలము, 5. పృద్వి గో ఇవి స్థూలముగా కూడియుండును. పృద్విలో పంచభూతములు 5 కు సంబంధించిన ధర్మములు 5 ఉన్నవి కాఠిన్యము పృథ్వి స్నేహము జలముది. వుష్ణము అగ్నిది. స్పర్శ వాయువుది శబ్దము ఆకాశముది.

సూక్ష్మభూతములను పంచతన్మాత్రలని, అపంచీకృత పంచభూతములని అంటారు. ప్రత్యేకముగా ఆకాశముమాత్రము, వాయువు మాత్రము, అగ్నిమాత్రము, జలము మాత్రము, పృథ్విమాత్రము ఉండును. ఇవి ఒక దానిలో ఒకటి కలియవు. అందుకే సూక్ష్మముని అన్నారు. ఇక అన్వయమును చెప్పుచున్నారు. సత్వ, రజో, తమో గుణములు పంచభూతములలో కూడియుండును. మనయందు కూడ ఆ మూడు గుణములు యున్నవి. అర్థవత్వమనగా భోగము అంటే అనుభవించుట. అపవర్గమంటే మోక్షము, స్థూలస్వరూప, సూక్ష్మ స్వరూప, అన్వయ స్వరూప, అర్థవత్వ స్వరూపములయందు సంయమము చేసినచో అనగా ధారణ, ధ్యాన, సమాధులు. పై చెప్పిన ఒక్కొక్క దానియందు చలించినచో, సిద్ధిని సంపాదించినచో, ఆ యోగికి సంకల్పానుసారముగా ఆయా సిద్ధులు కలుగును. అంటే యోగికి ఈ సిద్ధులు కలిగినచో మనము నీటిలో మునిగి పైకి లేచినట్లు యోగి భూమిలో మునిగి లేవగలుగును. గోవు ఈనినపుడు ఆ దూడ ఎటుపోయినా ఆవు అట్లుపోవును. దూడ కొంత ఎదిగిన తర్వాత ఆవు ఎటు పోయినా దూడ అటుపోవును. ఈ సిద్ధులు ఆ యోగికి వశమైన ఆ యోగికి సంకల్పానుసారముగా పంచభూతములు వశమగును. అంటే పంచభూతములు జయించును.

45 సూ॥ తతోఽణిమాది ప్రాదుర్భావః కాయసంపత్తద్ధర్మా
నభిఘాతశ్చ।

పంచభూతముల జయము వలన అణిమాది సిద్ధులు ఎనిమిది ఆయనకు కలుగును. యింక కాయ సంపదకూడ కలుగును. తద్ధర్మానభిఘాతం అనగా పంచభూతముల ధర్మముల చేత ఆ యోగి బద్ధుడు కాజాలడు. అంటే అగ్ని చేత కాలడు, నీటి చేత తడవడు. ఆ యోగి తన యిష్టానుసారము కాగలడు. అనగా కావలెనంటే పరమాణురూపము అనగా బహుచిన్న శరీరరూపమును. మహిమ అనగా పెద్ద పర్వతమంత శరీరముగుట. లఘిమ అంటే దూది పింజ మంత మాత్ర తేలిక శరీరము కలుగుట. గరిమ అనగా మేరు పర్వతమంత బరువు కాగలడు. ప్రాప్తి అనగా భూమిమీద నుండి చంద్రుని తన వ్రేళ్ళతో తాకును. అనగా అంత పొడవగును ప్రాకామ్యమనగా తాను ఏది కావలెనని సంకల్పించిన అది అలా అగును. వశిత్వమనగా ఈ ప్రాణులను తన యిష్టప్రకారము నియమించును. ఈశత్వమనగా అవసరమైనచో తన సంకల్ప మాత్రము చేత కొందరు వ్యక్తులను సృష్టించును. విశ్వామిత్రుడు సృష్టించలేదా? మరి యీలు బ్రహ్మసృష్టి. మిరపకాయలు విశ్వామిత్రుని సృష్టి, అలా బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేసెను. విశ్వామిత్రుడు.

46 సూ॥ రూపలావణ్య బలవజ్రసంహనన త్వాని కాయసంపత్॥

రూపము, లావణ్యము, బలము, వజ్రసంహనత్వము అని ఈ నాలుగు కాయ సంపత్తు. రూపమనగా నేత్రములకు యింపుగా యుండేది లావణ్యమనగా సమస్త అవయవములయందు యుండే సౌందర్యము. వీర్యమనగా బలసామర్థ్యము. వజ్ర సంహనత్వాన్ని వజ్రమునకువలె అవయవములు గట్టిగా, దట్టముగా యుండును. ఆ యోగికి అట్టివారి అవయవములు దూరదూరముగా యుండక దగ్గర దగ్గరగా యుండుటవలన వజ్రమునకువలె అంత బలముగా యుం

మును. ఇది రెండవ ప్రయోజనము. అంటే పంచభూతములను జయించుట వలన కలుగును. అనగా అట్టియోగికి పంచభూతముల వలన ప్రతిబంధములు కలుగవు.

47 సూ॥ గ్రహణస్వరూపాస్మితాన్వయార్థవత్త్వ
సంయమాదింద్రియ జయః ।

భా॥ ఇంద్రియములకు 5 రకముల రూపములున్నవి. ఈ ఐదు రూపముల యందు సంయమము చేసిన యోగికి యింద్రియజయము కలుగును. గ్రహణము, స్వరూపము, అస్మిత, అన్వయము, అర్థవత్త్వము. ఇవి 5 యింద్రియములకు రూపములగును. శ్రోత్రము శబ్దమును గ్రహించునపుడు దానితో పాటు మనస్సుకూడ కలియును. శ్రోత్రేంద్రియముతో పాటు అంతఃకరణ కూడ శబ్దాకారమును గ్రహించును. కనుక గ్రహణము అగును. స్పర్శతో అంతఃకరణ కలిసిననే అది చల్లన, వేడియని తెలియును. అంటే ఆవృత్తి తదాకారముగా పరిణమించినపుడే ఆయారూపములను గ్రహించగలము అస్మిత్ అనగా సాత్విక అహంకారము. మన అంతఃకరణము గుణముల యొక్క కార్యము కనుక అంతఃకరణము సత్వ రజస్తమో గుణములు కలిగియుంటుంది. ఇది అన్వయత్వము. భోగమేదో, అపవర్గమేదో తెలిసికొనేది అర్థవత్త్వము అగును. ఈ అయిదున్ను ఒక్కొక్క దానియందు ధారణ, ధ్యాన, సమాధులు చక్కగా శీలించుటవల్ల ఇంద్రియ జయము కలుగును.

48 సూ॥ తతో మనోజవత్వం వికరణ భావః ప్రధానజయశ్చ ।

భా॥ అలా ఇంద్రియ జయమువల్ల 3 సిద్ధులు కలుగును. మనో జవ్యత్వం అనగా ఈ శరీరమునకు మనస్సువలె మిక్కిలి గమనము కలుగును. అంటే మనస్సు ఎంత వేగముగా వెళ్ళునో, శరీరము కూడ అంత వేగముగా వెళ్లుట. మనోజవ్యత్వం 2) వికరణ భావం అనగా మనము కాశి, రామేశ్వరములలో ఈ శరీరముతో వెళ్ళి

చూడగలము కాని యింద్రియజయము కలిగినచో ఈ శరీర
ఇక్కడనే వదలి సూక్ష్మశరీరము కాశీకి వెళ్ళి అక్కడ జరిగేవ
అనగా శబ్దము వినుట, నేత్రము చూచుట, మొదలైనవి చూ
వచ్చును. 3) అనగా ప్రధాన జయము అనగా ప్రకృతి కార్య
మహత్తు కార్యము అహంకారము.

దీని కార్యము పంచతన్మాత్రలు వీటి కార్యము ఇంద్రి
ములు, ప్రధానమునకు కార్యము మహత్తు. ఇంద్రియ జయ
గల యోగికి ప్రధానము మొదలు వాటి కార్యములు 5 బా
కరణాలు వీటియందు సంయమము చేస్తే 45 వ సూత్రములో గ
ఈ 48 సూత్రములోగల మూడు భూతములను మనోజవ్వత్వ
వికరణభావము. ప్రధానజయము జయించుటవల్ల 3 సిద్ధులు,
ద్రియ జయమువల్ల 3 సిద్ధులు ఈ 6 కలసి మధుప్రతీకములని వ్య
హరింతురు. తేనెతెట్టెలోని తేనెను, ఏవైపున ఏమాత్రము తే
తీసినను ఎట్లు మధురముగా యుండునో అలాగే ఈ 6 రకముల సిద్ధ
లలో ఏదైనాసరే మధువువలె ఆనందముగా యుండును. ఈ సిద్ధుల
ఎప్పుడు కలుగునంటె సంప్రజ్ఞాత సమాధి బాగా శీలించుచు పోయి
నచో ప్రకృతి పురుషవివేకము కలుగును. ఐతే ఆ వివేకఖ్యాతి క
గకముందే ఈ సిద్ధులు కలుగుచుండును. ఇవి కలుగుటకు కారణము
యింద్రియములయందు, భూతములయందు శ్రద్ధతో సంయమము
చేసినచో కలుగునని యోగి గ్రహించుకొనియుండవలెను. అన్నిటి
కంటె ముఖ్యము శ్రద్ధ. గీత 17 అధ్యా॥ ఆఖరు శ్లోకం "అశ్రద్ధయా
హుతం దత్తం" అనగా అశ్రద్ధతో చేయబడిన హోమము, దానము
తపస్సు మొ॥ వన్నియు ఫలరహితమైనవి అగును. శ్రద్ధ అనగా
గురుశాస్త్ర వాక్యములయందు నమ్మాటికి నిశ్చయము అ
బుద్ధినే శ్రద్ధ అందురు. ఫలము యివ్వకపోవడము. అంటే ఈ లోక
ములోన పరలోకములోన అంటే అశ్రద్ధతో చేసినవి 2 లోకములం

లోను ఫలమును యివ్వవు వ్యర్థమే అగును. వివేకఖ్యాతి కలుగక ముందుగా కలిగే ముఖ్యఫలములను, చెప్పియున్నవి. ఇక చెప్పబోయేవి అముఖ్యఫలములు. వాటిని చెప్పుచున్నాము.

49 సూ॥ సత్వపురుషాన్యతా ఖ్యాతి మాత్రస్య
సర్వభావాధి ష్ఠాతృత్వం సర్వజ్ఞా తృత్వంచ ॥

భా॥ సత్వము అంటే పురుషుడు, బుద్ధి అంటే ప్రకృతి. ప్రకృతి వేరు, పురుషుడు వేరు అను బుద్ధి లేనంతవరకు, అజ్ఞానిగా యుండును. యోగము అభ్యసించుటవలన బుద్ధి శుద్ధమై సిద్ధులు కలిగి బాగా ఆచరించుటవల్ల ప్రకృతి వేరు పురుషుడు వేరు అను జ్ఞానము కలుగును. అది కలిగిన యోగికి ఈ లోకములోగల సమస్త వస్తువులయందు తనకు అధికారము కలుగును. సర్వజ్ఞత్వము కూడ లభించును. ప్రకృతి పురుషవివేకమువల్ల మోక్షము లభించును. అది సరి. ఇంకా ఈ ఫలములు ఈ సిద్ధులు కూడ కలుగును. సర్వవస్తువులయందు ఆధిపత్యము సర్వజ్ఞత్వము కలుగును. ఈ రీతిగా అనుష్ఠానము చేయు యోగికి రజస్తమోగుణములు బాగానశించినందున ప్రకృతి పురుషవివేకము కలుగుతుంది.

వివేకఖ్యాతియందు నిష్ఠ కలిగినచో శాంత అంటే భూత కాలము అవ్యపదేశ్య అంటే ఆగామియు, ఉదిత అనగా వర్తమాన కాలము, ధర్మములయందు సంయమమువలన ఆ యోగికి వివేక జన్యజ్ఞానము అనగా సర్వభావాధిష్ఠాతృత్వము, సర్వజ్ఞాతృత్వము అనువానిచే యోగికి శోకము నశించును.

ఈ సిద్ధులను విశోకములని అందురు. ఇపుడు ప్రకృతి పురుష వివేకము కలిగినందున శోకము నశించిపోయినది. ప్రకృతి పురుష వివేకము కలిగినది. వీని ముఖ్యప్రయోజనము కైవల్య ప్రయోజనము. ఇది కలిగే ముందు 6 సిద్ధులు కలుగును. కలిగిన తర్వాత 2 సిద్ధులు కలుగును. ఈ ఎనిమిది అవాంతర ఫలములు.

1-9-1974 ఆదివారము

50 సూ॥ తద్వైరాగ్యాదపి దోషబీజ క్షయే కైవల్యమ్॥

భా॥ వివేకఖ్యాతిని గురించి ప్రయత్నించు యోగికి ముఖ్యమైన సిద్ధి ఏదనగా కైవల్యము. ఇదే మోక్షము. దీని గురించి చెప్పు చున్నారు. వివేకఖ్యాతిని సంపాదించుటకు అపరవైరాగ్యము, పర వైరాగ్యము అవసరము. అపరవైరాగ్యమువల్ల సంప్రజ్ఞాతసమాధి సిద్ధించును. అప్పుడు రాగద్వేషాదులు నశించును. అప్పుడు ప్రకృతి పురుష వివేకము స్ఫుటముగా కలుగును. కైవల్యము కావలె నంటే ప్రకృతి వేరు, పురుషుడు వేరు అను జ్ఞానమును సంపాదించు కొనవలెను. అదే మోక్షము.

51 సూ॥ స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం
పునరనిష్ట ప్రసంగాత్॥

2 వ యోగి స్వర్గాదిస్థానము కలిగిన యింద్రాది దేవతలచేత ఉపనిమంత్రణం చేయుటకు అర్హుడై యున్నాడు. ఓ యోగీ! ఇక్కడ కూర్చొండి ఈ స్వర్గసుఖాదులలో రమించి ఈ కన్యక చాలా యింపైనది. ఈ భోగములు దివ్యమైనవి. ఇదిగో రసాయనము వీనిని తిన్నచో ముసలితనము, మృత్యువు లేదు. ఇది విమానము. ఇది మానము ఎటు వెళ్ళమంటే అటు వెళ్ళును. కనుక మాలోకము నకు రమ్మని యింద్రాదులు ప్రలోభ పెట్టెదరు. అప్పుడు ఆ యోగి ఓహో యివి అన్నియు దివ్యమైనవి కనుక అనుభవించవలె నను ప్రీతి యుండరాదు. ఓహో నేను ఎంత గొప్పవాడిని నన్ను యింద్రాది దేవతలు ఆహ్వానిస్తున్నారని గర్వము పొందరాదు. అంటే అహంకారము యుండరాదు. దోషములను తలంచవలెను. అవి ఏవి అనగా మిక్కిలి భయంకరమైన సంసారమును అగ్నియందు దుఃఖములను వాటిచేత ఉడుకుచున్నాను పంచక్లేశములను చీకటి పోవుటకై యోగము అను దీపమును సంపాదించుకొన్నాను. విష

యములను వాయువులు యోగమునకు శత్రువులు ఇవి విషవాయువులు దీపము వాయువు చేత ఆరిపోవునట్లు యోగమనే దీపమును విషయములను వాయువులు వీచినచో యోగమనే దీపము ఆరిపోవును. కనుక నేను ఇంద్రాదులచే కొనిపోయి యీ సంస్కారమనే అగ్నిలో మరల ఎట్లు కాలిపోయేది. ఆ శబ్ద, స్పర్శాదులను నవి స్వప్నముతో సమానమైనవి. స్వప్నములో సుఖములు ఐశ్వర్యాదులు కలుగును. లేనిచో అవి నిజమా అలాగే ఇవికూడ శాశ్వతములు కావు క్షణికములు కనుక ఆ యోగి ఆ విషయములకు స్వస్తి కలుగును గాక. యోగిసాధనలో కొంచము ఉన్నత స్థితికి వెళ్ళినచో యిట్టి విఘ్నములు వచ్చును. యోగి అయినవాడు వాటిజోలికిపోక తన సాధనయందు నిమగ్నుడై సమాధిని సాధించవలెను. ఒకవేళ యింద్రాదులు తమ లోకమునకు రమ్మన్నప్పుడు ఆసక్తిగాని అహంకారముగాని కలిగినచో యోగభ్రష్టుడగును. అనగా విషయసుఖములయందు ఆసక్తి కలుగును. అనగా జనన మరణ సంసార సాగరములోపడి పుట్టుట, చచ్చుట అనేది జరుగుచుండును.

"సుఖమల్పం బహుక్లేశః" వ్యవసాయము చేయువారిని చూడండి. 6 నెలలు ఎండనక, వాననక నానాకష్టములుపడి సంపాదించిన దానిని భోజనము చేయునపుడు ఆ నాలుకమీద ఉన్నంత సేపేకదా రుచి. అది దాటిన ఏమీ లేదు. నాలుకమీద పెట్టక ముందూ ఏమీ లేదు. కనుక సుఖము స్వల్పము. కష్టము ఎక్కువ అలాకాక బ్రహ్మను సంధానము చేయు యోగి వాటియందు ఆశ వదలినచో బ్రహ్మ ప్రాప్తిని పొందును. ఎవరు స్వర్గభోగములయందు ఆశవదలి సాధనయందు గట్టి పట్టుదల గలిగి సాధనను శీలింతురో వారు క్రమముగా జ్ఞానము కలిగి మోక్షమును పొందెదరు.

3-9-1974 మంగళవారము.

52 సూ॥ క్షణ తత్క్రమయోః సంయమాద్వివేకజంజ్ఞానమ్॥

భా॥ దేవలోకములో యున్నవారు పిలిచిననే యోగ విఘ్నము కలుగునని అనుకోవద్దు. ఈ లోకములో కూడ యోగిని అనగా కొంత ఉన్నతస్థానమును పొందుచున్నవారని గౌరవించుట, సన్మానాదులు చేయుట చేయుచుందురు. అప్పుడు నాకు గనుక ఈ విధముగా గౌరవ మర్యాదలు చేయుచున్నారని అహంకారము కలిగినదా, ఇక చూడండి, అట్టివాడు విఘ్నములో పడిపోవును. చైతన్యమునందు సంయమము చేసినచో పురుషజ్ఞానము కలుగునని చెప్పిరి. కాని యిప్పుడు అన్యమునందు సంయమము చేసినను పురుషజ్ఞానము కలుగునని చెప్పుచున్నారు. అన్యమనగా ఏమిటనిన క్షణముయందుగాని, క్షణక్రమముయందుగాని, క్షణకాలము గాని యోగమతములో అన్ని పదార్థములు సత్యమే అలాగే కాలము కూడ సత్యమే. భేదించుటకు వీలుగాని ఆఖరు కాలమును క్షణం అంటారు. ముహూర్తము మొదలగు కాలములు అనగా కొన్ని క్షణములు కలిస్తే ఒక ముహూర్తమగును. ఇది మాత్రము సత్యము కాదు. క్షణము మాత్రమే సత్యము. విభజించుటకు వీలుకాని కాలమును క్షణము అంటారు. అట్టి క్షణమునందు సంయమము చేసినను ప్రకృతి పురుష వివేకమువలన కలిగే జ్ఞానము కలుగును. క్షణక్రమ మనగా ఏమంటే పూర్వక్షణము, ఉత్తరక్షణము అని మనము అనుకొంటామే అది. ఆ క్షణక్రమమునందు సంయమము చేసిన జ్ఞానము కలుగును. ఒకేసారి ఆకాశము మొదలు ప్రకృతి పురుష వివేకము వరకు జ్ఞానము కలిగిపోతుంది.

53 సూ॥ జాతిలక్షణ దేశైరన్యతా నవచ్ఛేదా
త్తుల్యయోస్తతః ప్రతిపత్తిః॥

భా॥ జాతియు, లక్షణము, దేశము చేత భేదములను తెలుసుకొందుము, కొన్నిచోట్ల అలా తెలిసికొనుటకు వీలుండదు. కాని అటువంటప్పుడు వివేక జ్ఞానముతో తెలిసికొనవచ్చును.

54 సూ॥ తారకం సర్వవిషయం సర్వథా విష
యమక్రమం చేతి వివేకజం జ్ఞానమ్।

భా॥ ప్రకృతి పురుష వివేకజ, జ్ఞానమును తారకము అంటారు. ప్రకృతి పురుష వివేకజ. జ్ఞానము కలిగిన వానికి లోకములోగల సమస్త విషయముల జ్ఞానము కలుగును. తారకము అనగా సంసార సాగరమునుండి తరింపజేయునది. అదే ప్రకృతి పురుష వివేకము. ప్రకృతి పురుష వివేకజ జ్ఞానము వలన సూక్ష్మజ్ఞానము, పరమాణు జ్ఞానము కలుగును. అట్టివాడు గోడ అవతల ఏమియున్నదో చెప్పును. ఇందే కాదు కాశీలో యిపుడు ఏమిజరుగుచున్నదో అది చెప్పగలుగును. ఇవి అన్నియు క్రమముగా తెలిసికొనునా అంటే క్రమము అవసరము లేకుండానే ఒకేసారి. అన్ని పదార్థముల జ్ఞానము కావలెను అని అనుకొన్నచో ఒకేసారి అన్నియు స్ఫురించును. చేతిలోని ఉసిరికకాయను మనము చూచునట్లు అన్ని పదార్థముల జ్ఞానములు ఒకేసారి కలుగును. ఇవి ప్రకృతి పురుష వివేకజ్ఞానము కలిగిన వానికే కలుగును. ఐనా ప్రకృతి పురుష వివేకము కొరకు సాధన చేయు సాధకులకు కూడ కలుగుచుండును.

55 సూ॥ సత్వపురుషయో శ్శుద్ధి సామ్యే కైవల్యమితి।

భా॥ ప్రకృతి పురుష వివేకజ్ఞానమునకు ముఖ్యఫలము కైవల్యము ఆ కైవల్యము ఎప్పుడు కలుగునంటే ఆ కైవల్యము కొరకు సాధన చేయునపుడు కైవల్యము లభించక ముందుగా యివి కలుగుచుండును. సత్వము అంటే బుద్ధి. పురుషుడు అంటే చైతన్యము. పురుషుడు ఎప్పుడూ పరిశుద్ధుడే. అపరిశుద్ధము లేనేలేదు. బుద్ధిలోనే అపరిశుద్ధము ఏర్పడును. దానిని బాగు చేసుకొనవలెను. పురుషుడు బుద్ధిలో ప్రతిబింబించును. సత్వగుణమునుండి బుద్ధి పుట్టినది. దానికి ప్రతిబింబ గ్రహణము యుంటుంది. బుద్ధిలోయున్న మాలిన్యము ప్రతిబింబములో పడును. బుద్ధిలోని దోషములు ప్రతిబింబములో

గోచరించును. అప్పుడు బుద్ధి వేరు, పురుషుడు వేరు యని విచార లేనందున బుద్ధిలోగల మాలిన్యము నాదే అని అనుకొంటాము అద్దములోయున్న దోషములు మన ముఖములో కనుపించును.

ఉపాది = అద్దం, బింబం = ముఖం, ప్రతిబింబం అద్దంలో
కనుపించున

ఉపాది = బుద్ధి, బింబం = ఆత్మ, ప్రతిబింబం బుద్ధిలో గోచరించును

ఉపాది అనేది ప్రతిబింబ పక్షపాతి అన్నారు అంటే బింబము నందు లేనివి ప్రతిబింబములో కనుపించును. అనగా ఒక తల్లి నలుగురు పిల్లలుంటే ఆమెకు చిన్నవానియందు పక్షపాతము కలి యుంటుంది. ఆ రీతిగా ఉపాది ప్రతిబింబనందు పక్షపాతి అనగా తల్లి అద్దము — ఉపాది బింబం. అనగా ముఖము ప్రతిబింబము అనగా అద్దములో కనుపించేది. పురుషుడు బింబము, వాని ప్రతిబింబము బుద్ధిలో పడినది. అప్పుడు బుద్ధిలోగలదోషము ప్రతిబింబములో కనుపించును. ఐతే అప్పుడు వివేకము లేక ఆ దోషములన్నియు నావేయని అనుకొ నును. అందరికి దుఃఖములు, కష్టములు, వచ్చుచున్నవంటే ఇలాగే వచ్చుచున్నవి. బింబము అనగా ఆత్మకు ఎప్పుడు దుఃఖము దోషము లేదు. కాని ఇప్పుడు చేసికోవలసినది తనకు బుద్ధికిగల దోష ములను తెలిసికొనుటయే, తనకు ఎప్పుడు దోషము లేదు, ఆకా శమునకు ఏదైనా పూయగలమా? లేదుగదా! అలాగే ఆకా శముకంటె సూక్ష్మమైనది ఆత్మ గనుక ఆకాశమునకే పూయు లేనిది యింకా సూక్ష్మమయిన ఆత్మకు ఏమి అంటుకొనును! అంటు కొనదు, ఆకాశమునకు సువాసనగాని, దుర్వాసనగాని ఎక్కదు. భూమిమీద మలమూత్రాదుల మీద సూర్యకిరణములు పడినప్ప టికిని ఆ దుర్వాసనగాని అట్లే సువాసనగాని సూర్యునకు ఎక్కునా? లేదు. ఇపుడు విషయము తెలిసినదికదా! మీకు ఆత్మస్వరూ పులు, ఉన్నవన్నియు బుద్ధికే. ప్రతిబింబమునకు కూడ దోషములు

అంటుకొనవు. పురుషుని బింబము బుద్ధిలోపడినచో బుద్ధిలోయున్న దోషములు ప్రతిబింబములో గోచరించును. నిజమునకు ప్రతిబింబమునకు గూడ ఆదోషములు అంటవు. ఇది పరోక్షజ్ఞానము. ఇది గురువువల్ల శాస్త్రము వినడమువల్ల కలిగే జ్ఞానము. ఇదే పరోక్షము కొన్ని సాధనలు చేసినచో అపరోక్ష సాక్షాత్కారము అగును. ఇది శ్రవణము. దానిని మననము చేసి నిధిధ్యాసగా మార్చుకొన్నచో అపుడు అనుభూతి కలుగును. ఇదే దృఢజ్ఞానము అప్పుడు ఇది నాది కాదు. అనే జ్ఞానము నిలచిపోవును. పురుషుడు ఎప్పుడూ పరిశుద్ధుడే. ఈ పురుషుడు ఎంత పరిశుద్ధుడో బుద్ధికూడ అంత పరిశుద్ధమైననే జ్ఞానము కలుగును. ఏనాటికైనా బుద్ధికే జ్ఞానము కలుగవలెను. బుద్ధితోగదా పురుషుడు పరిశుద్ధుడని తెలిసికొంటున్నాము. ఆ బుద్ధిలో మాలిన్యము యున్నది. కనుక ఆ పురుషుడు ఎంత శుద్ధుడో బుద్ధికికూడ అంత శుద్ధము కావలెను. అంతవరకు కైవల్యము లేదు. శ్రద్ధయున్ననే పరోక్షజ్ఞానము కలుగును. ముందుగా పరోక్షజ్ఞానము కలిగిననే ఆతర్వాత అపరోక్షజ్ఞానము కలుగును. ఈ చెప్పేది ముమ్మాటికి సత్యమని నమ్మనదే శ్రద్ధ. అలాగాక ఈ చెప్పేది నిజమా? కాదా? అనుకొనేది సంశయము "సంశయాత్మా వినశ్యతి" అనగా సంశయము కలవాడు నశించిపోయెదరని గీతలో చెప్పబడియున్నది. బుద్ధికి శుద్ధి అంటే ఏమిటనగా రజోగుణ, తమోగుణ మాలిన్యము పూర్తిగా పోయిననే, ప్రకృతి పురుష వివేకజ్ఞానము కలిగిననే. ఇతర వృత్తులు ఏమియు ఉండకూడదు. ఒక్క బ్రహ్మవృత్తి మాత్రమే యుండవలెను. పురుష వృత్తి మాత్రమే యుండవలెను. ప్రకృతి వృత్తి ఒక్కటిగూడ యుండకూడదు. అప్పుడు బుద్ధిశుద్ధమైనట్లు.

పురుషుడు ఎప్పుడు శుద్ధుడే ఐనా బుద్ధిలోగల మాలిన్యము నాది అనుకొనుటయే కల్పితము. ఆ కల్పితము పోయినచో పురు

షుడు శుద్ధుడనే మాటకు అర్థము అప్పుడు బుద్ధిలో రజోగుణ, తమోగుణములు పూర్తిగా పోయినవి. నేను అనేది పోవలెనంటే పరవైరాగ్యము గలిగి అసంప్రజ్ఞాత సమాధి లభించినచో సకల వృత్తులు నివృత్తియగును. ఇక వృత్తి అనేదే లేదు. తాను మాత్రమే యుండును. సవికల్ప సమాధిలో త్రిపుటియుండును. అప్పుడు వికల్పముకూడ యుండును. ఏకాగ్రత యున్నను వికల్పముకూడా యుండును. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయమును త్రిపుటి యుండును.

ధ్యాతృ, ధ్యాన, ధ్యేయమును ఏకాగ్రతయు ఉన్నది. త్రిపుటి పోయి ఉన్నది ఒక్కటే, అదే నేను అను ఏకాగ్రత. ఇది బ్రహ్మాకారముగా యున్నది. ఇది నిర్వికల్పసమాధి. ఇదికూడ పోయినచో అనగా దీనిని చిరకాలము అభ్యసించినచో అది కూడ పోవును. చిల్లగింజ అనగా "కతక రేణువత్" నీటిలో బురద, చిల్లగింజ గంధము కలుపగా ముందు నీటిపైనుండి బురదను క్రిందికి పంపి తర్వాత తానుకూడ క్రిందికి పోవును, అలాగే నిర్వికల్ప సమాధి చిరకాలము అభ్యసించుటచే "అహంబ్రహ్మాస్మి" అను బుద్ధికూడ పోవును. ఇక బుద్ధి లేదు. బుద్ధి క్రింద పడిపోవును. పరవైరాగ్యము వల్లకూడ బుద్ధి క్రిందపడిపోవును. కేవలము చైతన్య మాత్రము యుండును. కేవలము స్వరూప ప్రతిష్ఠ అదే.

# కైవల్య పాదః

**4-9-1974 బుధవారం**

మొదటి పాదములో సమాధిని గురించి బోధించినందున దానికి సమాధి పాదము యనిపేరు. ఆ సమాధికి కావలసిన సాధనలు విశేషముగా చెప్పబడియున్నందున రెండవ పాదమును సాధన పాదము అన్నారు. ఆ సాధనలు చేసి సమాధిని సిద్ధింపజేసుకొన్నచో ఆ విభూతులను ప్రధానముగా చేసుకొని ౩వ పాదమును

విభూతి పాదమన్నారు. ఈ నాలుగు పాదములను కైవల్య పాద మన్నారు. అంటే కేవలము విభూతుల ప్రధానము కొరకు యోగ మును ప్రారంభించలేదు. విభూతులే ప్రయోజనములు కావు. యోగమునకు ముఖ్య ప్రయోజనము కైవల్యము. కనుక దానిని విశదముగా బోధించ దలచినందున దీనికి కైవల్యపాదము అని పేరు పెట్టిరి. దీనిలో కూడ 5 సిద్ధులు తెలిపి ఆపైన కైవల్యమునుగురించి చెప్పెదరు.

1 సూ॥ జన్మౌషధి మంత్ర తపస్సమాధి జాస్సిద్ధయః ।

భా॥ జన్మవలన, ఓషధి వలన, మంత్రమువలన, తపస్సువలన, సమాధివలన సిద్ధులు కలుగును. జన్మతోనే కలిగే సిద్ధులు ఏవి అనగా, పక్షులు పుట్టిన కొద్దిరోజులకే ఆకాశములో ఎగిరిపోవును, ఆ ఎగురుట ఎవరివద్దా నేర్చుకోలేదు. ఇవి పక్షులకు జన్మతః వచ్చి నసిద్ధి కపిలాదులకు జన్మించినంతనే జ్ఞానాదులు సిద్ధించెను. ఓష ధులవల్ల కొన్ని సిద్ధులు కలుగును. మాండవ్యాదులు కొన్ని కల్ప ములు ఉపయోగించుటవల్ల జరాది వర్జితులైరి. ఓషధుల ద్వారా కాయసిద్ధి సంపాదించుకొన్న వారికి రోగములు ముసలితనము రాదు. ఎప్పుడూ యవ్వనములోనే యుంటారు. మూలికలలో రక రకముల ప్రభావములున్నవి. లక్ష్మణుడు మూర్ఛపడినపుడు సంజీవి వల్లకదా లేచినాడు. ఆ మూలిక వల్ల వానరులంతా బ్రతికిరి. రాక్షసులలో ఒక్కరుకూడ బ్రతకలేదు. అంటే రాక్షసులు ఏరోజు కారోజు చనిపోయిన వారిని సముద్రములో పడవేసేవారట వాన రులను ప్రక్కలకే లాగివేసేవారేమో మరి. అఖరుకు వారంతా బ్రతికిరి మరి బాగా జపము చేస్తే అణిమాది సిద్ధులుకూడ కలుగును. నారదునకు ఆకాశగమనము దివ్యమంత్ర జపము వల్లనే కలిగినదట. దివ్యమంత్ర జపము సిద్ధులకేగాక నైష్కామ్యముగా చేసిన చో చిత్త శుద్ధి కలిగి జ్ఞానము కలుగును సిద్ధులు చిత్తశుద్ధికలిగిన తర్వాతనే

కలుగును. తపస్సువల్ల కొన్ని సిద్ధులు కలుగును. అంటే శరీరముతో చేయు పుణ్యకర్మలను ఈశ్వరార్పణముగా చేస్తూ వాక్కును సత్యములోను, మంత్రజపములోను, స్వాధ్యాయములోను ఉపయోగించుట వాక్కు తపస్సు. మనసులో ఇతరుల విషయమై చెడ్డ సంకల్పము లేకుండ ఉండవలెను. ఎదుటివాడు పాడు కావలెనని ఎవడు సంకల్పించునో అపుడు మొదటివాడు పాడైపోయినట్లే తలంచండి. ఆతర్వాత ఎప్పుడో వారి పాడో, బాగో కాని తానుమాత్రము ముందు పాడైపోయెను. మనము యితరులకు ఏది చేస్తే అదే మనకు వచ్చును. మంచి చేస్తే మంచి వచ్చును, ఇతర ప్రాణులకు ద్రోహము చేస్తే మనకుకూడ ద్రోహము కలుగును. అందుకే "లోకాసమస్తా స్సుఖినోభవంతు" అనగా అందరూ సుఖముగా యుండుగాక మరల "సర్వేషాం స్వస్తిర్భవతు, సర్వేషాం శాంతిర్భవతు, సర్వేషాం పూర్ణంభవతు." అనగా సర్వజనులు సుఖముగా యుండుగాక, ఎవ్వరూ దుఃఖములు పొందకుండుగాక. అనగా ఆధ్యాత్మిక, అదిభౌతిక, అదిదైవిక దుఃఖములు లేక శాంతిగాయుండుగాక, అది దైవిక దుఃఖమును అనగా తెలియకనే గొప్పకష్టము వచ్చుట, సర్వజనులకు పూర్ణత్వము కలుగుగాక అనగా "అహం బ్రహ్మాస్మి" భావము అందరకు కలుగుగాక అని అట్టిభావము కలవారికి యితరులవల్లగాని యితర భూతముల వల్లగాని ఏమి అపకారము జరుగదు. అనగా నాకు కూడ ఆధ్యాత్మిక అది భౌతిక, అదిదైవిక దుఃఖములు శాంతించుగాక, మరల "ఓం తత్సత్" అందురుగా. దేనిని పట్టుకొన్నచో అవి చక్కగా సాగునంటే ఆ ప్రవణమును ధ్యానించవలెను. అందులోనే ఎల్లప్పుడు నిలువవలెనను భావముతోనే అట్లు చెప్పబడినది. "నశ్శ్రేయో నియమం వినా" అన్నారు ఋషులు, ఎవరు ఆ మంచికి సంబంధించిన దైవమును చేరుటకు అవసరమైన మంచి నియమములను ఏర్పరచుకొని

ఆ నియమములకు బద్ధుడైన వానికి లోకమంతా బద్ధులై యుందురు. అలా కాని వాడు లోకములో ప్రతివానికి లొంగవలసి యుండును. మనస్సుద్ధి కలిగినచో అప్పుడు అవాంతర ఫలములువచ్చుచునే యుండును. కాని వీటికొరకా సాధన చేయునది? ఆత్మజ్ఞానమునకు కదా! అలా ఆత్మజ్ఞాన సాధన ముఖ్యఫలమైనను మధ్యలో యిట్టిఫలములు కలుగుచుండును. వీటిని అవాంతర ఫలములందురు. తపస్సుచేసి శరీరమును శోషణచేసి విశ్వామిత్రుడు మొదలైన వారు సిద్ధిని పొందిరి. మాటిమాటికి విఘ్నములు వచ్చుచున్నను సాధన వదలని వాడు ఉత్తముడు. అయితే వానికి రోగము వచ్చినచో ఆ నియమము ఎట్లు అనిన తనకు తిరిగి శక్తి ఆరోగ్యము కలిగిన తర్వాత ప్రారంభించి చేయుచుండవలెను. ఇది ఒకసారి రెండుసార్లు కాదు. ఎన్నిసార్లు విఘ్నములువచ్చినా మరలా అవకాశము కలిగిన వెంటనే సాధనప్రారంభించును. ఆ దృష్టినుండి తనదృష్టిని మరలనివ్వరాదు. సమాధిలో అనేక సిద్ధులు కలుగును. మనస్సు కొంతకొంతకు శుద్ధమౌనో అంతకంతకు అవాంతర ఫలములు కలుగుచూ పోవుచుండును. అది విడవకనే సమాధిని శీలించినచో కడకు అదేకైవల్యము. నందీశ్వరుడంటామే అది ఒకవ్యక్తి. ఎద్దుకాదు. ఆయన పరమశివునిగూర్చి తాను దేవత కావలెనని తపస్సు చేసెను. అతడు ఈ మనుష్య శరీరములో నుండియే దేవతగా మారిపోయెను. చచ్చిపోయిన తరువాత దేవత అగుటకాదు మనుష్యశరీరమే దేవతా శరీరముగా మారినది. అది ఎట్లంటే.

2 సూ॥ జాత్యంతర పరిణామః ప్రకృత్యా పూరాత్ ।

భా॥ మనుష్యజాతి శరీరములో నుండియే దేవతాశరీరముగా మారుట. అది ప్రకృతియొక్క ప్రధానము. ఈ ప్రధానము మొదలు మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతఃకరణ, ప్రాణములు యివి

అంతా సూక్ష్మశరీరము. అపంచీకృత పంచభూతములు పంచీకరణము జరిగితే స్థూలభూతములు పుట్టును. అవి 4 రకముల శరీరములుగా పుట్టును. అవి జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్యములు. మావినుండి పుట్టేవి మనుష్యులు పశువులు ఇవి జరాయుజములు. గ్రుడ్లనుండి పుట్టేవి పక్షులు ఇవి అండజములు. చెమట నుండి పుట్టేవి పేలు, నల్లులు ఇవి స్వేదజములు. ఉద్భిజ్యములనగా భూమిని చీలించుకొని పుట్టేవి చెట్లు, పొదలు, లతలు మొదలగునవి. ఈ సృష్టి అంతయు ఈ నాలుగు రకములే. స్థూలసృష్టి, సూక్ష్మసృష్టి అంటే అహంకారము మొదలు యింద్రియములకు కారణము. ప్రధానము మొదలుకొని పృథివి అంతరం గలవిఅన్ని ప్రకృతి. ఈ ప్రకృతి బ్రహ్మాండమంతా వ్యాపించియున్నది. అంటే పంచభూతములు ఆ ప్రకృతియొక్క అవయవములన్నీ పేరుకొనుటచే మనుష్యుడుగా పుట్టును. అహంకారమువల్ల జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాదులు పుట్టెను. సమిష్టి సత్వమునుండి పుట్టినది అంతఃకరణము. సమిష్టి రజస్సునుండి ప్రాణములు పుట్టెను. సమష్టి తమస్సునుండి శరీరము పరిణమించును. సూక్ష్మసృష్టికి కారణము అహంకారము. ఆ అహంకారమువల్లనే ఇంద్రియాదులు పుట్టును. ఈశ్వర ప్రార్థనవల్ల నందీశ్వరుడు దేవతగా మారిపోయెను.

## 5-9-1974 గురువారము

"ప్రకృత్యాపురాత్" అనగా దేహమునకు ప్రకృతియగు భూతములయొక్కయు యింద్రియములకు అహంకారము ప్రకృతి యౌతుంది. దేహమునకు పంచభూతములు ప్రకృతి యగును. ఒకే జన్మలోనే మనుష్యుడుగాయున్న నందీశ్వరుడు దేవతగా మారిపోయెను. ఏలాగునంటే ప్రకృత్యాపూరము వలన మారిపోయెను. శరీరములో యింద్రియములలో మార్పురావలసినదేగాని ధర్మములో మార్పురాకూడదు.

3 సూ॥ నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణ
భేదస్తుతతః క్షేత్రికవత్ ।

భా॥ శరీరము మారుటకు కారణము తపస్సువల్ల మానవత్వము పోయి దేవత్వము వచ్చినదని అంటారు. పూర్వపక్షి. అలా కాదు. అలా మారుటకు కారణము ప్రకృత్యాపూరం వల్లనే జాత్యంతర పరిణామము వచ్చినదని సిద్ధాంతి అంటాడు. పంచభూతములు స్థూలశరీరమునకు ప్రకృతి అంటే ఉపాదాన కారణము అహంకారము, ఇంద్రియములకు ప్రకృతి అంటే ఉపాదాన కారణమగును. మనుష్యశరీరమునకు కారణమైన అవయవములతో మానవుడుగా యుండియు దేవతా శరీరమునకు తగినమార్పు ప్రకృతిలో వచ్చినది.

అపూరం అంటే అవయవ విశేషములు ఆ అవయవములలో మార్పు తపోరూపమైన ధర్మము అనుష్ఠించుటవలన ప్రకృతిలో మార్పువచ్చినది. ధర్మము అనుష్ఠించుట అంటే అది నిమిత్తకారణమే అగును. ధర్మమువల్ల దేవతాశరీరముగా మారదు. రైతు ఒక మడిలోని నీరు ఇంకొక మడిలోకి వెళ్ళవలెనంటే అడ్డుగట్టును తీసివేసినచో ఇందులో నీరు ఆ మడిలోనికి స్వయముగానే వెళ్ళును. ఆ రీతిగా మనుష్య శరీరముగా యుండియు. తపస్సువల్లనే మార్పు కాలేదు. ప్రకృతి మార్పువల్లనే దేవతాశరీరము వచ్చును. అంటే మానవ అణువులు దేవతా అణువులుగా మారినందున మనుష్య శరీరము దేవతా శరీరముగా మారినది. తపస్సు చేయుటవలన యోగ్యత వచ్చినది. ఆ యోగ్యతవల్ల మానవ అణువులు మారి దేవతా అణువులుగా అయినవి. తపస్సువల్లనే మారలేదు. తపస్సు నిమిత్తమాత్రం. భూతములు అహంకారము ఉపాదాన కారణము. దేవతా శరీరరూపము వచ్చుటకు తపస్సుకు ముందు మానవ శరీరములో అడ్డు ఉండేది. తపస్సువల్ల ఆ అడ్డు తొలగినది. ఆ అడ్డు

తొలగుట అంటే స్థూలశరీరములోను యింద్రియములోను మార్పు వచ్చి దేవాతా శరీరముగా మారినది. తపస్సు నిమిత్త కారణ మగుటవల్ల ఉపాదాన కారణమైన అవయవములలో మార్పు వచ్చి నది. అంటే మట్టి ఉపాదాన కారణము. కుమ్మరి నిమిత్త కారణము. కుండ కార్యము. అలాగే తపస్సుకుముందు మానవశరీర మునకు ఉచితమైన దేహము. యింద్రియములు ఉండేవి. అవి ఉపాదాన కారణము. తపస్సు అనే నిమిత్తకారణమువల్ల దేవతా శరీరోచితమైన కార్యముగా మారిపోయినది.

4 సూ॥ నిర్మాణ చిత్తాన్యస్మితా మాత్రాత్ ।

భా॥ అందరి చిత్తములు పంచతన్మాత్రలలోన సమిష్టి సత్వ గుణము యుండును. యోగిచేత నిర్మింపబడిన అనేక శరీరములలో యున్న చిత్తమునకు కారణము ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క చిత్తము యున్నదంటే ఆ యోగియొక్క నిర్మాణము వల్లనే అన్ని చిత్తములు కలిగినవి. ఆ యోగియొక్క సంకల్పమువల్ల, అహం కారమువల్ల అన్నిచిత్తములు కలుగును. ఆ యోగి యోగప్రభావము వల్ల సృష్టించినవి కనుక నిర్మాణ చిత్తములు అయినవి. కర్మేంద్రి యములు, జ్ఞానేంద్రియములు ఈ శరీరమునకు బయట యున్నందున బాహ్యేంద్రియములు అంతఃకరణ అనగా లోపలయుండేది. దానిని అంతరింద్రియములు అంటారు. చిత్తము అంతరింద్రియము. దీనికి కారణము అహంకారము యోగి సంకల్పించుటవల్లకలిగిన ప్రకృతి అగు అహంకారములో మార్పు కల్గుటవలన అనేక చిత్తములు కల్గును. ఐతే అన్ని శరీరములలో అన్ని చిత్తములు యుంటే ఆ చిత్తములన్నియు ఒకేరకముగా యుండునా! భిన్నాభిప్రాయము కలిగియుండునా! అని శంకరాగా అన్ని చిత్తములలో ఒకదానికి భోగము మీద ఇంకొంక దానికి విరాగము మీద యుంటే ఎట్లు

ఆ యోగి ఆ భోగములను అనుభవించగల్గును. ఆ యోగిచేత సృష్టింపబడిన అనేక మందిలో అనేక చిత్తములు యున్నవి.

5 సూ। ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషామ్।

భా। అనేక చిత్తములకు భేదము యుండునుగాని ఆ సృష్టించిన యోగియొక్క చిత్తము ప్రకారమే ఆ అన్ని శరీరములలోను కలుగుచుండును. అనగా ఆ యోగి చిత్తములో ఒక శరీరము తీర్థయాత్రలకు వెళ్ళవలెనని తలంచిన అలా వెళ్ళును. ఒక శరీరము భోగమును అనుభవించవలెనని తలంచిన ఆ శరీరము అలా చేయును. అలాగే అన్ని శరీరములను కూడ తన సంకల్పానుసారముగా నడిపించును. ఆ శరీరములన్నిటిని వాటిలోని చిత్తములన్నిటిని ఎట్లెట్లు చేయవలెననిన అట్లు యోగియొక్క సంకల్పానుసారమే జరుగును. ఆ చిత్తములన్నిటికి ఒక చిత్తము కారణముగా యున్నది.

7-9-1974 శనివారము

8 సూ। తతస్తద్విపాకానుగుణానా మేవాభి వ్యక్తి ర్వాసనానాం।

భా। ముందు కర్మలు అభివ్యక్తమైనచో ముందు చెప్పిన పాపము, పాపపుణ్యము, పుణ్యము, పూర్వము నాలుగు రకముల కర్మలు చెప్పను. యోగులు అ యోగులు అని. యోగులకు అశుక్లకృష్ణమునియు అ యోగులకు కృష్ణం శుక్లం.

ఆ మూడు కర్మఫలములు ఏమియున్నవో వాటి వాసనలు అయోగులు 3 రకముల కర్మలు చేయుదురు. ఒకటి పుణ్యకర్మలు, రెండు పాపకర్మలు, 3 పుణ్యపాపముని మిశ్రము కర్మలు చేసెదరు. ఆ కర్మఫలములనిచ్చి తీరును. ఆ కర్మలు చేసినది ఇతరులకు తెలిసినా తెలియకపోయినా కర్మఫలదాతయగు ఈశ్వరునకు మాత్రము అంతయు తెలియును. సంకల్పము సహా తెలియును. అది ఎట్లు అంటే అంతఃకరణకు సాక్షిరూపముగా చూస్తూయుంటాడు. కనుక

కర్మలు చేసేటప్పుడే జాగ్రత్త పడవలెను. సజ్జన సాంగత్యమువల్ల రాగ ద్వేషాదులను తగ్గించుకొనవచ్చును. ఆ రాగ ద్వేషాదులు ఎక్కువగా యున్నచో సజ్జన సాంగత్యము కూడ ఉపయోగపడదు. భగవద్భక్తి మహాప్రయత్నము వలనకాని కలుగదు. యమదూతల చేతిలో చిక్కిన తర్వాత ఏడ్చేకంటే ఆ ఏడుపు ముందుగా ఏడ్చినచో ఫలము కలుగును. ప్రారబ్ధము తప్పదుకాని ఆగామి మన చేతిలో యున్నది. దుర్జనులతో స్నేహము చేస్తే దుష్టులు, పాపులు అయిపోయెదరు. సజ్జనులతో సహవాసము చేస్తే సన్మార్గము, పుణ్యము కలుగును. సత్వగుణము ఎక్కువగా యున్నచో అట్టివారు పూర్వజన్మలోనే భగవంతుని గురించి ఎక్కువ పాటుబడినవారు అగుదురు. కనుక ఈ జన్మలో రాగ ద్వేషాదులు ఎక్కువగా యున్నవారు వాటిని తగ్గించుకోవలెను. మనుష్య జన్మవచ్చి మంచికర్మలు చేయగా మరల వేయిజన్మలు, దేవతాజన్మలు వచ్చిన తర్వాత మరల మానవజన్మ వచ్చును. ఐతే దీనికి పూర్వము దేవతా జన్మగదా రావలెను. అలాకాక వేయిజన్మల పూర్వముగల మానవజన్మ రావచ్చునా అని సందేహము కలుగగా అలావ్యవధానము యున్నను వచ్చునని అంటున్నారు.

9 సూ॥ జాతి దేశ కాల వ్యవహితా నామ ప్యానం
తర్యం స్మృతి సంస్కార యోరేక రూపత్వాత్ ।

భా॥ జన్మలలో, దేశములో, కాలములలో, వ్యవధానము యుండవచ్చు. ఒక మానవజన్మ, వేయి దేవతాజన్మలు, మరల మనుష్య జన్మకు వ్యవధానము యున్నను, జన్మలలో వ్యవధానము యున్నను. అలాగే వేయి జన్మలయందు పుట్టిన మానవజన్మ లండనులో అనుకొండి మరలా వేయి దేవతాజన్మల తర్వాత వచ్చిన మానవజన్మ భారతదేశములో వచ్చును. కాలము అంటే ఆ మానవజన్మకు ఈ మానవజన్మకు కొన్ని వేల సంవత్సరములు వ్యవధానము యుండును.

అనగా సంస్కారము ననుసరించి స్మృతియుంటుంది. స్మృతిని అనుసరించి సంస్కారము యుంటుంది అనగా వెంకటేశ్వరులను చూచినవానికే సంస్కారము యుండును. వానికే స్మృతికలుగును. అసలు వెంకటేశ్వరులను చూడని వానికి సంస్కారము లేదు.

ఇక స్మృతి ఎక్కడిది? జపధ్యానాదులు చేయుపద్ధతిని గురువుగారు లక్ష్యము చూపినను ఆధ్యాన సమయములో ఆ గురులక్ష్యమునందే మనసు నిలుస్తుందా? లేదు. ఏవేవో జ్ఞాపకము వచ్చును. అంటే ఆ స్మృతి సంస్కారము ఉన్నందువనే మనస్సు ఆలా పోవుచుండును. వేయి జన్మలకు ముందుగల మనుష్య సంస్కారము వేయిజన్మల అనంతర దేవతాజన్మ పోవునపుడు మానవజన్మ సంస్కారము స్ఫురించును. మానవజన్మ వచ్చును. చనిపోవు వానికి రాబోయే జన్మ కండ్లకు కట్టినట్లు కనిపించును. జడభరతునకు జింక స్ఫురించినది. జింకజన్మ వచ్చినది దేశ, కాల, జన్మలతో వ్యవధి యున్నా జన్మలు వచ్చుటకు స్మరణయే కారణము. కాని దేశ, కాల, జన్మలవల్ల ప్రయోజనము లేదు. ఎట్టిపని చేయుచున్నాసరే, అనగా సర్వకాల సర్వావస్థలయందు మనస్సులో భగవత్ స్మరణ చేయుచునే యుండవలెను. "అత్యంత కేమాత్ర పురీష అన్నారు" కనుక ఎప్పుడు దైవస్మరణ మరువరాదు. స్మరణ చేయకపోతే మలమూత్ర విసర్జన సమయములో ప్రాణము పోతేనో! కనుక ఎప్పుడూ స్మరణ మానరాదు.

10 సూ॥ తాసాయ నాదిత్వం చాశిషో నిత్యత్వాత్ ।

చీమ మొదలు బ్రహ్మవరకు కూడ ఉండాలనే యుండును. కాని చచ్చిపోవాలని యుండదు. అందరి యొక్క స్వరూపము నిత్యము త్రికాలాబాధ్యమైనది. అదే ఆత్మ, అదే సత్యము, జ్ఞానము అనంతంబ్రహ్మ! ఈ శరీరము ఒకప్పుడుండును, ఒకప్పుడు లేదు. కనుక ఇది సత్యముగాదు. ఐతే అసలే లేనిది వచ్చునా?

అని ఒకప్రశ్న వచ్చును. ఎలా అంటే నువ్వులనుంచే తైలము వచ్చునుగాని ఇసుకనుండి రాదుగా! అలాగే కారణమందు కార్యము యుంటేనే తరువాత పుట్టుననేది సత్కార్యవాదము. కార్యము వ్యక్తము కాక ముందు కారణము అణిగియుండును. అనగా బీజము కారణము, చెట్టు కార్యము ఆ బీజమందు చెట్టు అణిగియున్నట్టు కారణమందు కార్యము అణిగియుండును. అనగా మట్టి నుండి కుండ పుట్టును. మట్టిలో కుండయున్నది. కాని దానిని కుమ్మరి నిమిత్త మాత్రముగా యుండి వికసింపజేయును. అంటే కార్యసామగ్రి ఏర్పడినప్పుడు కార్యరూపము ధరించును. శనగ గింజలో చెట్టుయున్నది. కాని అది భూమిలో పెట్టినా మొలకరాదు నీరుపోయాలి, గాలితగలాలి ఎండకూడ తగలవలసినదే. అలా పంచభూతముల సహాయమువల్లనే మొలకవచ్చును. సామగ్రి అనగా ఒక కార్యము పుట్టుటకు కావలసిన వన్నియూ చేరిననే సామాగ్రి అగును. కార్యము కారణములో యున్ననే పుట్టునుగాని లేనిది పుట్టదు. నూనె నువ్వులనుంచే పుట్టును కాని యిసుకనుండి పుట్టదు కుండ మట్టినుండి పుట్టునేగాని, రాతినుండి పుట్టదు. అలాగే అందరికి ఎల్లప్పుడు ఇట్లనే ఉండాలనే భావము యుండును. అందరూ ఈ జన్మకు ముందుకూడ యున్నారు. ఆ జన్మలోకూడ అలాంటి సంస్కారము వాసనలు యుండును.

ఆ వాసనలవల్లనే మరల జన్మ వచ్చుచుండును. అన్నీయున్న వాళ్ళు నేను పూర్వజన్మలో మంచి పుణ్యము చేసుకొన్నాను. కనుక నాకు అన్నము, వస్త్రము, ఉండుటకు యిల్లు ఉన్నదియని అనుకొనుచుందురు కదా! కనుక వాసనలు పూర్వజన్మమునకు సూచించుచుండును.

11 సూ॥ హేతు ఫలాశ్రయా లంబనైః సంగృహీత
త్వాదేషామభావే తదభావః॥

భా॥ వాసనలు అనాదిగా వచ్చుచున్నవి. అనాది ఎట్టిదంటే ప్రవాహము మాదిరిగా ఆ వాసనలు హేతువుల చేతను, ఫలముల చేతను, ఆశ్రయము చేతను ఆలంబనముల చేతను సంగ్రహింపబడినవిగాన ఆ వాసనలకు అభావము కలుగును. అవి ఎప్పుడూ ఉండవు. ప్రవాహము మాదిరిగాయని చెప్పబడినది. కారణముపోతే కార్యము పోతుంది. వాసనలు అనాది ఐతే అవి అనంతముగదా అనగా అనాది ఐతే అనంతముగా యుంటుందని నియమము లేదు. ఉన్న వాసనలు నశించుటచే హేతు, ఫల, ఆశ్రయ, ఆలంబనలచేత వాసనలు సంపాదింపబడినందువలన ఆ వాసనలు అభావములు అగుచున్నవని చెప్పుచున్నారు. పైనచెప్పిన 4 వాసనలకు హేతుఫల ఆశ్రయ ఆలంబనాలు అవిద్య, అస్మిత, రాగ ద్వేష, అభినివేశ అని క్లేశములు వాసనలకు హేతువు. ఫలము, జన్మ, ఆయువు, భోగము, అనుభవము అంటే ఫలము ఈ వాసనలు అంతఃకరణను ఆశ్రయించి యుండును. అంతఃకరణ ఆశ్రయము. ఏలా అంటే కంసాలివద్ద ఉండే మైనపు ఉండకు బంగారమును అకురాతితో రాసి ఆ రాపుడును మైనపు ఉండకు అంటించెదరు. అవి చేతికి దొరకవుగాని కంటికి కనుపించును. మనకు కావలసినవి అంతఃకరణమనే మైనపు ఉండలో ఉండేవి జన్మజన్మల సంస్కారాలే. ఆ మైనపు ఉండలో బంగారు అణువులు అంటియున్నట్లు అంతఃకరణలో సంస్కారములు అంటియుండును. ఒకటికూడ పోదు. ఆ విజ్ఞానము కలిగిననే పోవును. ఈ వాసనలకు ఆలంబనము శబ్దాది విషయములు ఆలంబనములు అంటే విషయములన్నమాట ఈ పైనాలుగు లేకపోతే వాసనలు కూడ యుండవు. వాసనలు అనాది ఐనవి అవి నశించవనే భయము అక్కరలేదు. నశించును అని చెప్పుచున్నారు. పురుషుడు అనాది అనంతము ఐతే వాసనలుకూడ అనాదిగాని, అనగా ఏమంటే వాసనలు కార్యము నీటి ప్రవాహము ఎంత క్రిందకి పోవు

చుండునో అంత నీరు వచ్చుచునే యుండును. నీరు నాశనమై పో చున్నను. మరల కలియుచున్నందున అది అట్లనే యుండును. లాగున ఈ ప్రపంచము కూడ ప్రవాహము మాదిరిగా అనా అనగా మానవులు పోయేవాళ్ళు పోతుంటే వచ్చేవాళ్ళు వస్తూ యున్నారుగా. తాతలు పోయినా మనుమలు ఉంటున్నారుగా దీనినే ప్రవాహము మాదిరి అనాది అంటారు. పురుషుని విషయములో అనాది అనేది లేదు. అది అంటే ఉత్పత్తి పురుషుని ఉత్పత్తికూడ లేదు. వాసనలన్నీ హేతువుల చేతను ఫలము చేతను, ఆశ్రయము చేతను, అలంబనముల చేతను పుట్టేవి కను కార్యములు. అనాది అంటే ప్రవాహము మాదిరి. పుట్టేది నశి చుట మరల పుట్టుట ఇది కార్యము, కనుక ఎడతెరిపి లేకుండ తెంపులేకుండ యున్నందున అనాది వివది. ఇది కార్యము, కార ణము నశించిననే కార్యము నశించును. అనగా బంగారు ఆభర ణము ఒకటి చెడగొట్టి మరల ఇంకొక అభరణముగా చేయించుకో వచ్చును. పచ్చికుండ చేసి బయట పెట్టగా వర్షమువల్ల కుండ అనే కార్యము పోయింది. అనగా కారణమైన మట్టి కరిగిపోయినది. ఇక కార్యమైన కుండ ఎలాయుండును? భ్రాంతి వల్లనే రాగ ద్వేషములు కలుగుచుండును. అలాగాక నేను అనే ఆత్మస్వరూపమును తెలిసి కొన్నచో భ్రాంతి కలుగునా! రాగద్వేషాదులకు ఆ భ్రాంతియే హేతువగును. ఆ రాగద్వేషాలు, ధర్మము, అధర్మములకు హేతువు లగును. ఈ ధర్మ, అధర్మములు అనుభవమునకు హేతువులగును. అనుభవము అంటే సుఖము, దుఃఖము అనుభవించుటకు హేతువు లగును. ఆ అనుభవించుట అనేది వాసనలకు హేతువులగును. ఈ రీతిగా సంసారచక్రము తిరుగుచుండును. సంచితమునుండి ఎంత ఫలోన్ముఖమగునో దానిని అనుసరించి జన్మవచ్చుచుండును. పుణ్య ముగాని, పాపముగాని అధికముగా చేసినచో ఈ జన్మలోనే అను

భవమునకు వచ్చును. పామాత్యమైన పుణ్యపాపములు సంచితములో పడి క్రమముగా అనుభవమునకు వరుసగా వచ్చుచుండును. సంచితములో ఫలోన్ముఖమైన దానిని ప్రారబ్ధము అంటారు. ఆ ఫలోన్ముఖమైన దానినిబట్టి వచ్చుజన్మనే ప్రారబ్ధమంటారు. యోగి దృష్టికి సంచితము, అందులో ఫలోన్ముఖములైనవి తెలియును. కనుక యోగి వాటిని విడదీయును. ఇక భగవంతునకు తెలియు విషయము హేతు, ఫల, ఆశ్రయ, ఆలంబవాసనలు సంగ్రహింపబడును. వీటి నాశము ఎట్లంటే వివేకఖ్యాతి కలిగినచో పోవును. అనగా ప్రకృతి, పురుష. వివేకము కలిగినచో నశించునందురు. యోగులు వేదాంతులు. దృష్టిలో జీవబ్రహ్మైక్యము కలిగినచో వాసనలు నశించునందురు. ఎండమావులలో నీరు లేకనే ఉన్నట్లుతోచును. అలాగే ప్రపంచము లేదు కల్పితము భ్రాంతి ఎండమావులుగా కనపించుటకు కారణము, ఎక్కువ ఎండ, ఇసుక వేడి కలిసి అత్యధికమగుటచే నీరు ప్రవహించునట్లు కనబడును నీరు లేకనే ఉన్నట్లు కనుపించునట్లు ప్రపంచము లేకనే ఉన్నట్లు కనుపించును.

ఐతే ఏదో ఒక అధిష్ఠానము ఉంటేనేగాని భ్రాంతికలుగదు. రజ్జు సర్ప భ్రాంతివలె చూసేది, తినేది. ఆఘ్రాణించేది, స్పృశించేది అంతా పరమాత్మనే కాని మనము అనుకునేది అంతా శబ్ద, స్పర్శరూపాదులనే ప్రపంచరూపముగా అనుకుంటాము. ఇది, వేదాంతులు చెప్పెదరు. రజ్జువును చూచి పాము అనుకొన్నారు. దీపము సాయముతో చూచి త్రాడు అనుకొన్నారు. త్రాటియొక్క అజ్ఞానము చేత పాముగా కనిపించినది. అలాగే పరమాత్మ యొక్క అజ్ఞానము చేత ప్రపంచముగా కనుపించుచున్నది. ప్రపంచకల్పనకు అధిష్ఠానము బ్రహ్మము. కల్పిత పదార్థము అధిష్ఠానముకంటె వేరుగాయుండదు. అలాగే బ్రహ్మమునందు కల్పితమైన ప్రపంచము బ్రహ్మమే అధిష్ఠాన దృష్టితో బ్రహ్మముగాను ఆరోపితదృష్టితో

ప్రపంచముగాను కనుపించును. ఉన్నదానిని ఉన్నట్లు ఎవరు తెలిసి కొందురో వారికి సమస్త సంసార బంధము తొలగిపోవును. ఇది వేదాంతుల పద్ధతి. యోగుల పద్ధతి ప్రకృతి పురుష వివేకము. ఇదే జ్ఞానము అంటే ప్రకృతి వేరు పురుషుడు వేరుగా భావించుటనే వివేక మంటారు. అలా వేరుగా తెలిసికోవడమే యోగుల యొక్క జ్ఞానము. యోగులకు ప్రకృతి సత్యమే కాని పురుషుడు వేరు ప్రకృతి వేరు అని తెలిసికొన్నచో వానికి ఇక జన్మలేనట్లు జ్ఞానము కలిగినట్లు యోగుల దృష్టిలో ఉండును. పురుషులు బహుమంది అని యోగులందురు. వేదాంతంలో బుద్ధికి తోచే దానికై వేర్వేరు అనిన ఒక్కడే. ఉపాధి భేదంవల్ల పురుషులు భిన్నముగా కనిపించెదరు. అదెట్లనిన ఘటా కాశ, మఠాకాశములవలె ఉపాధులు భిన్నంగా ఉన్నందున ఆకా శముకూడ భిన్నముగా గోచరించినను. మహాకాశ మొక్కటే అలాగే ఉపాధి భేదముచే భిన్నముగా కనుపించిన వస్తువు ఒక్కటే. ఈ ఉపాధులు నశించెడివే కనుక పరమాత్మ ఒక్కడే సత్యము. అంటే పరమాత్మయే ఉపాధిలో ప్రవేశించెను. కనుక ఉపాధి భేదము వల్ల జీవుడందురు. జీవరూపముతోనున్నను వాస్తవముగా అంద రిలో ఉన్నది పరమాత్మయే. ఉపాధులు వేరు వేరుగా గోచరించి నను, వస్తువు మాత్రము ఒక్కటే. సంప్రజ్ఞాత సమాధినే ప్రకృతి పురుష వివేకమంటారు. అది వేరు ఇది వేరు అనేదికూడ పర వైరాగ్యముచేత పోయినచో అది అసంప్రజ్ఞాత సమాధియగును. యోగులుగాని, జ్ఞానులుగాని, చేసే సాధనలను ఆదరపూర్వ కముగా ఆచరించవలెను. అంటే తాను అనుష్ఠించే దానియందు గొప్పదనే ఆదరము ఉండవలెను. వ్యవధానము లేకుండా సాధన జరుగవలెను. అలా అయితే ఆ వస్తువు సాక్షాత్కారమగును. నిరంతరము సాధన చేయుచుండవలెను. కొంతసేపు దైవభావములో నుండి మరల అది మరచినచో ఇతర చింతలు వచ్చును. అట్లు

వచ్చేది ప్రకృతి సంస్కారము. కనుక తన లక్ష్యము సాక్షాత్కా-రము కాక పోవుటకు కారణము ఇదే. ధ్యానమును చిరకాలము పట్టుదలతో అవాంతరము లేకుండ అనుష్ఠించినచో తప్పక జ్ఞానము మోక్షము కలుగును. సాధనయందు ఆదర భావము, గౌరవ భావము ఉండవలెను.

పురుషుని ప్రతిబింబము బుద్ధిలో పడినచో ఆబుద్ధిలోగల దోషములు ప్రతిబింబములో గోచరించుటచే ఆ దోషములన్నియు నావేయని భావించి, కష్టాలు, దుఃఖాలు పడుచుందురు. ఆదర పూర్వకముగా చేసినచో ఆ రాజస, తామస, గుణములు నశించి బుద్ధికి శుద్ధి ఏర్పడును.

బుద్ధి వేరు పురుషుడు వేరు అని తెలిసికొన్నచో అపుడు బంధము పోవును. అలా వేరు అని ఎప్పుడు తెలిసికొనునో అదే జ్ఞానము. దానివల్ల పరవైరాగ్యము కల్గి ముక్తి మోక్షము లభించును. అష్టాంగ యోగములను ఆదరముతో నిరంతరము సత్కార్యా సేవతో అనుష్ఠించిన వాసనలు నశించిపోవును ఇక జన్మకు కారణము కాదు. కనుక తనను ఆ వాసనలు అంటకుండాపోవును.

## 12-9-1974 గురువారం

లేనివాసనలకు ఉత్పత్తి అనేది సంభవించదు ఇది మొదటిది 'శశి విషాణం'' అనగా కుందేటి కొమ్ము, కుందేటికొమ్ము అనే వస్తువు లోకములోనే లేదు. వాసనలు అనేవి లేవు అంటే ఇక అవి పుట్టేది లేదు. కనుక ఉత్పత్తి కుదరదు. రెండవప్రశ్న-వాసనలు ఉన్నవని అనుకుందామంటే ఉన్న వాసనలు పుట్టుట ఎట్లంటే దానిని కూడ అసంభవము అంటున్నారు. చిచ్ఛక్తి అంటే యోగులచేత అంగీకరింపబడిన పురుషుడు వీనికి ఉత్పత్తి లేదు. ఎప్పుడూ ఉండేదే అంటే ఆ పురుషుడు మూడు కాలములలోను ఉంటాడు. కనుక ఉత్పత్తి కుదరదు వాసనలు లేవు అనేది కుదరదు లేవు.

కనుక ఉన్నది అందామా అంటే ప్రశ్నవాటికి ఉత్ప న్నదరదని అంటున్నారు. పోతే లోకములో అభివ్యక్తమ వ్యక్తము అన్నారు అంటే ముందు వానివాని కారణముల సూక్ష్మముగా ఉన్నవి తర్వాత వ్యక్తమగును. కార్యము కార మందు అణగియుండును. తగిన సామగ్రి కుదిరినప్పుడు కార ములో అణగియున్నది వ్యక్తమగును. ముందు కారణము యందున్న వ్యక్తమగును. అంటే పుట్టును, పుట్టునుగాని లేకపోతే పుట్టజాల అనగా యిసుకయందు తైలము పుట్టునా! తిలలయందు పుట్టున అంటే ముందు తిలలలో తైలముయున్నది. సాధనవల్ల అది వ్యక్త మగును. కుండ మట్టిలోనుండే తరువాత పుట్టును. ఆభరణమ బంగారములో అణగియుండి తరువాత పుట్టును. సామర్థ్య రూప ముగా అణగియుండి సాధన సామగ్రి అమరినచో ఆ వస్తువ పుట్టును. అనగా అభివ్యక్తమగును.

12 సూ। అతీతా నాగతం స్వరూపతో స్త్యధ్వభేదార్ధర్మాణాం।

తా। ధర్మమునకు కాల, భేదము వలన భూత కాలము వర్త మాన కాలము, భవిషత్ కాలమందురు. ఈ ధర్మములయొక్క కాల భేదమువలన తన స్వరూపముతో ఎప్పుడూ ఉండును. పరిణా మరూపముగా యుండును. అనగా ధ్యాన రూపముగా యుండి అన్న రూపముగా మారి అదే మలరూపముగా భూమిమీదయుండి, భూమితో కలసి భూమి రూపమును ధరించును. అంటే పరిణామ రూపముగా ప్రకృతి సత్యమే అంటే అతీత అనాగతములు కార ణమునందు యిమిడియుండును. వర్తమాన కాలము వ్యక్తమై కని పించును. ఘటమును తీసికొనండి. మొదట మట్టిని కుమ్మరితయారు చేయగా రూపనామములతో ఘటముగా అభివ్యక్తమైనది. అంటే నామ రూపములతోయున్నది. కుండ పుట్టకముందు మట్టిరూప ములోయుండి యుండినది. అనభివ్యక్తముగా యుండును. భవి

వ్యత్ కాలములో కూడ నశించిపోయి నామరూపములు రహితమై యుండును, వర్తమాన కాలములో వ్యక్తమగును. ఐతే కారణము ఎప్పుడూయున్నది. అంటే భూత భవిష్యత్, వర్తమాన కాలములలో యున్నది. ధర్మి అనగా ధర్మముకలది. పుష్పములో తెలుపు అనే ధర్మముయున్నది. ధర్మి అంటే పుష్పము. ధర్మము అంటే తెలుపు. పుష్పము పుట్టకముందు మొగ్గలు అణగియుండును. దానినే అనభివ్యక్తముగా అణగియున్నదందురు. అంటే శక్తిరూపముగా యుండును. విత్తనములో మొలక సామర్థ్యరూపముగా అంటే శక్తి రూపముగా ఉంటుంది. దానిని భూమిలో పెట్టి నీరుపోస్తే మొలకవచ్చును. అప్పుడు గోచరమగును, వ్యక్తమగును. భవిష్యత్ కాలములో నశించిపోయి కారణములో అణగియుండును. అంటే దీనిని బట్టి యోగులు, సాంఖ్యులు, సత్కార్యవాదమును అంగీకరించినట్లు అయినది. అనగా కార్యము కారణమునందు అణగియున్నదని కార్యము కారణనందు అణగియుండక పోయినచో యిసుక నుండి తైలము పుట్టునా? లేదు అంటే యిసుకలో తైలరూప సామర్థ్యము, శక్తి లేదు. ఆ శక్తి ఆ సామర్థ్యము పూవులలో యున్నది. కనుక తిలల నుండినూనె పుట్టును. కారణములో అనభివ్యక్తముతో ముందుయున్ననే కార్యరూపముగా అభివ్యక్తమగును, అంటే ఉత్పత్తియగును, అభివ్యక్తమన్నా ఉత్పత్తియన్నా ఒకటే. వాసనలు కారణమునందు అణగియుండుననియు అలా ఉండినందుననే పుట్టును అని చెప్పుచున్నారు. ఆ వాసనారూప బంధము తత్వజ్ఞానమును సంపాదించిన ఆ వాసనా బంధము అట్లనే యున్నచో జన్మలు వచ్చుచునే యుండును. అప్పుడు కష్టములు, దుఃఖములు తప్పవుగా! కనుక కష్టపడి తత్త్వజ్ఞానమును సంపాదించిన ఏమిఫలమని సందేహము కలుగగా తత్త్వజ్ఞానము సంపాదించిన దానికి వాసనలకు సంబంధము లేకుండ పోవును. తత్త్వజ్ఞానమువల్ల సంబంధము ఎప్పుడు లేకుండ పోయినదో అప్పుడు కారణమందు అణగియుండును. తత్త్వజ్ఞానము సంపాదించక పోయినచో

వర్తమాన కాలములో సుఖదుఃఖ రూపములైన వాసనలు చిత్తము నందు సంస్కారరూపముగా యుండి బాధించుచుండును. వాసన వర్తమాన కాలమగుటయే బంధము వాసన అనాగత కాలికమై నచో అనగా భవిషత్ కాలమునకు అంకితమైనందున అంటే తత్త్వ జ్ఞానము సంపాదించినవానికి అనాగత కాలమునందు అనగా కారణ మందు అణగిపోవును.

అతీతాగము అనగా ప్రారబ్దకర్మ ఉన్నంతవరకు జీవించి యుంటాడు కనుక తత్త్వజ్ఞానము కలిగిన ఫలమును ఇచ్చుచుం డును. శరీరము విడిచిన తరువాత వాసనలకు వీనికి సంబంధముండదు కనుక అది మోక్షము. అంతేకాని వాసనలు లేకుండ పోయేది కాదు. ఆగామి కర్మలనగా జ్ఞానము కలిగిన తర్వాత చేయబడిన కర్మలవలన పుణ్యము, పాపము, యుండనే యుంటుంది. జ్ఞాని కాని, అజ్ఞాని కాని ఒక్కక్షణము కూడ కర్మలు చేయకుండ ఉండరు. కాని జ్ఞాని చేసిన కర్మలు అతనికి ఫలదాయకములు కాదు. ఐతే ఆ ఫల మేమగునంటే ఆ జ్ఞానిని దూషించిన వారికి పాపము చేరును, పూజించే వారికి పుణ్యం చేరును. ఇక ఆ జ్ఞానికి ప్రారబ్దము యున్నంతవరకు శరీరము యుండి ప్రారబ్దము తీరిన తర్వాత ఈ శరీరము పోవును. వానికి ఏ విధమైన కర్మలు లేవు అదే మోక్షము. యోగులకు ప్రకృతి సత్యము కనుక వాసనలు అతీతానాగతములలో కలసిపోవును. వేదాంతులకు జగత్తు మిధ్య ఎట్లన రజ్జు సర్పము మాదిరిగా.

తత్త్వజ్ఞానము కలిగినచో సంచితము నశించును. ప్రారబ్ధము అనుభవించుటతో పోవును ఆగామి అజ్ఞానిని దూషించిన వారికి భూషించిన వారికి పోవును. ఇక అట్టివానికి ఏవిధమైన కర్మలు లేవు. కనుకనే దానికి మోక్షము కలిగింది. జగన్మిథ్య అంటే ఒక నికి ఒక కొడుకున్నాడు. వానికి జబ్బుచేసినందున డాక్టరు కొరకు

వెళ్ళగా ఈ రాత్రి సమయములో ఎట్లు వెళ్ళేది. ఉదయము వచ్చెదనని డాక్టరు చెప్పగా ఆయనకూడ ఆ రాత్రి అక్కడే పడుకొనగా ఒక స్వప్నము వచ్చినది. ఆ స్వప్నములో ఒక భార్య, ఒకబిడ్డ, ఆ బిడ్డ చనిపోయినట్లు స్వప్నము వచ్చినది. ఉదయముననే డాక్టరు ఆయన యింటికి వెళ్ళేసరికి ఆ పిల్లవాడు ప్రమాదస్థితిలో నున్నందున తల్లి ఏడుస్తూ భర్తతో ఈ స్థితిలో యుండగా రాత్రి వెళ్ళి ఇపుడు వచ్చావా అని గోలచేయగా దానికి ఆయన అయ్యో రాత్రి స్వప్నములో ఒక బిడ్డ చచ్చిపోయినది యిపుడు పిల్లవాడు ప్రమాదస్థితిలో యున్నాడు. చచ్చిపోయిన పిల్లకోసము ఏడ్చేదా? ఈ చావబోయే పిల్లవానికోసం ఏడ్చేదా అన్నాడు. అనగా రాత్రి వచ్చినది చిన్నస్వప్నము. ఇది పెద్ద స్వప్నము అని గ్రహించేది. దుఃఖము పూర్తిగా పోయి శాశ్వతముగా శాంతి కలుగ వలెనంటే ఒక్క ఆత్మజ్ఞానము వల్లనే కలుగును. ఎంతెంత ధనము, భూములు, భోగములు ఉన్నను సుఖము, శాంతి లేదు. వారి శాంతిసుఖములు నీటిలో బుడగవంటివి. అంటే యిట్టే సుఖమువలెతోచి వెంటనే దుఃఖమును కలిగించును. కనుక అనిత్యమైన ఈ శరీరములో నుండియే యీ శరీరము పోకముందే ఆత్మజ్ఞానమును సంపాదించుకొనండి. దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలెను. ఆత్మజ్ఞానము తప్ప యితర సుఖములన్నియు క్షణికములే. కనుక ఈ శరీరము క్షణికమైనా ఉండగనే యీ జన్మకు వచ్చిన పని పూర్తి చేసుకొనండి. వచ్చే జన్మలో చేసుకొనెదమన్నచో వచ్చే జన్మ మానవుడుగా వచ్చునో లేదో ప్రారబ్దము సంచితమునుండి ఫలోన్ముఖమైనది వచ్చుచుండును. కనుక ఏ జన్మ వచ్చునో, అందువలన ఈ జన్మలోనే ఆత్మజ్ఞానము కొరకు ప్రయత్నము చేసి ఆత్మశాంతిని సుఖమును పొందండి.

## 13-9-1974 శుక్రవారము

**13 సూ॥ తే వ్యక్త సూక్ష్మాగుణాత్మనః॥**

భా॥ పైన చెప్పిన ధర్మములు వ్యక్తములు, సూక్ష్మములు, త్రిగుణ స్వరూపములై యున్నవి. గతము అంటే భూత కాల సంబంధము. అనాగతము అంటే భవిష్యత్తుకు సంబంధము, ఇవి ధర్మియందు సూక్ష్మరూపముగా యుండి వర్తమాన కాలములో వ్యక్తమగును అంటే ప్రకటమగును ఈ అన్నియు గుణముల పరిణామములే అనగా సత్వ, రజస్తమోగుణముల పరిణామమే ఆ ధర్మములు మహదాదులు దీనికి ధర్మము ప్రధానము, అనగా ప్రకృతి దాని నుండి మహత్తు ధర్మియగును అహంకారము పంచతన్మాత్రలు పంచ భూతములనుండియే సకలభూతములు పుట్టును. ప్రకృతినుండి భూత ములవరకు సత్వరజస్తమో గుణపరిణామములే. సత్కార్యవాదము అంటే కారణములో కార్యముండియే తర్వాత పుట్టును. పుట్టక ముందు సూక్ష్మ రూపములో కారణమునందుండును. పుట్టిన దనగా వ్యక్తమగును. నశించినచో మరల కారణములో కలసి పోవును. మట్టియే కుండ అగును. ఆ కుండ పోయినచో మరల మట్టిలో కలిసి పోవును కదా దీనిని తీసికొనండి ఇంతవరకు సమస్త పదార్థములు త్రిగుణాత్మకములని చెప్పబడెను.

**14 సూ॥ "పరిణామైకత్వా ద్వస్తు తత్త్వమ్"**

భా॥ పరిణామము ఏకమగుటవల్ల గుణములు అనేకమైనను దీపము అనగా ప్రమిద, నూనె, వత్తి, జ్యోతి ఇవి అన్నియు కలిసిననే దీపమగును. ముందు వేర్వేరుగా యున్నను జ్యోతి వెలిగిన దంటే ఆ మూడు ఒకటే యగును. అలాగే అంగా, అంగీభావము అనగా సమన్వయము అనగా నూనెవత్తి జ్యోతి ఈ మూడు కలిసి ననే దీపము. ఏ పదార్థములకు అంగ అంగీభావము ఉంటుందో అవి అన్నియు అనగా ప్రకృతి మొదలు ఘటపర్యంతముండే పదార్థము

లన్నియు త్రిగుణాత్మకములే. గుణములు వేరైనా వస్తువుమాత్రము ఒక్కటే యోగాచారమతము క్షణిక విజ్ఞానము అనగా ఒక వస్తువును బుద్ధి సృష్టించుట జ్ఞానము. వైరాగ్యమంటే బుద్ధి. ఆ బుద్ధి రూపజ్ఞానము క్షణికమే. శాశ్వతముగా కనుపించి ఒక్క క్షణము మాత్రమేయుండి నశించును. అంటే ఆ సంకల్పము పోతూ అట్టి పదార్థజ్ఞానమును సృష్టించి నశించుచుండును. ఈ ప్రకారము ఆ వస్తువు మీకు కనుపించునట్లుగా చేయును. అంటే ఆ వస్తు సంకల్పము కలిగి క్షణములో నశించును. అలా నశించుచూ ఇంకొక క్రొత్తది తన సదృశ్యమైన సంకల్పమును పుట్టించి నశించుచూ ఇలాగ కనుపించుచుండును.

15 సూ॥ వస్తుసామ్యే చిత్తభేదాత్ తయోర్వి భక్తః పన్థాః॥

భా:- వస్తువు ఒక్కటిగా యున్నను చిత్తముల నేకములగుట వలన అనగా ఒక స్త్రీ భర్తకు భార్యగా, బిడ్డకు తల్లిగా, సపత్నికి విరోధిగా, సోదరునకు సోదరిగా, భిన్నభిన్నముగా కనుపించుటలేదా అలాగే జ్ఞానములు అనేకము. వస్తువు మాత్రము ఒక్కటే అలా అనేకమగుటకు చిత్తభేదములు కారణము జ్ఞానము వేరు, వస్తువు వేరు. జ్ఞానము వస్తువు ఒక్కటేయనుట కుదరదు.

14-9-1974 శనివారము

అద్వైత వేదాంతులలో సృష్టి, దృష్టి వాదము సృష్ట, దృష్టి వాదము అని రెండు రకములుయున్నది. ముందే పదార్థములు సృష్టింపబడియుండును. ఆయున్న పదార్థముల జ్ఞానము తరువాత వ్యక్తులకు తెలియును. దృష్టి, సృష్టివాదమనగా వస్తుజ్ఞానము కలిగిననే ఆపదార్థముయుండును. వస్తు జ్ఞానముపోతే పదార్థము అనగా ఆవస్తు జ్ఞానము ఎంతసేపుయుండునో అంతసేపు ఒక్కటే జ్ఞానమని అంటారు యోగులు. అలా కాక, క్షణిక విజ్ఞాన వాదము అనగా

ఒకటిపుట్టి అది నశించిపోతూ మరల యింకొక దానిని తన సద్వృత్త్యాత్మైన సంకల్పము పుట్టినశించునని అందురు. దృష్టి అంటే జ్ఞానము. ఎప్పుడు దృష్టి కలిగినదో అప్పుడే పదార్థము పుట్టి కనుపించును. ఆ జ్ఞానము పోయినచో పదార్థముకూడ పోవును. దృష్టి సృష్టి వాదులలో పారమార్థిక సత్తా, ప్రాతిభాషిక సత్తా వీరు తీవ్ర వాదులు కనుక ఎల్లప్పుడూ "అహం బ్రహ్మాస్మి" దృష్టిలో ఉందురు. మిగత అంతా మిథ్య అని వారి భావము.

వేదాంతులలో రెండవ రకము పారమార్థికసత్తా, ప్రాతిభాషికసత్తా, వ్యావహారికసత్తా యని మూడు సత్తాలుండును. వ్యావహారిక అంటే బాహ్య వస్తువులను తెలిసికొని ఉపయోగించుట. ఇది ఎప్పుడు పోవునంటే "అహంబ్రహ్మాస్మి" దృష్టి కలిగినచో ఈ వ్యవహారము పోవును. విదేహముక్తి అంటే దేహము లేని వాడు జీవన్ముక్త దశలో పదార్థములు యుండును గాని అవి కలలోని పదార్థములవలే యుండును. ఆ పదార్థములు కనుపించినను కలలోని వస్తువులవలె మిథ్య అని, అహంబ్రహ్మాస్మి యను భావములో నుందురు. రజ్జువు సర్పముగా కనిపించినదంటే చూచినపుడు త్రాడు సర్పముగా పుట్టి కనిపించినది. ఈ ప్రపంచములో అన్నియు అజ్ఞానము వల్లనే పుట్టును. అలాగే త్రాడును ముందు అజ్ఞానము వలన సర్పమనుకొన్నాడు. బాగా దగ్గరకు పోయి చూచి అయ్యో పామనుకొన్నానుగాని కాదు త్రాడు అనుకొన్నపుడు అప్పటివరకు యున్న పాము ఏమైపోయినట్లు? అంటే ఆ కల్పనకు హేతువైనది ఒకటి యున్నదే అదే అజ్ఞానము.

అజ్ఞానము వలన దాని నిజము తెలియక కల్పనకలిగి పాము అని అనిపించినది. చూడగా ఆ పాము అధిష్టానముగా మిగిలి యున్నది. అంటే రజ్జురూపముగా మిగిలియున్నది. లోకములో త్రాడుయందు పాము కనిపించును యిది దృష్టాంతము. ద్రాష్టాంత

కము అనగా ప్రపంచము. బ్రహ్మమునందు అనగా బ్రహ్మయే అందరికి ప్రపంచముగా కనుపించుచున్నది. బ్రహ్మమే భ్రాంతివల్ల ప్రపంచముగా కనుపించుచున్నది. ఈ విధముగా ఎంతవరకు కనుపించునంటే నీకు బ్రహ్మజ్ఞానము ఎప్పుడు దృఢముగా కలుగునో అప్పుడు ప్రపంచభ్రాంతి పోవును. అది ఈ జన్మగాని, ఇంకెన్ని జన్మలుగాని యుండి బ్రహ్మజ్ఞానము కలిగిననే గాని ప్రపంచభ్రాంతి పోజాలదు. అధిష్ఠానమంటే దేనియందు కల్పన కలిగినదో అదే బ్రహ్మయందు కల్పింపబడిన ప్రపంచము. జ్ఞానము కలిగిన వో అధిష్ఠానమైన బ్రహ్మముగా గోచరించును. అనగా అప్పుడు కల్పితము భ్రాంతి నశించి యథార్థమైన బ్రహ్మపదార్థమే గోచరమగును. పాము త్రాడుగా మిగిలిపోయినట్లు ప్రపంచభ్రాంతి పోయినచో బ్రహ్మముగానే మిగిలిపోవును.

శ్లో॥ యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ॥

భా॥ ప్రపంచము సత్యము కాదు. లోపల ఏ భావముంటే ఆ భావముగానే కనుపించును. ప్రహ్లాదునకు శ్రీ మహావిష్ణువు శంఖ, చక్ర, గదాదులతో కనుపించెనా? లేదు సగము మనుష్యుడిగా, సగము, సింహమువలె ప్రత్యక్షమయ్యెను. అంటే హిరణ్యకశిపుడు రాత్రిగాని, పగలుగాని, బయటగాని, లోపలగాని, మనుష్యుడుగాని, మృగముగాని, వీటిలో దేనిచేతను తాను చావకూడదని కోరుకున్నందున ఆ రూపముతో వచ్చి గడపమీద పెట్టి. రాత్రి పగలు కాని సంధ్య సమయములో మనుష్య మృగరూపము ధరించివచ్చెను. శత్రు మిత్రులనే జాతి వేరుగానున్నదా లేదు. ఒకడు ఒకనికి మిత్రుడైతే ఇంకొకనికి శత్రువుగా నుండును. అందుచేత ప్రపంచమంతయు కల్పితము, భ్రాంతి, శత్రు మిత్రుల భావము అంతా కల్పితము వల్లనే అట్లు గోచరించును. ఇది దృష్టి, సృష్టి భావము భగవంతునియందు గలది పారమార్థికసత్తా. జ్ఞానము ఎప్పుడు

యుండునో అప్పుడు పదార్థముండును. అజ్ఞానము పోయినచో పదార్థము పోవును. ఇదే ప్రాతిభాసిక సత్తా. స్వప్నములో పదార్థములు మెలకువవస్తే పోయినట్లు సృష్టి, దృష్టి, వాదము పదార్థములు ఎప్పుడు యుండునుగాని తనకు జ్ఞానము కలిగినప్పుడు ఆ పదార్థము గోచరించును. ఒక వస్తువును రాత్రి ఒకచోట పెట్టి నిద్ర లేచిన తర్వాత చూచినచో ఆ వస్తువు అక్కడే యుండును. యిది సృష్టిదృష్టివాదము. అనగా వీరు తీవ్రవాదులు. వీరు ఎప్పుడు బ్రహ్మదృష్టిలో యుండి బహిః దృష్టికి వచ్చినచో సృష్టి కనుపించును. కొద్దిసేపేయుండి మరల బ్రహ్మదృష్టికి పోయెదరు. ఇట్టి వారు దృష్టిసృష్టవాదులు వీరు వాదమును ఖండించుచున్నారు.

సూ॥ నచైక చిత్త తన్త్రం వస్తుతద ప్రమాణి
కం తదా కిం స్యాత్॥

భా॥ దృష్టి సృష్టి వాదులు ఏకచిత్త తంత్రము అనగా ఇది ఘటము అని తెలియుటకు నేత్రము కిరణరూపముగా ప్రసరించి ఎదుటి వస్తువునందు ప్రసరించును. అంతఃకరణము నేత్ర కిరణము ద్వారా ఘటము మీదకు వెళ్ళి తదాకారమును ధరించును.

ఆవరణము వృత్తి తొలగించును. అంటే ముందు ఘటమును చూడనప్పుడు తెలియదుగా ఆ తెలియని దానిని తొలగించుటచే ఆవరణ తొలగుట అనేది. అప్పుడు చిదాభాసులు, ఇది ఘటమని ఘటజ్ఞానమును కలిగించును. ఈ ప్రకారముగానే మనము సమస్తమును తెలిసికొనుచున్నాము. దృష్టి, సృష్టి వాదులు త్రాడును చూచి పాము అనుకొన్నారు. బాగా చూచినచో అక్కడ సర్పము లేదు. ఉన్నది త్రాడే అలా భ్రాంతి కలుగుటకు ఏదో ఒక అధిష్ఠానము అక్కడ యుండుటవల్లనే భ్రాంతికలుగు అవకాశముండును. యిది దృష్టి, సృష్టి వాదులు చెప్పేది. అసలు జ్ఞానము లేని వారికి అతిరిక్త సత్తాకూడ అంగీకరించవలెను. తీవ్రవాదులు పారమార్థిక,

ప్రాతిభాసిక, సత్తాలనే అంగీకరింతురు. వీరు ఎల్లప్పుడు పరమాత్మ దృష్టిలో నుండి బయటకు వచ్చినచో సృష్టి వుండును. వీరికి బ్రహ్మ సత్యం జగన్మిథ్య అనే భావముండును. వేదాంతులు అంటే దృష్టి సృష్టి వాదులు. వీరు పారమార్థికసత్తా, ప్రాతిభాసికసత్తా, వ్యావహారిక సత్తాయని మూడురకములుగా చెప్పిరి. అనగా అజ్ఞానుల కొరకు వ్యావహారిక సత్తానుకూడ జ్ఞానుల దృష్టిలో మాత్రము పారమార్థిక సత్తాయే.

యోగులలో ప్రకృతికూడ సత్యమందురు. మిగతావారు 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' అంటారు. యోగులు పరమాత్మ ఎట్లు సత్యమో పదార్థముకూడ అంతే సత్యమని చెప్పుదురు.

17-9-1974 మంగళవారము

17 సూ॥ తదుపరాగా పేక్షిత్వా చిత్తస్యవస్తు జ్ఞాతాజ్ఞాతమ్॥

భా॥ చిత్తమునకు విషయములు ఒకప్పుడు తెలియును. ఒకప్పుడు తెలియదు. ఎప్పుడు తెలియవలెనను నియమము లేదు. మనము చూచిన వస్తువును కన్ను ద్వారా అంతఃకరణ తదాకారమును పొందును. అంటే నేత్ర కిరణము దేనిని స్పృశించునో చిత్తము తదాకారమును పొందును. యేసమయమున విషయము నకు ఇంద్రియ సన్నికర్ష ద్వారా చిత్తముతో సంబంధము కలుగునో అప్పుడావిషయము గోచరమగును. చెరువులో నీరు తూము ద్వారా కాలువలో ప్రవేశించును. ఆ కాలువ పొలమునకు సంబంధించి యుండును. అనగా చెరువు తూము ద్వారా కాలువలో ప్రవేశించును. ఆ కాలువ పొలమునకు సంబంధించి యుండును. అనగా అంతఃకరణ చెరువు తూముద్వారా అనగా వృత్తి నేత్రగోళములో ప్రవేశించును. దీనినుండి కిరణము అనగా కాలువలో ప్రవేశించి కిరణమునుండి విషయములో అనగా పొలములో ప్రవేశించును. అప్పుడు విషయము పొలమైనది. పైని చెప్పిన ప్రకారము జరిగి ననే మనము విషయమును తెలిసికొనగలము.

18 సూ॥ సదాజ్ఞాతాశ్చిత్త వృత్తయ స్తత్ప్రభోః
పురుషస్యా పరిణామిత్వాత్ ॥

చిత్తవృత్తులు ఎల్లప్పుడు తెలియుచునే యున్నది. ఆ చిత్త వృత్తులకు ప్రభువు అగు పురుషుడు పరిణామము లేనివాడగుటచే సర్వకాలములయందు చిత్తవ్యాపారములు చిత్తము తదాకారము బొందిన పుడు విషయములు తెలియును. చిత్తము తదాకారము పొందక పోయినచో ఆ విషయము తెలియదు. పురుషుడు అంతః కరణలోయున్నాడు. మనకు కలిగేటి వృత్తులు అంతఃకరణలోనే కలుగును. కనుక అక్కడనేయున్న పురుషునకు వెంటనే తెలి యును. ఆయన చిత్తవృత్తివలె పరిణమించేవాడు కాడు కనుక కలిగిన విషయములన్నియు తెలియబడును. చిత్తము విషయాకార ముగా పరిణమించునట్లు పురుషుడు వృత్తి ఆకారముగా పరిణమించే వాడు కాదు,

పురుషుడు ఉండేది అంతఃకరణలోనే కనుక ముల్లు గుచ్చు కొన్నచో వెంటనే తెలియునుగాని కొంత ఆలస్యమైన తర్వాత తెలియునా! అంటే కాదు అంతఃకరణములో వృత్తి పుట్టినదంటే చాలు పురుషునకు తెలియును. చిత్తవృత్తులు జడములు. పురు షుడు చైతన్య స్వరూపుడు కనుక పురుషుని యొక్క చైతన్య సమీ పములో యున్న చిత్తవృత్తులను ఆ చైతన్యము తెలిసికొనును.

అంతఃకరణ విషయాకారముగా పరిణమించిననే మనకు తెలియును గాని పురుషుని విషయములో అట్లుగాదు, అంతఃకర ణలో కలిగిన సమస్త వృత్తులు, పురుషునకు తెలియును ఆత్మ అంద రకు ప్రత్యక్షముగానే యున్నది. ఎలాగునంటే నేను, నేను అంటూ ఆత్మవస్తువు భాసించుచునే యున్నది. చిత్తము పరిణామి పురుషుడు అపరిణామి, కనుక ఎల్లపుడు చిత్తవృత్తులను తెలిసి కొనును. పురుషుడు కూడ పరిణామి అయినచో చిత్తవృత్తులు ఒక

ప్పాను తెలియును. ఒకప్పాను తెలియబడవని చెప్పవలసి వచ్చును, కాని అలాపరిణామి కాదు కనుక సుఖదుఃఖములలో ఏది కలిగినను అంతఃకరణము తెలియును. అది అంతయు ఎప్పుడిక ప్పాను పురుషుడు గ్రహించుచునే యుండును.

19 సూ॥ న తత్స్వాభాసం దృశ్య త్వాత్॥

భా:- చిత్తము దృశ్యమైనది. అది స్వయం ప్రకాశమైనది కాదు. పురుషుడు స్వయంప్రకాశుడు. ఎప్పుడూ సోఽహం సోఽహం అని అనగా అతడే నేను, అతడే నేను అతడు అనగా పరమాత్మ. నేను అనగా జీవుడు సోఽహం అంటే ఆ పరమాత్మనేనే ఈ జీవుడనైన నేనే ఆ పరమాత్మనని మనకు తెలియకపోయినప్పటికి సోహం జపము రోజుకు 21600 సార్లు జపము జరిగిపోవుచునేయున్నది, మనము మాత్రము గ్రహించలేకపోవుచున్నాము, జీవాత్మయే పరమాత్మ ఘటాకాశము మహాకాశమే గాని వేరుగా లేదు. మహాకాశమువలె పరమాత్మ అంతటా వ్యాపించియున్నాడు. ఘటాకాశము వంటిది ఈ శరీరము. అనగా జీవాత్మ అనండి అంతఃకరణ అనండి పరమాత్మ సర్వత్ర వ్యాపించియున్నాడు. ఉపాధివల్ల జీవాత్మ అని అనుచున్నాము ఆ జీవాత్మయే పరమాత్మ, వేరుగాదు

పతంజలి ప్రణీత యోగమును సేశ్వర సాంఖ్యమని అందురు. వీరు ఈశ్వరుని అంగీకరించిరి. సమాధి సిద్ధి కలుగవలెనని న ఈశ్వరుని భక్తితో శరణు పొందినచో త్వరలో వారి సాధనలు సిద్ధించునని వారి మతము,

నిరీశ్వర సాంఖ్యులు పురుషుడు, ప్రకృతి అంతే వేరే ఈశ్వరుడనేవాడు లేడు అన్నారు. వేదాంతులు కూడ ఒకే దేవుడు అనేక జలపాత్రలో ప్రకాశించినట్లుగా ఒక్కడే పరమాత్మ అనేక జీవులుగా యున్నాడనేది ఒక వాదము. జీవుడనగా హిరణ్యగర్భుడు వీనినే బ్రహ్మదేవుడంటాము. ఈయనే మొదటి జీవుడు. మిగత

వారందరు స్వప్న సదృశులని అందురు. అనగా నిద్రలో స్వప్నములో లక్షలాది జనముగల సభను చూచుచున్నాడు, కాని స్వప్నము వచ్చినవాడు ఒక్కడే కదా వీడే సత్యము. స్వప్నములో కనుపించిన జనమంతయు కల్పితమే. అని ఏకజీవవాదులనే వారు కొందరున్నారు. అద్వైతులు ఒక్కడే పరమాత్మ ఉపాధులవలన అనేకముగా కనుపించునని అందురు.

## 18-9-1974 బుధవారము

20 సూ॥ ఏకసమయేచో భయానవధారణమ్॥

భా॥ చిత్తము స్వప్రకాశము కాదు. దృశ్యమని చెప్పబడినది. చిత్తము స్వప్రకాశమని అంగీకరించినచో యింకను దోషము వచ్చును. చిత్తము ఘటాకాశముగా పరిణమించినందున ఘటము గోచరమగునని ఇదివరలో చెప్పడమైనది. చిత్తము ఘటము. పురుషుడు అనగా చిత్తము. ఘటమును చూచినపుడు పురుషుడు దానిని గ్రహించుకొనేది అసలు అంగీకరించినది.

నాస్తికునకు పురుషుడు అని వేరు వేరు చిత్తమే ఆత్మ అనుకొని వారు చెప్పునది ఏమంటే చిత్తమే ఘట పటాది పదార్థములను ప్రకాశింపజేయును. అని చూడవదగు పురుషుని అంగీకరించరు. ఘటము పటము అని తెలిసికొనుటకు ప్రకాశింపచేయునది చిత్తమే అంటాడు నాస్తికుడు. వేరేపురుషుడు అనగా ఆత్మలేదు చిత్తమే తాను ప్రకాశించి ఘటపటాదులను ప్రకాశింపజేయును. యిక పురుషుడెందుకు అని అనెదరు.

అయితే చిత్తము జడముగదా! అది తనకు తాను ప్రకాశించలేదు గదా! ఇక యితరమును ఎట్లు ప్రకాశింపజేయును? చిత్తము దృశ్యము జడము. పురుషుడే ఘటపటాదులను ప్రకాశింపజేయునని సిద్ధాంతి తన మతమును నిలబెట్టుకొన్నాడు. ఓ నాస్తికుడా! పురుషుని అంగీకరించక చిత్తమే స్వప్రకాశమని అన్నచో

ఇంకొక దోషము వచ్చును. అనగా ఉభయానవధారణమను దోషము వచ్చును. క్షణిక విజ్ఞానము దృశ్యము, జడము కనుక అధికముగా పురుషుని అంగీకరించవలెనని సిద్ధాంతి చెప్పెను.

తాను ప్రకాశించి ఘటపటాదులను ప్రకాశింపజేయుదానిని జన్య, జనక భావమందురు. అంటే బుద్ధి జనకము ఘటపటాదులు జన్యములు అగును. క్షణిక వాదులు ఒకే సమయములో బుద్ధిని ఘటమును తెలిసికొనలేరు. బుద్ధియున్నప్పుడు ఘటము లేదు. ఘటము పుట్టినదంటే బుద్ధిలేదు అంటే రెండింటి అనుభవము ఒకే చిత్తము తనను తాను ప్రకాశింపజేసుకొంటూ ఇతరమును ప్రకాశింపజేయజాలదు. కనుక పురుషుని అంగీకరించవలెను. బుద్ధియున్నప్పుడు ఘటము లేదు. ఘటము ఉంటే బుద్ధిలేదు. పురుషుని అంగీకరించినచో ఘటముపోయినచో బుద్ధిని, బుద్ధిపోతే ఘటమును పురుషుడు ప్రకాశింపజేయును. పురుషుడే చిత్తమును పదార్థములను ప్రకాశింపజేయును. మరల నాస్తికుడు అంటున్నాడుగదా పోనీ చిత్తము జడము దృశ్యము అన్నారు. బుద్ధిగాకపోతే యింకొకటి ప్రకాశింపజేయునని అనుకొనకూడదా! పురుషుని మధ్యలో ఎందుకు ఒప్పుకొనవలెనని ప్రశ్నించెను.

21 సూ॥ చిత్తాంతర దృశ్యేబుద్ధి బుద్ధేరతి ప్రసంగః స్మృతి సంకరశ్చ॥

అధిక ప్రసంగము అనే దోషము గురించి చెప్పుచున్నారు. జనకబుద్ధి జన్యపదార్థములు క్షణికములు. కనుక క్షణిక విజ్ఞానవాది అన్నను, నాస్తికుడన్నా, బౌద్ధుడన్నా ఒకటే. ఒక బుద్ధి ఇంకొక బుద్ధి అని సిద్ధాంతి చెప్పినచో అధికప్రసంగమను దోషము వచ్చును. అలాగే ఆ బుద్ధివల్ల ఇది ప్రకాశించినది. ఇంకొక బుద్ధి వల్ల మరియొకటి, మరియొక బుద్ధివల్ల ఇంకొకటి ప్రకాశించునని అంగీకరించినచో స్మృతులకు సాంకర్యము కలుగును. కనుక పురు

షుని అంగీకరించినచో చిత్తము పదార్థములు క్షణికములైనను పురుషుడు అన్నిటినీ చూస్తాయంటను పురుషుడనే వాడు యున్నాడనే సిద్ధాంతి చెప్పెను. దీనివలన అధిక ప్రసంగము లేదు. స్మృతి సాకర్యముకూడ ఉండదని యోగిమతమును నిలబెట్టుకొన్నాడు. పురుషుడు నిర్వికారుడు, కూటస్థుడు. కనుక ఆయన చిత్తమును ఎట్లు ప్రకాశింపజేయగలడు? ఆయనకు క్రియలేదు కనుక చిత్తమును ఎట్లు ప్రకాశింపజేయును. పురుషుడు పరిణామము లేనివాడు. బుద్ధి పరిణామముగలది. కనుక బుద్ధి ఘటాకారమును పొందును. అని అడుగుచున్నాడు బౌద్ధుడు అంటేనాస్తికుడు.

19-9-1974 శుక్రవారము

22 సూ॥ చిత్తేరప్రతిసంక్రమాయాస్తదాకారాపత్తౌస్వబుద్ధి
సంవేదనమ్॥

పురుషుడు కూటమువలె నిర్వికారుడే. బుద్ధివలె ఆయన పదార్థాకారమును పొందడు. సూర్యుడున్నాడు. వాని ప్రతిబింబము చెరువులు, కాలువలు మొదలగువాటిలో పడును. ప్రతిబింబము చలించునుగాని బింబమునకు చలనము లేదు. అట్లే పురుషునిలో ఏ విధమైన వికారము లేకపోయినా ఆ ప్రతిబింబము బుద్ధి మీదపడినప్పుడు దానిని బుద్ధి అంటున్నాము. సూర్యుడు నిశ్చలముగాయుండును. కదలడు భూమి తిరుగుచున్నదని శాస్త్రకారుల నిశ్చయము గదా కాని మనకు సూర్యుడు ఉదయించినట్లు అస్తమించినట్లు కలుగుటకు భూమియే కారణము. ఆ సూర్యబింబము నీళ్ళలో ప్రతిబింబించి చెరువు నీటిలో పడును. ఆ జలము చలించినచో బింబము చలించినట్లు కనుపించునుగాని సూర్యునకు చలనమున్నదా? లేదు. అలాగే పురుషుడు నిర్వికారుడే. అయినా బుద్ధి శుద్ధమైనది. అనగా అపంచీకరణ సమిష్టి సత్వమునుండి బుద్ధి

పుట్టును. కనుక బుద్ధిశుద్ధమైనది. ఆ శుద్ధమైన బుద్ధిలో ఆత్మప్రతిబింబము పడును. ఆ ప్రతిబింబము బుద్ధిలో ప్రవేశించుటచే యిది బుద్ధి అని కలుగుచున్నది. కనుక పురుషునిలో పరిణామము లేదు. బుద్ధివృత్తి విషయాకారముగా చెంది ఆ ఆవరణను తొలగించును. పురుషునకు పరిణామము లేదు బుద్ధికి పరిణామముయున్నది. కనుక ఘటాదులతో సంబంధమువల్ల తదాకారమును పొందును. చైతన్యమునకు బుద్ధితోగాని ఘటాదులతోగాని సంబంధము లేదు.

సూర్యునకు జలమునందు ప్రతిబింబముయున్నట్లుగా చిత్ శక్తి, బుద్ధియందు ఎప్పుడు ప్రతిబింబించునో, అప్పుడు బుద్ధికి చిదాకారము వచ్చినది. అపుడు పురుషునకు బుద్ధి భోగ్యమైనది. పురుషుడు భోక్త అగును పురుషుని ప్రతిబింబము, బుద్ధిలోపడును. ప్రతిబింబమును బుద్ధి గ్రహించును. అపుడు బుద్ధి ప్రతిబింబములో సంబంధముకలదైనది. అంటే చిత్త బుద్ధిని ప్రకాశింపజేసినదైనది. అంటే బుద్ధికికూడ పురుషాకారము వచ్చినది. పరమాత్మ అతి సూక్ష్మము కదా! అంత అతి సూక్ష్మమైన ఆత్మ బుద్ధియందు ప్రతిబింబించునా అంటే ప్రతిబింబించునని అనుచున్నారు. సరి ఆత్మకు ఒక రూపము ఉన్నచో అద్దములో ప్రతిబింబించును. రూపము లేనిది ఎట్లు ప్రతిబింబించునని సంశయము. రూపము, రూపరహితమని రూపము గుణములలో చేరును. ఎరుపు, నలుపు, మొదలైననవి గుణములు. ఇవే రూపములు, రంగునే రూపమందురు గుణములుంకొక గుణము కలదికాదు ఒకరూపములో ఇంకొకరూపముయుండదు. కనుక రూపము రూపరహితమే అన్నారు. ఆకాశమునకు రూపము లేదు. వాయువునకు రూపము లేదు. స్పర్శయున్నది. వేడిగాలి, చల్లగాలి అని తెలియును. ఈగాలికే రూపము లేకపోగా కారణమైన ఆకాశమునకు రూపము ఎక్కడిది. కాని దానికి ప్రతిబింబము యున్నది. ఎట్లంటే మొలలోతు నీటివద్దకు వెళ్ళిచూడండి.

ఆ నీరు కదలకుండయున్నచో ఆకాశ ప్రతిబింబము కనుపించును అలాగే రూపరహితమైన వాడే కూటస్థుడు. కూటస్థుడు నిత్యుడు, నిర్వికారుడు అయినను వాని ప్రతిబింబము బుద్ధిలోపడును. ఆత్మ రూపరహితమైనదైనను బుద్ధిలోపడును. ఆకాశము రూపరహితమైనను మోకాలులోతు నీటిలో ఆకాశ ప్రతిబింబము కనుపించునట్లు పురుషుని ప్రక్కనేయున్న బుద్ధిలో ప్రతిబింబము పడును. మనకు కూడ ఆత్మజ్ఞానము కలుగవలెనంటే బుద్ధిశుద్ధముగా యుండవలెను బుద్ధిలో మల, విక్షేప, ఆవరణ దోషములుండును, అవియును పోయినచో ఆ శుద్ధమైన బుద్ధిలో ఆత్మప్రతిబింబించును. "బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అన్నారు. ఇంద్రియముల చేత గ్రహింపబడినదని చెప్పబడియున్నది.

శ్రవణ, మనన, నిధి, ధ్యాన నిర్వికల్ప, సమాధిద్వారా శుద్ధబుద్ధిద్వారా గ్రహింపబడును. అంతేకాని మలినబుద్ధికి గోచరము కాదని చెప్పితేకాని అసలే గోచరము గాదని కాదు. ఎవరు బుద్ధిని ఆ ప్రకారము సంస్కరించుకొంటారో వారికి గోచరమగును. పూర్వము కూడ అంతే, ఇపుడుకూడ అంతే బుద్ధిని సంస్కరించుకొన్నవారు ఎవరైనా సరే ధన్యులైపోతారు. సందేహము లేదు.

ఆత్మ ప్రతిబింబమువల్లనే ఆత్మజ్ఞానమును గ్రహించవలెను. కొన్నిచోట్ల ఆత్మబుద్ధికి గ్రాహ్యము కాదని చెప్పబడియుండును. అంటేఆబుద్ధి మందబుద్ధి కలవారిదని గ్రహించుకొనవలెను. "సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అనగా సూక్ష్మ దర్శులైనవారికి గోచరమగును. అంటే శుద్ధబుద్ధికి గ్రాహ్యమగునని గ్రహించవలెను. జ్ఞాని అనగా తెలిసినవాడు అనగా శుద్ధబుద్ధివలన గ్రహించినవాడని అర్థము. అనగా ఆత్మ నేనే అని తెలిసికొనును "అహంబ్రహ్మాస్మి" అని తెలిసికొనును. ఆత్మ ప్రతిబింబము బుద్ధిలో పడును. దానివలననే మనము ఆత్మజ్ఞానమును సంపాదించుకొనవలెను. సాధన చేయు

నది ఆత్మను పుట్టించుటకు కాదు. బుద్ధిని సంస్కరించుకొనుటకే చేయబడే సాధనలు. ఆత్మ సిద్ధవస్తువు. అది పుట్టేది కాదు. ఘటాది పదార్థములు కొన్ని క్రియలవలన పుట్టును. ఆత్మ ఎప్పుడూ ఉన్నది. అది పుట్టేది కాదు అయితే అది ఉన్నదన్న జ్ఞానము మాత్రము లేదు. ఆకాశ గరుడగడ్డ అనేది భూమియొక్క సంబంధము లేకనే కంపలు మీద పందిరిమీద అల్లుకొనును ఆకాశగరుడగడ్డ ఒకరి దొడ్డిలో యున్నది వారి ఇంటిలో ఇద్దరు ముగ్గురు పాము కరచినందున చచ్చిపోయిరి. ఆగడ్డను అరగదీసి ఆ పాము కాటు వేసినచోటు రాసి నచో వారు బ్రతికెదరు. అయితే వారి దొడ్డిలో అట్టిమందు యున్నను ఆయింటివారికి ఆసంగతి తెలియనందున కొందరు చనిపోయిరి కదా! మందు యున్నను ఉపయోగపడు సంగతి ఆ యింటివారికి తెలియ లేదు అట్లే ఆత్మ అందరిలోను అన్ని జీవరాశులలోను ఉన్నది ఆత్మ లేక కాదు అందరూ కష్టాలు దుఃఖాలు పొందేది. ఆత్మ చీమ. దోమలలో కూడ యున్నది కాని, ఆ సంగతి ఎందరు గ్రహించిరి? అట్టి ఆత్మ ఎక్కడ యున్నదనిన "హృద్దేశేర్జున తిష్ఠతి" అందరి హృదయములలోనుయున్నది కాని అందరూ దర్శించగలుగుచు న్నారా! అందరికీ బుద్ధియున్నది. ఆత్మయున్నది కాని ఆత్మను దర్శించలేక పోవుచున్నారంటే ఉన్న బుద్ధి మలినమైయున్నది. ఆ మలినముపోయి శుద్ధమైన బుద్ధిగా సంస్కరించవలెను. అలాగున బుద్ధిని సంస్కరించినచో ఎక్కడో లేదు తనలోనే ఆత్మయున్నది. ఈ కార్యక్రమములన్నియు బుద్ధిని సంస్కరించుకొనుట కొరకే తీవ్ర ప్రయత్నము చేసినచో ఈ జన్మలోనే పొందవచ్చును. తీవ్ర ప్రయత్నమంటే ఈ జన్మలోనే అనేక జన్మలు గడచిపోవును. ప్రయత్నము చేయనిచో ఉన్న చోటనే యుండును. అనేక జన్మలు గడచినా అక్కడేవుండును. కనుక అందరూ తీవ్రప్రయత్నము చేసి బుద్ధిని సంస్కరించుకొని నిత్యశుద్ధబుద్ధ ముక్త స్వరూపులుకండి.

20-9-1974 శుక్రవారము

చిత్తముకంటే పురుషుని అంగీకరించవలెను. లేనిచో పదార్థ జ్ఞానము బాగుగా కలుగదని సిద్ధాంతి చెప్పెను.

23 సూ॥ ద్రష్టృ దృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్॥

చైతన్యముతో దృశ్యపదార్థములకు సంబంధమైన చిత్తము సమస్త విషయములు కలదగును. ద్రష్ట పురుషుడు, దృశ్యము, ఘట, పటాదులు ఈ రెండింటికీ సంబంధము గల చిత్తము యీ ఘటపటాదులు చిత్తము వలన భాసించుటకు కారణము. పురుషుని ప్రతిబింబము చిత్తము మీదపడుటవలన ఆ పదార్థములు ప్రకాశించును. కాని జడమైన చిత్తమువలన ఘటపటాదులు ప్రకాశింపజాలవు. అపంచీకృత పంచభూతములయొక్క సమష్టి సత్వమంతా కలిసి చిత్తమైనది. సత్వమునుండి పుట్టినది గనుక శుద్ధమైనది, కనుకనే ప్రతిబింబమును గ్రహించు సామర్థ్యమును కలిగినది. గోడయున్నదంటే అది మట్టియే. అద్దముకూడ మట్టి సంబంధమే అయితే ఏమి? అద్దములో ప్రతిబింబము కనుపించును గోడలో కనుపించునా లేదుగదా! అద్దము శుద్ధమైనది. కనుక ప్రతిబింబము కనుపించును. ఆ రీతిగానే అంతఃకరణ కూడ కేవల సత్వమువలన పుట్టినది కనుక ప్రతిబింబ సామర్థ్యమున్నది, పురుషుని ప్రతిబింబము పడును, అలాగే ఘటపటాదుల ప్రతిబింబము పడును కాని జడమైన చిత్తము పురుషుని సాన్నిధ్యమువలన చైతన్యమైన దానివలె భాసించును అంటే అయస్కాంతము సన్నిధిలో ఇనుమునకు కదలిక వచ్చినదిగదా! కాని జడమైన యినుము అయస్కాంతసాన్నిధ్యమువలన చైతన్యమైన అయస్కాంత సన్నిధికి వచ్చును. ఆ రీతిగానే పురుషుని యొక్కయు ఘటపటాది పదార్థములుకూడ చిత్తములో ప్రతిబింబించుటవలన ప్రతిబింబ జ్ఞానము వల్లనే ఘటపటాదులు భాసించుచున్నవి. కాని సామాన్యుడు చిత్తమే చైతన్యము

కలది కనుకనే ఆ చిత్తము ఘటపటాదులను తెలిసికొనగలుగుచున్నదని భావించెదరు. కాని యోగులు బాగా గ్రహించి తెలిపినది ఏమనగా పురుషుడు వేఱుగా యున్నాడు. ఆ పురుషుని ప్రతిబింబము చిత్తములో ప్రతిఫలించి ఘటపటాదులైన దృశ్యములను గ్రహించుచున్నది. ద్రష్ట అయిన పురుషుడు దృశ్యమైన ఘటపటాదులు కలిగియున్నదానిని చిత్తమని అన్నారు. చిత్తు అనగా చైతన్య పురుషుని సన్నిధివలన వాని ప్రతిబింబము అంతఃకరణలో పడుటవలన అదే చైతన్యము కలదానివలె అయిపోయినది. అంటే ద్రష్టతో సంబందము కలది అయినది. పురుషుని సన్నిధిలో నుండుట వలన పురుష సంబంధము ఏర్పడినది ఇక దృశ్యమైన ఘటపటాదులకు చిత్తమునకు సంబంధమేట్లంటే ఇంద్రియములద్వారా అనగా మనస్సు, నేత్రకిరణములద్వారా వెళ్ళి ఎదుట గల వస్తువును చూచి తదాకారమగును. అపుడు చిత్తమునకు అటు పురుషునితోను, యిటు ఘటపటాదులతోను సంబంధము ఏర్పడును. ద్రష్ట దృశ్యములతో చిత్తము సంబంధము కలదైనది. అంటేపురుషునితో సంబంధమువలన చైతన్యము కలదానివలెయుండును. చిత్తము ఘటపటాది తదాకారము పొందును. కనుక విచారణ జ్ఞానము లేనివారు పురుషుడున్నందున చైతన్యవంతమైన చిత్తమును దృశ్యమును గ్రహించగలుగుచున్నదని జ్ఞానము వారికి లేదు. చిత్తము పురుషునితో సంబంధమువలన చైతన్యమైనది దృశ్యముతో సంబంధమువలన దృశ్య సంబంధమైన పదార్థములను పురుషునకు సమర్పించుచుండును. అంటే చిత్తము భోగ్యమగును. పురుషుడు భోక్త యగును. చిత్తమునీూద ప్రతిబింబము పడుటవలన చిత్తము చైతన్యమైన దానివలె యుండుటచే భ్రాంతిని పొంది చిత్తమే ఆత్మ అనుకొన్నారు. బౌద్ధులు అంటే నాస్తికులు చిత్తమున కన్నా

వేరుగా ఆత్మనంగీకరించుటకు హేతువుయొక్క అంతరమును తెలుపుచున్నారు.

24 సూ॥ తద సంఖ్యేయ వాసనాభిశ్చిత్రమపి పరార్థం
సంహత్యకారిత్వాత్॥

ఆ చిత్తము ఇన్ని అని లెక్కించుటకు వీలుకాని వాసనల చేత చిత్రముగాయున్నది. అవిద్య, అస్మిత అను క్లేశములకు సంబంధించిన వాసనలు శుక్లకర్మ కృష్ణకర్మ. శుక్ల, కృష్ణ కర్మలుగల చిత్తము. విపాకమంటే ఫలము. వీటి వాసనలతో కూడియున్న చిత్తములో యిన్ని అని చెప్పుటకు వీలుగా నన్ని సంస్కారములతో అంతఃకరణలో జన్మ జన్మములన్నియు ఇమిడియుండును. కనుక చిత్రముగా యుండును. అంటే కంసాలివానివద్దమైనపు ఉండకు అంటిన బంగారు రేకులవలె యుండును. "సంహత్యకారిత్వాత్" అనుపదమునకు గృహము అనేది ఒక్క వాక్యమే అయినా ఆ యింటికి ఎన్నో కలవవలెను కదా! మట్టి ఇటుకలు, కర్ర, ఇనుము సిమెంటు మొదలగునవి ఎన్నో కలిసిననే గృహము అయినది. అలాగే భోజనము అంటే ఒక్కమాటయేగాని అన్నము అనేక కూరలు ఫలహారములుయుండును గదా! అలాగే చిత్తము ఒక్కటే అయినా అనేక అనేక వాసనలు, వృత్తులు ఎన్నో ఉన్నవి. కనుక ఇది సంహత్యకారి అన్నారు. ఇల్లు ఉన్నదంటే ఆయిల్లు ఇతరులకు ఉపయోగపడునుగాని యిల్లు తనకు తాను ఏమియు ఉపయోగపడదుగదా! అలాగే ఈ మానవజన్మవచ్చినదంటే దీనికి ముందు 839999 జన్మములయొక్క సంస్కారములు అనేకము చిత్తములో యున్నవి. కనుక చిత్తము భోగ్యము పురుషుడు భోక్త అగును. వీనికి వివేకజ్ఞానము లేదు. అలాగాక వివేక జ్ఞానము కలవారు చిత్తము వేరు, పురుషుడు వేరు అనుజ్ఞానము పుణ్యసంస్కారముల వలన తెలిసికొనునో లేక గురుబోధవల్ల గ్రహించుటగాని జరిగి

వచో అపుడు అజ్ఞానము నశించి జ్ఞానము కలిగిపోవును. అనేక ములతోకూడిన పదార్థములు ఇతరుల కొరకు ఉపయోగపడును. అంటే గృహము భోజనము అనేవి మాడండి. అలాగే చిత్తమునకు అనేక సంస్కారాదులున్నవి. అవి చిత్తమునకు ఉపయోగపడవు గాని పురుషునకు ఉపయోగ పడునని యోగులు తమ సిద్ధాంత మును నిలబెట్టుకొనిరి.

21-9-1974 శనివారము

బుద్ధి జడము దృశ్యము. కనుక బుద్ధి కంటే పురుషుని వేరు వేరుగా అంగీకరించిరి. పురుషుని చైతన్యమును బుద్ధిమీద పడుట వలన బుద్ధి చేతనముగల దానివలె యుండుటచే ఇక వేరే పురుషుని ఎందుకు ఒప్పుకొనవలెను! బుద్ధి చైతన్యము వల్లనే ఘటపటాదు లను తెలిసికొనుచున్నదని అను దానిని ఖండించిరి. అనేక పదార్థ ములు కలసి ఒకటిగా యున్న దానిని సంహాత్యకారి అంటారు. ఇది ఇతరుల కొరకే ఉపయోగపడును. అనగా బుద్ధి క్లేశాదులు అనే కము కలది కనుక అది ఇతరుల కొరకేగాని తనకుగాదు. అది పురుషునకేగాని పురుషుడు లేకపోయినచో ఆ బుద్ధి వ్యర్థమే అగును. ఇల్లు ఉండి అందులో మనుష్యులు లేకపోయినచో వ్యర్థమే గదా! భోజనము సిద్ధముగా ఉండి, భుజించేవారు లేకపోయినచో ఆ భోజనము కూడ వ్యర్థమే.

25 సూ॥ విశేషదర్శిన ఆత్మభావ భావనా వినివృత్తిః॥

చిత్తమునకు, పురుషునకు భేదమును తెలిసికొన్న వారికి అజ్ఞాన దశలో బుద్ధివేరు తాను ఐన పురుషుడు వేరు అని తెలియుదు. వివేకజ్ఞానము కలిగిననే బుద్ధివేరు, పురుషుడైన తాను వేరు అను విషయము తెలియును. విశేషము తెలియుటవలన నేను వేరు అంటే పురుషుని ప్రతిబింబము బుద్ధిలో పడినచో ఆ బుద్ధియే నేను అని అనుకొనుటచే ఆ బుద్ధిలోయున్న దోషములన్నియు నావే అని

అనుకొనుచుందురు. బుద్ధికిగల సుఖదుఃఖము తనకే అని భావించి సుఖమును దుఃఖమును పొందును. అలాగాక చక్కగా యమ, నియమాది సాధన చతుష్టయములను ఎవరైతే చక్కగా అనుష్ఠించుచూ పోయెదరో వారి చిత్తము శుద్ధమై ఏకాగ్రత కలిగి ఆత్మానాత్మ విచారణ కలుగును. పురుషుడనైన నేను వేరు బుద్ధివేరని గ్రహించును. రాగ ద్వేషాదుల, కామక్రోధాదులున్నచో పడిపోవుచుందురు. విశ్వామిత్రుడు, దూర్వాసుడు, అలా పడిపోయిరి. అంతఃకరణ వేరు, పురుషుడు వేరు అను భేదభావము కలిగినవానికి ఆత్మతత్వము తెలియబడనప్పుడు తెలిసికోవలెనను జిజ్ఞాస యుండును. అది తెలిసిన తరువాత ఆ కైవల్యమునకు అధికారి యగును. ఆత్మతత్వమును తెలిసికొనవలెనను జిజ్ఞాస కలవాడే అధికారి ఆ జిజ్ఞాస ఎప్పుడు నివృత్తియగునంటే బుద్ధి వేరు పురుషుడు వేరు. బుద్ధి నేనుగాదు బుద్ధి నాదీకాదు అను వివేకమును ఎపుడు తెలిసికొనునో అట్టివాడు కైవల్యమును పొందును. అపుడు ఆత్మతత్వ వస్తువు తెలిసినది గనుక తెలిసికోవలెననే జిజ్ఞాస నశించిపోయినది. ఎవనికి పూర్వజన్మ పుణ్యము పక్వదశలో పడినదో అట్టివానికి జిజ్ఞాస కలిగి తత్వము తెలిసికొని అంటే పురుషుడు బుద్ధి వేరు వేరు అని తెలిసికొన్నంతనే కైవల్యము లభించును. ఆత్మను తెలిసికొనిన తరువాత వాని చిత్తము ఎట్లుండునని అడుగగా చెప్పుచున్నారు.

26 సూ॥ తదా వివేక నిమ్నం కైవల్య ప్రాగ్భారం చిత్తమ్॥

పురుషుని బుద్ధికి అలంబనముగల కైవల్యం వివేకనిమ్నం అంటే బుద్ధివేరు నేను వేరు అనుజ్ఞానము లేనపుడు బుద్ధియే నేను అనునది యున్నపుడు శబ్దాది విషయములు అలంబనముగా కలిగి విషయములయందు ఆసక్తి సంసారమునకు అవధిగాయుండును. అలాగాక నేను శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపుడనని భావించవలెను.

వివేకనిమ్నంగా యుండునంటే అది బుద్ధి పురుషుడు అంటే నేనే అనుభావము చిత్తమునకుండును. దీనికి చివరిదశ కైవల్యము. బుద్ధి వేరు, పురుషుడు వేరు, నేను వేరు ఆ నేనే పురుషుడు. అట్టి వానికి యిక సంసారము యుండదు. వివేక జ్ఞానము లేనపుడు బుద్ధియే నేను అనుకొనును. అపుడు ఆ బుద్ధి విషయములతో కూడి సంసారములో యుండును. యోగికి సాధనల వలన విషయములు నివృత్తియై వివేకమే అలంబనముగా గలదియగును. బుద్ధి వేరు, పురుషుడు వేరు. అనుభావము దృఢముగా యుండును. అప్పుడు ఆ చిత్తము కైవల్యము అలంబనముగా గలదిగా యుండును.

22-9-1974 ఆదివారము

యోగి ఎల్లప్పుడూ ప్రకృతి పురుష వివేకముగల చిత్తముతో ప్రవర్తించుచు. ఆత్మనిష్టలోయున్నచో భిక్షాటనాది కార్యములు జరుగునా అంటే సమాధానము చెప్పుచున్నారు.

27 సూ॥ తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః॥

వివేకము గలిగియున్నను లౌకిక సంస్కారములు పూర్తిగా నశించలేదు. కనుక అప్పుడప్పుడు బహిర్ముఖముగుచుండును. అలా బహిర్ముఖమునకు వచ్చినపుడు భిక్షాటనాదులు చేయుచుండును. ఉత్థాన సంస్కారాదులు పూర్ణముగా నష్టము కాలేదు. జ్ఞానము కలిగినది. కొద్ది కొద్దిగా లౌకిక సంస్కారములు యున్నందున అట్టి సమయములో తలంపులు పుట్టుచుండును. వాని నశింపునకు చెప్పుచున్నారు.

28 సూ॥ హానమేషాం క్లేశవదుక్తమ్॥

ఈ వ్యుత్థాన సంస్కారములకు కూడ పంచక్లేశములు అంటే రాగము, ద్వేషము, అవిద్య, అభినివేశాదులు అయిదు రకములు చెప్పి అవి బాగుగా వివేక ఖ్యాతి కలిగినచో పోవునట్లు ఇవి కూడ

పోవును. అనగా ప్రకృతి పురుష వివేకమువలన దగ్ధమై మరల ఆ అవిద్యాది క్లేశములు పుట్టవు. ఆ రీతిగా ప్రకృతి పురుష వివేక ఖ్యాతి వల్లనే అనగా అభావము బాగా పక్వదశలో పడినచో యిక సంస్కారములు పుట్టవు. అలా పక్వదశలో పడనంత వరకు ఇదివరలో చేసియున్న సంస్కారములు, తలంపువకు వచ్చి బహిర్దృష్టి కలుగుచుండును. మరల వివేక ఖ్యాతికూడ వ్యుత్థానదశ సంస్కారములవలె వివేక ఖ్యాతికూడ పోవలెను. లౌకిక విషయ సంస్కారముల వంటిదే వివేక ఖ్యాతికూడ. ఇది సంప్రజ్ఞాత సమాధిలో కలుగును. అలాగాక పరవైరాగ్యమువలన అసంప్రజ్ఞాత సమాధి లభించినచో అప్పుడు వివేక ఖ్యాతి కూడ నశించిపోవును.

29 సూ॥ ప్రసంఖ్యానే ప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతిర్ధర్మ
మేఘుస్సమాధిః

ఆ వివేకఖ్యాతియందుకూడ విరక్తి కలిగినవానికి నిరంతరము వివేక జ్ఞానముండును గాన ధర్మమేఘుమను సమాధి అబ్బును. "ప్రసంఖ్యానమ్" అంటే వివేకఖ్యాతినే అలాగున అనెదరు. ఆవి వివేకఖ్యాతిని అభ్యసిస్తూ పోతే విశోక ఫలసహితమైన ఆ వివేక ఖ్యాతిని ప్రసంఖ్యానమ్ అంటారు. అంటే విశోకరూపఫలము కూడలభించును. దీనిని అవాంతర ఫలముందురు. విషయముల యందుండు అనురాగమును "కుశీద" మంటారు. అలా రాగము లేనివాడు విషయవిరాగి అనగా "అకుశీదకు" డగును ఆట్టి విరక్తునకు అన్ని విధములా అనగా పూర్వము కొన్ని సమయములలో బహిర్ముఖము కలిగి అప్పుడు వివేక ఖ్యాతి లేకుండ చేసేది. అది కేవల వివేకఖ్యాతి మాత్రమే. ఆ సాధన అలాగే చేస్తూపోతే విశోకా అనుఫలము వచ్చును. అప్పుడు ఇదివరలో కలిగిన వ్యుత్థానావస్థ కలుగదు.

అట్టి వివేకఖ్యాతి దృఢముగా యుండుటవలన ధర్మమేఘమను సమాధి కలుగనని చెప్పుచున్నారు. ఆ ధర్మమేఘ సమాధికలిగినచో పర వైరాగ్యము కలిగి వివేకఖ్యాతియందుకూడ విరాగము కలుగును. కైవల్యరూపమైన ఫలమును కలిగించేది. ధర్మమేఘ సమాధి. అప్పుడు యోగి అశుక్ల కృష్ణ కర్మగలవాడగును. కనుక పుణ్యము. పాపము లేక వాటికి అతీతుడుగా ఉంటాడు. పుణ్యపాపములకు అతీతమైన దే ధర్మమేఘసమాధి. అట్టి యోగి కైవల్యమును పదవిని పొందును. ఆ ధర్మమేఘ సమాధి ఫలము కైవల్యమే. విశోకమగు వివేక ఖ్యాతి యందుకూడ విరక్తి కలిగినవానికే అనగా అట్టి యోగికి ఎల్లప్పుడు "అహంబ్రహ్మాస్మి" భావమేయుండును. అంటే పురుషుడు వేరు ప్రకృతి వేరు. అని బాగా దృఢముగా గ్రహించి ఎల్లప్పుడు తాను పురుషుడననే భావనలోనేయుండిపోవును. సంప్రజ్ఞాత సమాధి పక్వదశలోపడిననే ధర్మమేఘ సమాధి కలుగును.

## 24-9-1974 మంగళవారము

**30 సూ॥ తతః క్లేశ కర్మ నివృత్తిః॥**

ధర్మమేఘ సమాధి కలిగినచో కష్టములు కలిగించే కర్మలు నివృత్తియగును. ధర్మమేఘ సమాధివలన అవిద్యాది క్లేశములు వాటికి కారణమైన కర్మలు అన్నియు నివృత్తియగును. అప్పుడు ప్రశాంతి స్థితి బాగా లభించును ధర్మమేఘ సమాధి లభించినచో పుణ్యపాపములకు అతీతులై యుందురు. అంటే కర్మలు పోవునంటే వానిని దూషించినవానికి పాపము పూజించినవారికి పుణ్యముపోవునని అర్థము చేసికొనవలెను.

**31 సూ॥ తదా సర్వావరణ మలాపేతస్య జ్ఞానస్యా నంత్యాత్ జ్ఞేయ మల్పమ్॥**

ధర్మమేఘ సమాధి లభించిన తర్వాత పుణ్యపాప కర్మల

కలితుడైనందునను, సర్వావరణ అతీతుడైనందువలనను అపుడు కలిగినజ్ఞానము సమస్తమునైన రాజస తామస గుణముల మాలిన్యములు అన్నియు తొలగిపోవును. సత్వగుణమునకు సంబంధించినవి మాత్రము కొన్నియుండును. అట్టి జ్ఞానమే అనంతమైన జ్ఞానమగును.

మాలిన్యమున్నచో ఇంకా చేయవలసినదియుండును. మాలిన్యము లేనందున అట్టియోగికి ఈలోకములో తెలిసికొనవలసిన పదార్థములన్నియు చాలా స్వల్పము, అల్పముగా కనుపించును "సర్వావరణం" అంటే రజోగుణ, తమోగుణ మాలిన్యములు చిత్తమును ఆవరించును అవి. అవిద్యాది క్లేశములు వాటికి సంబంధించినకర్మలు ఆ చిత్తమును ఆవరించుటచే జ్ఞానము బాగా కలుగదు. ఈ యోగి ప్రకృతి పురుష వివేకము కలిగే వరకు శీలించినందున ధర్మమేఘ సమాధి లభించినందున సమస్త మాలిన్యములు కర్మలు అన్నియు తొలగిపోయినవి అన్ని ఆవరణలు నశించిపోయినందున అప్పుడు కలిగిన జ్ఞానము అనగా ప్రకృతి పురుష వివేకము. విశుద్ధముగా ఉంటుంది. కనుక అది ఇంత అని వర్ణించుటకు వీలు కానిది. ఆ యోగి అనంతమైన జ్ఞానముగలవాడు కనుక వాని దృష్టిలో ఈలోకములోని వస్తువులు పెద్దదైన ఆకాశములో మిణుగురు పురుగులు ఎంత చిన్నవిగా కనుపించునో అలా కనుపించును. ధర్మమేఘ సమాధివల్ల సమస్త మాలిన్యములుపోయి పరవైరాగ్యము కలిగి అనంతజ్ఞానము కలుగుటవలన పురుషార్థరూపమైన అంటే సత్వ, రజస్తమోగుణములకు ఏమియు పనిలేదు. ఈ గుణములు ఇదివరలో అంటే జ్ఞానము కలుగక పూర్వము భోగాపవర్గాలుగా పనిచేసెడివి. ఇప్పుడు ధర్మమేఘసమాధి లభించుటవలన ప్రకృతి, మహత్తు, అహంకారం పంచతన్మాత్రలు సూక్ష్మశరీరం. స్థూల శరీరం పంచభూతములు

వీటివలన స్థూల, సృష్టికలుగును. స్వేదజ, అండజ, ఉద్భిజ్జ, జరాయుజములవి నాలుగు రకముల సృష్టి. నిద్రవచ్చినచో తమోగుణము, చంచలతయున్నచో రజోగుణము, ప్రశాంతముగా సుఖముగా యున్నచో, చెప్పినది చెప్పినట్లు తెలియును. ఇది సత్వగుణము. రజోగుణములో ఉన్నట్లే ఉండును గాని వాని మనస్సు ఎక్కడెక్కడో యుండును. తమోగుణములో నిద్ర ఒకపని చేయబోయి యింకొకటి చేయును. ఇది అందరిలోను మారిమారియుంటూనేయుండును. భోగములు అనుభవించునపుడు రజోగుణము యుండును. సత్వగుణము విజృంభించినచో వివేకము కలుగును. ఆ సత్వము ఇంకా విశుద్ధములోనికి వెళ్ళితే వైరాగ్యము కలుగును. సామాన్య సత్వములో సుఖములయందు అభిలాషయుండును. విశుద్ధ సత్వమును బాగా శీలించినచో ప్రకృతి పురుష వివేకము కలుగును. ఇంకా శీలించినచో ధర్మమేఘసమాధి లభించును. గుణములు ప్రకృతి సంబంధము కనుక గుణములు యిక్కడి వరకు పని చేయును. పురుషునకు భోగములు సమకూర్చును. వివేకఖ్యాతి కలిగినచో ఇక మోక్షమే పరిణామమంటే ప్రకృతి, మహత్తు అహంకారము, పంచతన్మాత్రలు సూక్ష్మశరీరము స్థూలశరీరము పంచభూతములు ఇలా పరిణమించును. జ్ఞానము కలిగినచో పైని చెప్పిన పరిణామము ఆగిపోవును. అంటే అనంత జ్ఞానము కలుగుటచే విశుద్ధ సత్వము బాగా విజృంభించి అవి చేయవలసిన అన్నియూ పోయి పురుషునకు కావలసిన మోక్షము సంపాదించిపెట్టినవి అంటే పరిణామము ఆగిపోయి ఆ గుణములు మోక్షమును సంపాదించి పెట్టినవి, విశుద్ధ సత్వమును బాగా శీలించుటచే ప్రకృతి పురుష వివేకము కలుగును. దీనిని యింకా శీలించుచుపోయినచో ధర్మమేఘసమాధి లభించును. దీనిని శీలించుటవలన విరాగము కలు

గును. దానివల్ల అసంప్రజ్ఞాతసమాధి లభించును. ఇక కైవల్య మోక్షము లభించినది. అజ్ఞానదశలో భోగమును సంపాదించెను. జ్ఞానదశలో అపవర్గమును సంపాదించెను. వివేకఖ్యాతికూడ నశించి నందున పరవైరాగ్యము లభించినది. అనంత జ్ఞానము లభించి నందున జనన, మరణ, సంసారము ఇక లేనందున ప్రకృతి మొదలగు గుణములు సృష్టిని ఆపివేసినవి.

ఓం లోకా సమస్తా సుఖినోభవంతు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం తత్సత్ ఓమ్



# విజయ ఘోషలు

దైవమతము ప్రతిష్ఠితమగును గాక!

కరుణామతము వృద్ధినొందును గాక!

శాంతిమతము స్థాపితమగును గాక!

సత్యమతము స్థిరప్రతిష్ఠనొందును గాక!

ధర్మమతము ఉద్ధరింపబడును గాక!

ఋషిమతము వర్ధిల్లును గాక!

స్వాతంత్ర్యమతము జయించును గాక!

జ్ఞానమతము వ్యాపకమగును గాక!

